

# ఉజ్జ్వల భవిష్యత్తు

తెలుగుసాహిత్యంలో 'విపుల', 'చతుర' జంట పత్రికలు ఓ కొత్త ఒరవడిని దిద్దాయి. ఉత్తమ సాహితీ సంప్రదాయ విలువలకు అత్యున్నత స్థానాన్నిస్తూ తేటతెలుగులో వెలువడే ఈ పత్రికలు తెలుగువారి మనస్సులను ఎంతగానో చూరగొన్నాయి. ముఖ్యంగా సమకాలీన నవలా సాహిత్యంలో 'చతుర'కు విశిష్టమైన స్థానం ఉంది. కుటుంబపరమైన ఆచారాలు, కట్టుబాట్లతో పాటు వర్తమాన సామాజిక అంశాలకు పెద్దపీట వేస్తూ వస్తున్న నవలలు పాఠకులను రంజింప చేయడమేకాదు, ఈ సమాజంలో పౌరులుగా తమ బాధ్యతను గుర్తుచేస్తున్నాయి. ఆలోచింపజేస్తున్నాయి. మీదుమిక్కిలి స్వల్పధరకే ప్రతినెలా ఉన్నతమైన నవలను, బోనస్‌గా మరెన్నో విజ్ఞానదాయకమైన అంశాలను అందించడం ముదావహం. ఇది నిజంగా తెలుగువారి అదృష్టంగా చెప్పవచ్చు. మూడున్నర దశాబ్దాల ఈ సుదీర్ఘ ప్రయాణంలో ఎక్కడా ఈ పత్రికలు ఆలస్యం కాకపోవడం 'ఈనాడు' సంస్థకే సాధ్యమైంది. తెలుగు సాహిత్యంలోని కమ్మదనంతో పాటు ఇతరభాషా నవలల్ని కూడా సరళసుందర శైలిలో అందించడం బాగుంది. ఎందరో కొత్త నవలా రచయితల్ని తెలుగువారికి పరిచయం చేయడం మరో విశేషం.

తెలుగు, ప్రపంచభాషల కథామంజరి 'విపుల' తెలుగు కథా ప్రియులకు షడ్రుచులతో కూడిన విందుభోజనమే. ప్రతినెలా తెలుగుతోపాటు ప్రపంచ భాషల్లోని ఆణిముత్యాల్లాంటి కథలను ఏర్చికూర్చి తేటతెలుగులో 'విపుల' తనదైన శైలిలో అందిస్తోంది. ఆయా రాష్ట్రాల, దేశాల ప్రజల జీవన విధానాల్ని, సంస్కృతీ సంప్రదాయాల్ని, భాషా పరిమళాల్ని తెలుగునేల నలుచెరగులా గుబాళింపచేస్తోంది. తెలుగువారి మదిని దోచుకుంటోంది. ఈ జంట పత్రికల భవిష్యత్తు మరింత ఉజ్జ్వలంగా ఉండాలని ఆశిస్తున్నా.

– మనోహర్ నాదెండ్ల,
సభాపతి, ఆంధ్రప్రదేశ్ శాసనసభ

## 'శ్రీవారికి ప్రేమలేఖ' రచయిత్రిగానే ఇప్పటికీ గుర్తింపు!



ముప్పై ఐదు సంవత్సరాలు దిగ్విజయంగా పూర్తి చేసుకుని, ముప్పైఆరులోకి అడుగిడుతున్న 'చతుర'కు నా హృదయపూర్వక అభినందనలు. 'చతుర'తో నా అనుబంధం మరపురానిది. ఇందులో 1982 అక్టోబరులో నా తొలి నవల 'ప్రేమలేఖ' ప్రచురితమైంది. ఆ నవల ఆధారంగా ఉషాకిరణ్ మూవీస్‌వారు 'శ్రీవారికి ప్రేమలేఖ' చిత్రాన్ని నిర్మించారు. ఆ సినిమా ఎంత పెద్ద హిట్ అయిందంటే, అందరూ నన్ను ఇప్పటికీ 'శ్రీవారికి ప్రేమలేఖ' రచయిత్రిగానే గుర్తిస్తారు. ఆ తర్వాత 'చతుర'లో నేను రాసిన 'అబలాయానం', 'సహజీవనం', 'ఆనందమానంద మాయెనే', 'ఏనాడు ఏ జంటకో' నవలలు ప్రచురితమయ్యాయి. పాతరచయితలు, కొత్త రచయితలనీ తేడా లేకుండా మంచి రచయితలకు, మంచి రచనలకు ప్రోత్సాహం అందజేస్తున్న 'చతుర'కు మరోమారు అభినందనలు!

– పొత్తూరి విజయలక్ష్మి,
రచయిత్రి, హైదరాబాద్

# డజన్లకొద్దీ రచయితలకు పుట్టిల్లు 'చతుర'



'చతుర'లో నా ప్రయాణం ఇరవైరెండేళ్ల క్రితం 'భయం' నవలతో ఆరంభమైంది. తర్వాత 'ది రోడ్', 'మనీషి' 'భువికి దిగిన తార' నవలలుగా వచ్చాయి. 'గట్టుమీద చేప'కు చతుర నవలల పోటీలో బహుమతి కూడా వచ్చింది. అనంతర కాలంలో 'భూషణంగారి భోషాణం', 'ఉరి', 'పావురం' నవలలు ప్రచురితమయ్యాయి. ఈ నవలల్ని ఇప్పటికీ అనేకమంది విమర్శకులు ప్రస్తావిస్తుంటారు. రామోజీరావుగారి విభిన్న శైలికి, సాహితీనిబద్ధతకు ప్రతీకలు విపుల / చతుర! వీటి ఆవిర్భావం తెలుగు సాహిత్యంలో ఓ ముందడుగు. చలసాని ప్రసాదరావుగారు తన డైనమిక్ బృందంతో వీటిని విజయపథంలో నడిపారు. 'చతుర' ద్వారా డజన్లకొద్దీ రచయితలు తయారయ్యారు. సీరియస్ నవలలు రాయటానికి ఈనాటికీ మనకు ఉన్న అతి తక్కువ వేదికల్లో 'చతుర' ఒకటి. కాలంతోపాటు చతురలో గుణాత్మక మార్పులు ఎన్నో వచ్చాయి. నవలేకాక 'కథ వెనుక కథ', 'ట్యాంక్‌బండ్ కథలు', ప్రపంచ సాహిత్యంలోని గొప్ప రచనలను పరిచయం చేసే 'కాలాతీతం', జ్ఞానపీఠాలు, పెద్దకథలు, చతురంగం, చతుర ప్ర.జ. లాంటి కొత్త శీర్షికలు గుబాళిస్తూ ఈ తరం పాఠకులకు మరింత చేరువయ్యాయి. వీటి ప్రస్థానం ఇలాగే అనంతంగా కొనసాగాలని ఆశిస్తూ..

**– పి. చంద్రశేఖర అజాద్,** సుప్రసిద్ధ రచయిత, హైదరాబాద్

# శతమానం భవతి



తెలుగు సాహిత్య పత్రికా చరిత్రలో 'విపుల', 'చతుర'ల శుభాగమనం ఓ అద్వితీయ ఘట్టం. సాహితీ విప్లవం! అతి తక్కువ వెలకు- కేవలం రూపాయి పావలాకే- నెలనెలా ఓ నవల! ఓ కథా సంపుటి! ఆ రోజుల్లో అదో సంచలనం. అదే చైతన్యం, అదే స్ఫూర్తి.. దీప్తి నేటికీ నిలిచి ఉండటం అపూర్వం! అనితర సాధ్యం!

సి.యస్. రావుగారి 'కమలమ్మ కమతం'తో ప్రారంభమైన 'చతుర' ప్రస్థానంలో ప్రతి సంచికా ఓ మైలురాయే. మేలి మలుపే. విభిన్న కథా వస్తువులతో పఠనాభిలాష పెంచాయి. విజ్ఞానాన్ని పంచాయి. నాబోటి ఎందరికో నవలా రచనకు మార్గదర్శకమయ్యాయి. చక్కని తెలుగు భాషలో.. మధురమైన మాండలిక సంభాషణలతో ఉన్నత భావ వ్యక్తీకరణతో విభిన్న నేపథ్యాలతో నాటి నుంచి నేటి వరకూ నిరాటంకంగా జయకేతనం ఎగురవెయ్యటం 'చతుర'కే చెల్లింది.

'చతుర'లో తొలిసారిగా నా నవల 'అశాంతి నికేతన్' మే 1984 సంచికలో అచ్చయింది. ఒకసారి 'చతురలో అత్యధికంగా నీ నవలలే అచ్చయ్యాయి' అని చలసానిగారు చెప్పినప్పుడు నేను ఏకంగా నోబెల్ బహుమతి లభించినట్లు పొంగిపోయాను. ఇంతవరకూ వివిధ పత్రికల్లో నావి నలభైతొమ్మిది నవలలు ప్రచురితమైతే, అందులో పదకొండు 'చతుర'లోనే కావడం విశేషం.

ఇక విశ్వకథా విపంచి 'విపుల' షడ్రుచుల కథా విందు. ప్రపంచ భాషల్లోని ఆణిముత్యాల్లాంటి కథల్ని చక్కని, చిక్కని తెలుగులో అందిస్తోంది. పాఠకులకు ఇతర భాషల్లోని అపురూప రచనల్ని పరిచయం చెయ్యడమేకాక వారి ఆలోచనా పరిధిని విస్తృత పరచడంలో అగ్రతాంబూలం 'విపుల'దే.

'విపుల'లో మొదటిగా నా కథ 'స్కైలాబ్' డిసెంబరు 1979లో వచ్చింది. అక్టోబరు 1980 సంచికలో మరో కథ 'నా ఇల్లు' ప్రచురితమైంది. నేను ఇంతవరకూ 240 కథలు రాసినా నేటికీ ఇదే నాకు ఇష్టమైన కథ.

కాలక్రమేణా తెలుగు కథల్ని పెంచటమేకాక హాస్య, రొమాంటిక్, రచయిత్రుల ప్రత్యేక సంచికలు వెలువరిస్తూ కొత్తపుంతలు తొక్కుతోంది 'విపుల'. ఈ జంట హంసలు- 'చతుర', 'విపుల'కు శతమానం భవతి!

**– సింహప్రసాద్,**
సీనియర్ రచయిత, హైదరాబాద్

# మనసున ఉన్నదీ...



★ 'చతుర' 36వ వసంతోత్సవంలో అడుగిడుతున్న శుభసందర్భంలో, ముందు ముందు పాఠకులను మంచి నవలలతో అలరించాలని కోరుతూ శుభాకాంక్షలు తెలుపుతున్నాను.

– **బమ్మ సత్యనారాయణ,** కొత్తగూడెం.

★ నేటి సమాజంలో జరుగుతున్న వాస్తవికతకు అద్దం పట్టింది 'చక్రాయుధం'. ఆమూలాగ్రం ఉత్కంఠతో చదివించింది. మాదక ద్రవ్యాలకు అలవాటు పడ్డవారి జీవితాలకు ఓ చక్కని గుణపాఠం ఈ నవల.

– **బిక్కునూరి రాజేశ్వర్,** పాస్కుల్

★ ముఖచిత్రం, చివరి కవర్‌పేజీ సింప్లీ సూపర్బ్. పి.యస్. నారాయణ 'చక్రాయుధం' చాలా అద్భుతం. ఈ నవలలోని పేర్లు, సందర్భాలు కళ్ళకు కట్టినట్లు చక్కగా రాశారు. ఇలాంటి నవలను అందించిన రచయితకు, ప్రచురించిన 'చతుర'కు అభినందనలు.

– **తోడేటి** సుబ్బమ్మ, రేపల్లె, గుంటూరు.

★ విద్య వివేకాన్ని పెంచుతుందంటారు. కానీ నేటి యువతలో లేనిదే వివేకం, విచక్షణ. అందరూ ఆనంద్‌లాంటి యువకులు, ప్రశాంత్ లాంటి పోలీసులుంటే సమాజంలో ఘోరాల అంకెలు గణనీయంగా తగ్గేవి. పి.ఎస్. నారాయణ 'చక్రాయుధం' ద్వారా కొంత ప్రయత్నం చేశారు. మా తరంలో కాకపోయినా, ముందు తరాల యువత మంచి మార్గాల్లో పయనిస్తుందని ఆశగా ఉంది.

– **శ్రీమతి మంచాళ లక్ష్మి,** విశాఖ

★ నీతి-రీతి రాతల నేపథ్యంలో.. అశ్లీలతకి ఆమడదూరం ఉంటూనే మూడున్నర దశాబ్దాలుగా తరాల అంతరాల మానవ నడక, నడతను ప్రతిబింబిస్తోంది 'చతుర'. వైవిధ్య భావ విభావరులతో.. పాఠక జనహృదయాల్ని ఈ పత్రిక దోచుకోవడం అద్భుతం! అభినందనీయం!! ఈ సాహితీ సౌరభాలను మరింతగా తెలుగు పాఠక జనావళికి అందిస్తారని ఆశిస్తున్నాం.

– **యు. చిట్టిబాబు,** కొత్త పాల్వంచ

★ ఫిబ్రవరి నవల 'చక్రాయుధం' ఆసాంతం ఏకబిగిన చదివించింది. సమాజంలో మత్తుపదార్థాలు, అశ్లీలతకు బానిసలైన యువకులే కాకుండా, దీనికి భిన్నంగా మంచి కోసం పరిశ్రమించేవాళ్లు కూడా ఉంటారనే సందేశాన్ని ఈ నవల ఇచ్చింది. ఇలాంటి మంచి నవలను అందించినందుకు అభినందనలు. హిందీ కథకుడు అమర్‌కాంత్ గురించి జ్ఞానపీఠాలులో చదివి ఆనందించాం. ఎక్కడెక్కడో జరిగిన అద్భుతాలను 'చతుర ప్రపంచం' ద్వారా తెలుసుకుంటున్నాం. చతురోక్తులు, కొత్తగాలులు, చతుర ప్ర.జ. ఎప్పటికప్పుడూ ఆకట్టుకుంటూ హాయిగా చదివిస్తున్నాయి.

– **అమరావతి,** అనంతపురం

★ 35 సంవత్సరాలుగా తెలుగు పాఠకులను అలరించి 36వ సంవత్సరంలోకి అడుగుపెట్టిన 'చతుర'కు అభినందనలు. సమాజంలో మాదక ద్రవ్యాల బారినపడి జీవితాలను కోల్పోతున్నవారెందరో. అలాంటివారికి పి.యస్.నారాయణ 'చక్రాయుధం' నవల గుణపాఠమవుతుంది. 'చతుర ప్రపంచం'లో కొత్తవిషయాలు చాలా తెలుస్తున్నాయి. ధన్యవాదములు.

– **వేదవ్యాస్ యర్రజన్ను,**
హైదరాబాద్.

★ నేటి సమాజ పరిస్థితులను దృష్టిలో ఉంచుకుని తదనుగుణమైన నవలలను అందిస్తున్న 'చతుర'కు ముందుగా అభినందనలు. ఫిబ్రవరిలో వచ్చిన 'చక్రాయుధం' నవల బాగుంది. క్షణం క్షణం ఉత్కంఠతో అలరించింది. ఇక జ్ఞానపీఠాలు, చతుర ప్రపంచం, ఎడిసన్ చతురోక్తులు బాగున్నాయి. ముందు ముందు ఇంకా మంచి శీర్షికలను అందించాల్సిందిగా ఆకాంక్షిస్తున్నాను.

– **వై. విశ్వజిత్,** హైదరాబాద్.

---

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com
vipula.chatura@eenadu.net

సంపుటి -36 సంచిక - 2
422వ సంచిక, పేజీలు : 132
మార్చి 2013

# చతుర






* ముఖచిత్రం : నటి కృతి కర్బందా
* చివరి కవర్ : మాస్టర్ సిద్ధార్థ్ కౌశిక్

పుస్తకాలంకరణ : రాజు యాట


**త**న భార్య రవళి ఉచ్చులో ఆకాష్ చిక్కుకుని ఉండగానే తన పథకం పూర్తి చేసుకోవాలనుకున్నాడు ఘటికాచలం.

'హోటల్ వనప్రియకు వెళ్దాం' అన్నాడతడు భార్య రవళితో.

'ఇప్పుడు అక్కడికెందుకు?' అందామె ఆందోళనగా..

'అక్కడికెళ్లాక ఈరోజు హోటల్‌లో ఆకాష్‌తో సరదాగా గడుపు' అన్నాడు.

'నన్ను ఎరగా వేసి నీ పబ్బం గడుపుకుంటున్నావ్. నా ఖర్చులకు మాత్రం డబ్బు ఇవ్వవు. నేను ఎక్కడికీ రాను' అందామె కోపంగా.

'నేను కష్టపడి సంపాదించేది అంతా నీ కోసమే కదా? భర్త చెప్పినట్లు భార్య నడుచుకోవాలి' అన్నాడు ఘటికాచలం.

ఏ భర్తయినా భార్యను పరాయి పురుషుడి వద్దకు పంపిస్తాడా? ఇంతకీ ఘటికాచలం తన భార్యను ఆకాష్ దగ్గరికి ఎందుకు పంపిస్తున్నాడు? అతని పథకమేమిటి?

ఆద్యంతం ఆసక్తిగా చదివించే **అలపర్తి రామకృష్ణ** నవల

**గుండె గుప్పెడంత**

ఆరో పేజీలో..

బొమ్మలు : పిన్నాడ రవి

'ఆ ఎండీ ఇంటర్వ్యూలో నా ఒంటిమీద ఆచ్ఛాదనలు తొలగించి చూస్తున్నట్లు అన్పించింది' అంది అనన్య.

'ఒంటిమీద ఏం లేకున్నా గమనించలేని స్థితిలో ఉన్నవాళ్లను అభినందించాలి. అందాలను ఆబగా చూసేవాళ్లతోనే సమస్య!' అంది సుప్రజ.

'ఎందుకో అతనలా చూస్తున్నా నాకేమాత్రం తప్పనిపించలేదు' అంది అనన్య.

'మొదటి చూపులోనే మనసు దోచాడా?' అంది సుప్రజ నవ్వుతూ.

'అలాంటిదేం లేదు లేవే! నన్నెంతో ఆత్మీయురాలిలా భావించి మాట్లాడాడు' అంది అనన్య.

'జాగ్రత్త! మగాడికి ప్రతి అందమైన మగువా ఆత్మీయురాలే. మాంసం ముక్క వాసన పసిగట్టి నక్కలు మూగుతాయి. బివేర్ ఆఫ్ జాకాల్స్!' అంది సుప్రజ.

ఇంతకీ ఆ ఎండీ ఎలాంటివాడు? అనన్యకు అతడితో కలిగిన అనుభవాలేమిటి? ఆద్యంతం ఉత్కంఠతో చదివించే అలపర్తి రామకృష్ణ నవల **గుండె గుప్పెడంత** చతుర మార్చి కానుక!



# గుండె గుప్పెడంత

- అలపర్తి రామకృష్ణ



విశాఖపట్నం నుంచి భీమిలికి వెళ్ళేదారిలో సిటీ అవుట్‌స్కర్ట్స్‌లో వున్న 'వసుధ హోల్డింగ్స్' ఆఫీసు భవనం ముందు ఆటో ఆపింది అనన్య.

అందమైన పరిసరాల్లోవున్న ఆ భవనం కేసి తేరిపారచూసింది. బంగారు రంగులో కాంపౌండ్ వాల్ మీద 'వసుధ హోల్డింగ్స్' అక్షరాలు మెరిసిపోతూ కన్పించేయి ఉదయంపూట ఎండలో.

తొలి అడుగు వేయబోతోంది. ఉద్యోగం కోసం వేస్తున్న ఆ తొలి అడుగు అది. ఉద్యోగం తప్పకుండా వస్తుందన్న ఆత్మవిశ్వాసంతో లిఫ్ట్‌వైపు నడిచింది. గేటు దగ్గర వాచ్‌మన్‌గాని, లిఫ్ట్‌బాయ్‌గాని తనను పలకరించలేదు... 'రేపు తనకు ఉద్యోగం వస్తే వాళ్ళంతా తనకు పరిచయమై తప్పకుండా ఆప్యాయంగా పలకరిస్తారు' అనుకుంది మనస్సులో.

గ్రౌండ్ ఫ్లోర్‌లోనే హెచ్.ఆర్. వింగ్ వుందని లిఫ్ట్‌బాయ్ విసుక్కుంటూ చెప్పడంతో రిసెప్షన్‌వైపు నడిచింది. రిసెప్షన్ ఎదురుగా ఉన్న లాంజ్‌లో దాదాపు పది మంది అమ్మాయిలు ఉన్నారు. వాళ్ళు కూడా తనలాగే ఉద్యోగం కోసం వచ్చినవాళ్ళని తెలుసుకుని కొద్దిగా నిరుత్సాహపడింది. మళ్ళీ ధైర్యం తెచ్చుకుని తనను ఇంటర్వ్యూకు ఎప్పుడు పిలుస్తారానని ఎదురుచూస్తూ కూర్చుంది అనన్య.

అటెండర్ వచ్చి ఆమెను పిలిచేక మేనేజర్ రూములోకి వెళ్ళింది.

"యం.డి. గారు ఇప్పుడే హైద్రాబాద్ నుంచి ఫ్లయిట్‌లో వొచ్చారు... హి ఈజ్ టూ టైర్డ్ టు టేకప్ ఇంటర్వ్యూస్... మరోరోజు వుంటుంది ఇంటర్వ్యూ. మీకు మళ్ళీ ఇంటిమేట్ చేస్తాం... యూ కెన్ గో మేడమ్!" అన్నాడు మేనేజర్.

అనన్యకు కోపం వచ్చింది.

హైద్రాబాద్ నుంచి విశాఖపట్నం ఫ్లయిట్‌లో వచ్చి అలసిపోవడం ఏమిటి? ఎడ్లబండి మీద ప్రయాణం చేసి వచ్చాడా ఆ యం.డి.? ఉదయం పదిగంటలప్పుడు టైరయిపోవడం ఏమిటి? ...

అంతా నాటకంలా వుంది... అమ్మాయిలను ఉద్యోగం పేరు చెప్పి చుట్టూ తిప్పించుకోవడానికి ఎత్తులేమో!

రిసెప్షనిస్టు దగ్గరకు వెళ్ళి "వేర్ ఈజ్ యువర్ యం.డి. రూమ్?" దర్పంగా అడిగింది అనన్య.

యం.డి. రూము ఎటువైపు వుందో చెప్పి "యు కెనాట్ మీట్ హిమ్ వితవుట్ యాన్ ఎపాయింట్‌మెంట్" అందామె.

రిసెప్షనిస్టు మాటలు విన్పించుకోకుండా యం.డి. ఛాంబర్ డోర్ నెట్టుకుని లోపలికి వెళ్ళింది.

యం.డి. ఛాంబర్ చాలా విశాలంగా వుంది. ఖరీదైన ఫర్నీచర్‌తో మెరిసిపోతూ వుంది. రివాల్వింగ్ ఛైర్‌లో విలాసంగా కూర్చుని స్టెనోకు ఏదో డిక్టేషన్ ఇస్తున్న యం.డి. ఆకాష్ డార్క్‌బ్రౌన్ సూటులో మెరిసిపోతూ కన్పించేడు.

ఛాంబర్‌లోకి దూసుకువొచ్చిన అనన్యవైపు తీక్షణంగా చూసింది స్టెనో. 'ఆ అమ్మాయిని నేను టాకిల్ చేస్తాను. నువ్వెళ్ళు!' అన్నట్లు స్టెనోవైపు చూశాడు ఆకాష్, నుదుటిమీద పడుతున్న జుట్టును ఓ చేత్తో సర్దుకుంటూ.

'అందమైన అమ్మాయి కన్పిస్తే చాలు... బాగానే టాకిల్ చేస్తాడు బాస్' అనుకుంటూ బయటకు వెళ్ళిపోయింది నలభయ్యేళ్ళ స్టెనో.

"హేవ్ ఎ సీట్" తన టేబుల్‌కు ఎదురుగా వున్న సీటు చూపిస్తూ అన్నాడతను విలాసంగా నవ్వుతూ.

బ్లూ కలర్ జీన్స్ ప్యాంటు, రోజ్ కలర్ టాప్‌తో చూడముచ్చటగా కన్పిస్తున్న అనన్యను కన్నార్పకుండా చూస్తూ వుండిపో

యాడతను.

తన బయోడేటా వున్న పేపరును అతని ముందు ఉంచింది.

రెండు నిముషాలు ఆమె బయోడేటాకేసి చూశాడు.

"ఎంబీఏ చదివారు... సాఫ్ట్‌వేర్‌తో బాగానే టచ్ వుంది... పర్సనల్ మేనేజ్‌మెంట్ పీజీ కూడా చేశారు... ఎవ్విరిథింగ్ ఓకే!.. కానీ ఎక్స్‌పీరియన్స్ లేదు కదా! జస్ట్ యు హేవ్ కమ్ ఫ్రమ్ ద ఊంబ్ ఆఫ్ యూనివర్సిటీ... విశ్వవిద్యాలయం నుంచి బయటకు రాగానే పెద్ద పెద్ద కంపెనీల్లో ఉద్యోగాలు రావాలంటే ఎలా? దూసుకుపోయే తత్వం, చక్కటి భావవ్యక్తీకరణ, అందరినీ మెప్పించే నేర్పు, కింది సిబ్బందితో కలివిడిగా వుండే లక్షణాలు వుండాలి. అప్పుడే మీరు మానవ వనరుల విభాగంలో రాణిస్తారు..." చెప్పుకుపోయాడు ఆకాష్ ఆమెకేసి కన్నార్పకుండా చూస్తూనే.

...ఇంతకీ ఈ కుర్ర యం.డి. తనకు ఉద్యోగం ఇస్తున్నాడా? లేదా? ఇచ్చే ఉద్దేశ్యం లేకపోతే మేనేజర్ పోస్టులో పని చేసే వ్యక్తికి వుండాల్సిన లక్షణాల గూర్చి తనకెందుకు లెక్చర్ దంచుతాడు.

ఎప్పుడూ అమ్మాయిలను చూడనట్లు తనవైపు తదేకంగా ఎందుకు చూస్తున్నాడు?

"మీ ఇంటి అడ్రెస్... ఫోన్ నెంబరు మా స్టెనోకు ఇచ్చి వెళ్ళండి" అన్నాడతను.

"పర్మిషన్ లేకుండా మీ ఛాంబరులోకి వొచ్చి మిమ్మల్ని ఇబ్బంది పెట్టాను. క్షమించండి!" అందామె సీట్లోనుంచి కదలకుండానే.

"అందమైన అమ్మాయితో మాట్లాడటం అందమైన అనుభవం... మీకు ఉద్యోగం ఇవ్వడం, ఇవ్వకపోవడం వేరే విషయం. మీ మనస్సు కష్టపెట్టకుండా మర్యాదగా మాట్లాడి పంపించాలిగదా!" అన్నాడతను లేచి నిలబడి.

అతను లేచి నిలబడటంతో తనను 'ఇక వెళ్ళొచ్చు!' అనే సంకేతాన్ని ఇచ్చినట్లుగానే భావించింది. సర్టిఫికెట్స్ పెట్టుకున్న డిస్‌ప్లే ఫైలు చేతిలోకి తీసుకుని లేచి నిలబడింది వెళ్ళిపోవడానికి.

"ప్లీజ్ సిట్ డౌన్... కొంచెం అనీజీగా వుంది.. కోటు తీసేస్తాను... హైద్రాబాద్‌లో బయల్దేరేటప్పుడు ఈ కోటు వేసుకున్నాను... విశాఖపట్నం వొచ్చేక కూడా తియ్యడానికి సమయం దొరకలేదు... మీరు పర్మిషన్ ఇస్తే కోటు తీసేస్తాను" అన్నాడతను వినయంగా.

నవ్వుకుందామె అతని మాటలకు.

కోటు తియ్యగానే బలిష్టంగా వున్న అతని చేతులు, విశాలమైన ఛాతీని చూసి 'ఆడవాళ్ళు అందంగా వుంటారు అని అందరూ అంటూ వుంటారు... ఇతన్ని చూస్తే అందం ఆడదాని సొత్తు కాదనిపించింది... అందగాడే!' అనుకోకుండా ఉండలేకపోయింది.

"మా వసుధ గ్రూప్ ఆఫ్ కంపెనీస్‌లో వసుధ హోల్డింగ్స్ చిన్న కంపెనీ... పవర్ ప్లాంటు, సిమెంటు కంపెనీలు, సాఫ్ట్‌వేర్ కంపెనీలు కూడా ఉన్నాయి మాకు... మా హెడ్ ఆఫీస్ హైద్రాబాద్‌లో వుంది. బెంగుళూరులో కూడా మా ఆఫీస్ వుంది. మా కంపెనీ ఎఫైర్స్‌తో తలవాచిపోతూ ఉంటుంది... అయినా తప్పదు కదా!"

బజర్ నొక్కి అటెండర్‌ను పిలిచి కాఫీ పట్టుకురమ్మని చెప్పాడు.

"వసుధ అంటే మీ ఆవిడ పేరా?" అడిగింది.

పెద్దగా నవ్వాడు కోటు విప్పేసి.

...అంతగా నవ్వు వచ్చే ప్రశ్నేం తను వెయ్యలేదే?

"మా అమ్మమ్మ పేరు వసుధ. మా

తాతగారు బుచ్చినాయుడు గారు బ్రిటిష్ గవర్నమెంటులో పెద్ద అధికారి. బాగా సంపాదించేడు... మనకు స్వతంత్రం వొచ్చేక దాచుకున్న డబ్బు బైటకు తీసి ఎన్నో కంపెనీలు పెట్టాడు. హైద్రాబాద్ బంజారాహిల్స్‌లో రాజభవనంలాంటి పెద్ద ఇల్లు ఉంది మాకు... బిక్కుబిక్కు మంటూ నేను, మా అమ్మగారు ఉంటున్నాం... ఆస్తికంతా నేనే వారసుడిని" అన్నాడతను టై వదులు చేసుకుంటూ.

...అవును. ఆ విషయాలన్నీ తనకు ఎందుకు చెబుతున్నట్లు... పెళ్ళి అయ్యిందో లేదో చెప్పడే!

'అతనికి పెళ్ళయ్యిందా? పిల్లలెంతమంది?' ఆ వివరాలు మాత్రం తనకెందుకు? అతను ఎన్నో కంపెనీలకు అధిపతి... తను మిడిల్ క్లాసు ఆడపిల్ల... మిడిల్ క్లాసు మెంటాలిటీ అలాగే ఉంటుందేమో! కోరికలు గుర్రాల్లా పరుగెడుతూ ఉంటాయి... ఆశల అశ్వాన్ని కళ్ళెం వేసి అదుపులో పెట్టుకోకపోతే ఇబ్బందే!

అటెండర్ కాఫీ కప్పులు తెచ్చి ఇద్దరికీ ఇచ్చాడు.

"మైనేమ్ ఈజ్ ఆకాష్... నాకు ఆకాశమే హద్దు... నా వ్యాపార సామ్రాజ్యాన్ని బాగా విస్తరింపచెయ్యాలి... అంబానీ సోదరులకు వ్యాపారంలో ఆకాష్ పోటీపడాలి! దట్ ఈజ్ మై యాంబిషన్!" అన్నాడతను ఉద్రేకంతో ఊగిపోతూ.

మారిపోతున్న అతని మొహంలోని రంగులను చూసి విస్తుపోయింది అనన్య. ఓ క్షణంలో అతనిని చూడటానికే భయం వేసింది...

"యూ మే గో నౌ" అన్నాడతను.

యమ్.డి. ఛాంబరులో నుంచి బయట పడింది.

అనన్యకు స్టెనో ఎదురుపడింది.

"ఇంతసేపు ఈ అమ్మాయి బాస్ గదిలో ఉందంటే బాస్‌కు 'గ్రీన్ సిగ్నల్' ఇచ్చి ఉంటుంది... ఎలాంటి అమ్మాయినైనా నిమిషాల్లో బుట్టలో వేసుకుంటాడు గురుడు" అనుకుంది స్టెనో.

★ ★ ★

ఇంటికి వెళ్లేసరికి పాత స్కూటరు రిపేరు చేస్తూ తండ్రి కన్పించేడు.

శివరావు ఎప్పుడో పాతికేళ్ళ క్రితం బి.హెచ్.వి.పి.లో మెకానిక్‌గా చేరినప్పుడు కొనుక్కున్న స్కూటరది. ఉద్యోగంలో చేరిన సంవత్సరంలోనే పెళ్ళయ్యింది. పడుచు పెళ్ళాన్ని ఎక్కించుకుని విశాఖపట్నం వీధులన్నీ తిరిగేడు. వరసనే ముగ్గురు పిల్లలు పుట్టుకొచ్చారు. వాళ్ళందరినీ ఎక్కించుకుని తిరిగాడు.

స్కూటరుకు వచ్చిన చిన్న చిన్న రిపేర్లు అన్నీ అతనే చేసుకునేవాడు. స్కూటరు పార్టులన్నీ విప్పి ఆయిల్‌లో ముంచి క్లీన్ చేసి మళ్ళీ బిగించడం సరదా. ఐదారు సార్లు ఎక్సిడెంట్లు అయ్యాయి. చిన్న చిన్న సొట్టలు పడటం తప్పితే ఆ వెస్పా స్కూటరు నమ్మకంగా పనిచేస్తూనే ఉంది. ఇంట్లో ఎలక్ట్రికల్ రిపేర్లు అయినా, వాటరు సంపు చెడిపోయినా అతనే బాగుచేసుకుంటాడు.

గేటు దాటి ఇంట్లోకి వస్తూ "ఏం నాన్నా? ఈ రోజు నైట్ షిఫ్టా?" తండ్రిని అడిగింది.

తలూపి "వెళ్ళిన పని ఏమయ్యిందమ్మా? ఇంటర్వ్యూ బాగా చేశావా? ఉద్యోగం వచ్చే అవకాశాలు ఉన్నాయా?" అడిగాడు కూతుర్ని.

"ఏ విషయం చెప్పలేదు... మళ్ళీ పిలుస్తారేమో!"

ఇంటర్వ్యూ గూర్చి గుచ్చి గుచ్చి అడిగి కూతుర్ని నిరుత్సాహపర్చకూడదనుకున్నాడు.

"కాళ్ళూచేతులు కడుక్కుని భోజనం చెయ్యి తల్లీ! ఉదయం ఉప్మా తినివెళ్ళావు. బాగా ఆకలి వేస్తూ ఉండి ఉంటుంది" అన్నాడాయన.

"వంట ఎవరు చేశారు? చెల్లెలు చేసిందా? "

"సుప్రజకు పరీక్షలట.. చదువుకుంటోంది... నేనే వంట చేశాను"

"తమ్ముడిక్కూడా వంటచెయ్యడం నేర్పాల్సింది నాన్నా! మీకు కొంత శ్రమ తగ్గేది" అంది నవ్వుతూ.

"మీ తమ్ముడు ఈ రోజు ఓ ఘనకార్యం చేశాడు. పక్కింటి అబ్బాయిని చితకబాదేడు"

"ఎందుకు? " ఆదుర్దాగా అడిగింది.

పక్కింటి అబ్బాయి శ్రీనివాస్ మంచి కుర్రాడే! సుప్రజ చదివే ఇంజినీరింగ్ కాలేజీలోనే చదువుకుంటున్నాడు. సుప్రజకంటే ఓ సంవత్సరం సీనియర్. సుప్రజ మీద ఆ అబ్బాయి ప్రత్యేకమైన అభిమానం చూపించడం చాలాసార్లు అనన్య గమనించింది. అసభ్యంగా ఎప్పుడూ ప్రవర్తించలేదు.

"సుప్రజ పెరట్లో చెట్టుకింద కూర్చుని చదువుకుంటూ వుందట. ఆ అబ్బాయి పెరటి గోడ దగ్గర నిలబడి సైగలు చేస్తున్నాడట... మీ తమ్ముడికి అది పెద్ద తప్పుగా అన్పించి శ్రీనివాస్‌ను కొట్టాడు" చెప్పుకుపోయాడు శివరావు ఆ సంఘటన గూర్చి.

ఇంట్లోకి వెళ్ళకుండా పక్కింటికి వెళ్ళింది అనన్య.

వరండాలో కూర్చున్న శ్రీనివాస్ అనన్యను చూసి లేచి నిలబడ్డాడు.

"కూర్చో బాబూ! ఐయామ్ వెరీ సారీ! మా తమ్ముడు తొందరపడ్డాడు. మనస్సులో పెట్టుకోకు..." అందామె

అనన్య రావడం గమనించిన శ్రీనివాస్ తల్లిదండ్రులు కూడా హాల్లో నుంచి వరండాలోకి వచ్చారు.

"సుప్రజ అంటే వేరీ కన్‌సర్న్‌గా ఉంటాను. కాలేజీలో కూడా ఎవరన్నా మీ చెల్లెల్ని చూసి వెకిలిగా మాట్లాడితే ఊరుకోను... కంప్యూటర్ బుక్ అడిగితే ఇద్దామని పెరటిగోడ దగ్గరకు వచ్చాను... నేరుగా ఇంట్లోకి వచ్చి పుస్తకం ఇవ్వొచ్చు! నాక్కూడా పరీక్షలు... టైం వేస్ట్ అవుతుందని పెరటి గోడ దగ్గరకు వచ్చి పుస్తకం తీసుకొమ్మని సైగలు చేశాను... అది చూసి మీ తమ్ముడు ఫైర్ అయ్యాడు" అసలు విషయం వివరంగా చెప్పాడు శ్రీనివాస్.

శ్రీనివాస్ తల్లిదండ్రులకు నమస్కరించి "మా తమ్ముడి తరపున క్షమాపణలు చెబుతున్నా! మమ్మల్ని క్షమించాలి" అంది.

"కుర్రాళ్ళు ఈ రోజు కొట్టుకుంటారు... రేపు కలసి పోతారు. దానికి క్షమాపణలు ఎందుకు? " అన్నాడు శ్రీనివాస్ తండ్రి.

వాళ్ళది పెద్దమనస్సు! ఎంతో ఆనందపడింది...

తేలికపడిన మనస్సుతో ఇంటికి తిరిగి వచ్చింది

★ ★ ★

ఎక్కడెక్కడో తిరిగి సాయంత్రం ఐదింటికి ఇంటికి వచ్చాడు కార్తీక్.

"అక్కా! ఆకలవుతోందే!" అనన్యవైపు

**కొత్తగాలి...** 

**దేశరాజధానిలో**
**చలి మాత్రమే కాదు**
**మానవమృగాల స్వైరవిహారమూ**
**వణుకు పుట్టిస్తోంది**

– తాజీ ప్రసాద్, చెన్నై

చూస్తూ అన్నాడు.

"కాలేజీకి వెళ్ళలేదు కదూ!"

మౌనంగా ఉండిపోయాడు.

"ఇంటర్ పూర్తి చేయడానికి నాలుగేళ్ళు పట్టింది... డిగ్రీకి వచ్చావ్... చదువుమీద శ్రద్ధలేదు... స్నేహితులతో బలాదూర్‌గా తిరుగుతావ్... అందరిమీద యుద్ధానికి వెళతావ్" అంది అనన్య కొంచెం కోపంగా.

ఇంట్లో భోజనం చేసి కాలేజీకని చెప్పి స్నేహితుడి ఇంటి దగ్గర చేరతాడు. ఆ స్నేహితుడి తల్లిదండ్రులిద్దరూ ఉద్యోగులు. ఉదయం వెళ్ళితే రాత్రి ఏడింటికి గాని ఇంటికి తిరిగిరారు. వాళ్ళింటి ప్రహరీగోడ మీద వరుసగా కూర్చుంటారు. ఐదారు

## కొత్తగాలి...

**గాంధీ పుట్టిన దేశం**
**రాముడు నడచిన దేశం**
**నేడు అతివల రోదనలతో**
**బలిదానాలతో కలుషితం**

*– యు. శైలజ, మచిలీపట్టణం*

గురు అక్కడ చేరి సాయంత్రం వరకు సినిమాల గురించో, అమ్మాయిల గురించో, క్రికెట్ గురించో ఒకటే కబుర్లు.

రోజూ ఆ గోడమీద చేరకపోతే తోచదు వాళ్ళకి.

చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళు చిరాకుపడ్డా పట్టించుకోరు.

"శ్రీనివాస్‌ను కొట్టావట గదా!" అంది అనన్య.

తండ్రి జేబులోంచి పదిరూపాయల నోటు తీసుకుంటుంటే చెల్లెలు చూసింది... 'అక్కకు చెబుతాను' అంది చెల్లి... ఆ కోపం పెరటిగోడ దగ్గర చేరి చెల్లెలుతో మాట్లాడటానికి ప్రయత్నించిన శ్రీనివాస్‌పై చూపించాడు...

ఏం మాట్లాడలేదు కార్తీక్.

అక్క అంటే గౌరవం... అక్క మొహంలోకి సూటిగా చూసి మాట్లాడాలంటేనే బెరుకు...

చిన్నప్పుడే తల్లి చనిపోయింది.

అక్కే తనకు అన్నం పెట్టేది... చెల్లెలు, తనూ అక్క ఏదంటే అది చేసేవాళ్ళు.. తల దువ్వేది, బట్టలు ఉతికేది... ఇంట్లో చాకిరి చేస్తూ చదువుకునేది. చెల్లెలు కూడా చదువులో చురుకే!

అతడికి చదువు మీద శ్రద్ధ లేకపోవడంతో చదువబ్బలేదు.

"పెద్ద పెద్ద చదువులు చదివి ఉద్యోగాలే చెయ్యాల్సిన అవసరం లేదు... కష్టపడి బతుకు బండి నెట్టుకు వచ్చినా గౌరవం ఉంటుంది. అందరికీ పెద్ద ఉద్యోగాలు ఎక్కడ దొరుకుతాయి... మోటార్ బైక్‌లు రిపేర్ చెయ్యడం నేర్చుకుని చిన్న మెకానికల్ షాపు పెట్టుకున్నా సంఘంలో గౌరవం ఉంటుంది. ఆ అబ్బాయి ఏం తప్పు చెయ్యకపోయినా అతన్ని కొట్టావ్... అతన్ని కలిసి 'సారీ' చెప్పు... మళ్ళీ ఎప్పుడూ అటువంటి పనులు చెయ్యకు" శాసిస్తున్నట్లు గొంతు పెంచి అంది అనన్య.

తండ్రి దగ్గర బాగా చనువు ఉండటంతో ఆయన ఏం చెప్పినా ఆ చెవితో విని ఈ చెవితో వదిలేసేవాడు. అక్క ఏది మాట్లాడినా శాసనంలాగే వినిపిస్తుంది కార్తీక్‌కు. చిన్నప్పటి నుంచి అలా అలవాటయ్యింది.

వేడి వేడిగా మినపట్లు వేసింది.

అవి తినేసి తండ్రి గదిలో దూరేడు కార్తీక్.

★ ★ ★

అక్కాచెల్లెళ్ళు ఇంటి ముందు గేటుకు దట్టంగా పాకిన సన్నజాజి తీగ దగ్గర చేరి

మొగ్గలు కోసి వెదురుబుట్టలో వేసుకుంటు న్నారు.

"ఈ రోజు ఇంటర్వ్యూకు వెళ్ళానుగదా! అక్కడ ఆఫీసులో యమ్.డి. వెరీ పెక్యులి యర్‌గా కన్పించాడే! అతని కళ్ళు ఎక్స్‌రే కళ్ళులా ఉన్నాయి... నా ఒంటి మీద ఆచ్ఛాదనలు తొలగించి చూస్తున్నట్లు అన్పించాయి అతని వాడి చూపులు" అంది అనన్య ఇంటర్వ్యూ విశేషాలు చెబుతూ.

ఇద్దరి దగ్గరే బాగా ఓపెన్ అప్ అయ్యి మాట్లాడేది... మొదటి వ్యక్తి చెల్లెలు... మరో వ్యక్తి ఫేస్‌బుక్‌లో పరిచయం అయిన నయనిక దగ్గర. నయనికను ఎప్పుడూ చూడలేదు. అమెరికాలో ఆ అమ్మాయి ఉంటున్నా అనన్య మనస్సును తాకింది ఛాటింగ్‌లో. ఇద్దరివీ ఒకే భావాలు.

"ఒంటిమీద బట్టలు లేకపోయినా గమ నించలేని ఉన్నత స్థితిలో మనస్సు ఉన్నవా ళ్ళని అభినందించాలి గాని, ఒంపుసొం పుల్ని చూపులతో తాగే సేవాళ్ళకు దూరంగా ఉండాలి అక్కా!" అంది సుప్రజ.

"ఎందుకో అతను అలా చూస్తున్నా తప్పని అనిపించలేదు"

"మొదటి చూపులోనే మనస్సుకు నచ్చాడా ఏమిటి? లవ్ ఎట్ ఫస్ట్ సైట్ లాంటి ఫీలింగు కలిగిందా ఏమిటి?" నవ్వుతూ అడిగింది అక్కను.

"అదేం లేదు లేవే! ఆత్మీయురాల్లా గుర్తించి మాట్లాడినట్లు అన్పించింది... అఫ్‌కోర్స్... పదినిమిషాల పరిచయంలో అతని కేరక్టర్ బేరీజు వేయలేమనుకో!"

"జాగ్రత్తక్కా! మగవాడికి ప్రతి అంద మైన అమ్మాయి ఆత్మీయురాలిగానే అన్పి స్తుంది... బీ కేర్‌ఫుల్... మాంసం ముక్క వాసన పసిగట్టి నక్కలు మూగిపోతాయి. బివేర్ ఆఫ్ జాకాల్స్!"

చెల్లెలి మాటలు నవ్వు తెప్పించాయి.

"అంత ప్రమాదకరమైన వ్యక్తిలా అన్పిం చడం లేదే!" అంది చెల్లెలుతో.

సన్నజాజి మొగ్గలు కొయ్యడం అయ్యాక వరండాలో కూర్చుని మాల అల్లుకున్నారు.

"ఈ పూట వంట ఏం చేద్దాం?" అడి గింది చెల్లెల్ని.

"పొద్దున వండిన చుక్కకూర ఉంది కదా! పప్పుచారు చేసుకుని వడియాలు వేయించితే సరిపోతుంది" అంది సుప్రజ.

...తండ్రికి బాగా తిండిపుష్టి ఉంది. రాళ్లు తిన్నా హరాయించుకునే శక్తి ఉందా యనకు. రెండు మూడు కూరలన్నా ఉండాలి. రోటి పచ్చడి తప్పనిసరిగా ఉండాలి. నాన్ వెజిటేరియన్ కూరలంటే మహా ఇష్టం. రోజూ వండి పెట్టినా ఇష్టంగా తింటాడాయన...

...తనకు ఉద్యోగం వొస్తే తండ్రికి, తమ్ముడికి నాలుగైదు రకాల కూరలు వండి పెట్టొచ్చు! ఖర్చుకు వెనకాడే ప్రసక్తి ఉండదు. తండ్రికి జీతం పూర్తిగా రాదు. లోన్లు తీసుకోవడంతో సగం జీతమే చేతికి వస్తుంది...

...మరో రెండేళ్ళు కష్టపడితే చెల్లెలు ఇంజినీరింగు కూడా పూర్తయి దానిక్కూడా ఉద్యోగం వస్తుంది... ఆర్థిక ఇబ్బందులుం డవు...

"ఏమిటక్కా ఆలోచిస్తున్నావ్?"

"చుక్కకూర పెసరపప్పుతో వండితే- నాన్న చాలా బాగుంది... రాత్రికి చుక్క కూర అట్టిపెట్టు- అన్నాడే! ఆ కూర ఆయ నకే సరిపోతుంది... లేత వంకాయలు ఉన్నాయి. మెంతికారం పెట్టి వండుదాం" అంది అనన్య వంటింట్లోకి వెళ్తూ.

ఆ రాత్రి భోజనం చేస్తూ "నీ చేతి వంట రుచి చూస్తుంటే మీ అమ్మ గుర్తుకు వొస్తుంది తల్లీ! నిన్ను పెళ్ళి చేసుకున్న వాడు సుఖపడతాడు... పెళ్ళికి ముందు నీ చేతివంట రుచి చూశాడంటే పెళ్ళికొ

డుకు పైసా కట్నం అడగడు" అన్నాడు శివరావు.

"నీవన్నీ వట్టి మాటలు నాన్నా! బాగా ఆస్తి ఉన్న అమ్మాయిని చేసుకోవాలని అందరూ కోరుకుంటారు... చేతిలో డబ్బు ఉంటే ఏ స్టార్ హోటల్‌కో వెళ్ళి రకరకాల కర్రీస్ రుచి చూడొచ్చు... వంట ఇంటి శ్రమా తప్పుతుంది" అంది సుప్రజ.

సుప్రజ మాటలకు నవ్వుకున్నారందరూ.

అందరి భోజనాలయ్యాక తను భోజనం చెయ్యడానికి డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుంది. కూరల గిన్నెలన్నీ ఖాళీగా ఉన్నాయి. కూరలు మిగల్లేదు.

'ఇంట్లో అందరూ తృప్తిగా తన వంటను మెచ్చుకుంటూ తిన్నారు... అదిచాలు' అనుకుంది అనన్య. అన్నంలో ఆవకాయ పచ్చడి కలుపుకుని తిని, కొద్దిగా పెరుగు అన్నం తిని భోజనం ముగించింది.

నైట్ షిఫ్ట్‌కు వెళ్ళిపోయాడు శివరావు స్కూటరు మీద.

హాలుకు రెండువైపుల రెండు గదులున్నాయి. ఓ పడక గదిలో అక్కాచెల్లెళ్లు పడుకుంటారు. మరోగది కార్తీక్, శివరావు ఉపయోగించుకుంటారు.

అక్క పక్కన పడుకుంది సుప్రజ.

రోజూ ఓ గంట సేపు వాళ్ళిద్దరూ కబుర్లు చెప్పుకోవడం అలవాటు.

"అందరూ ఆనందంగా ఉండాలని కోరుకుంటావ్... పాజిటివ్ థింకింగ్ తప్పితే నెగెటివ్ థింకింగ్ నీలో రాదు... అమృత మూర్తివి అక్కా!" అంది అక్క మీద చెయ్యి వేసి.

"పొగడ్తలు ఆపి పడుకో... తెల్లవారుజామున లేచి చదువుకోవాలన్నావు కదా!"

"రేపు నీ బర్త్‌డే అక్కా! జీడిపప్పు, కిస్‌మిస్ వేసి పాయసం చేసి పెట్టాలి"

"నా బర్త్‌డే రోజు కూడా కష్టపడి నీకు పాయసం, గారెలు వండిపెట్టాలన్న మాట! వంట నేర్చుకుని నాకు పిండివంటల రుచి చూపిద్దామని లేదు... భలే చెల్లెలు, తమ్ముడు దొరికారు నాకు" అంది సుప్రజ నుదురు ముద్దుపెట్టుకుంటూ.

అరగంట గడిచేక నిద్రలోకి జారుకుంది సుప్రజ.

మళ్ళీ పదినిమిషాలకే ఉలిక్కిపడి లేచి అక్కను గట్టిగా వాటేసుకుంది.

"ఏమిటే పిచ్చిపిల్లా! పీడకల వచ్చిందా? " చెల్లెల్ని అడిగింది.

"పీడకల కాదు మంచి కలే వచ్చింది... వైభవంగా నీపెళ్ళి జరిగిందట. నువ్వు అత్తగారింటికి వెళ్ళిపోతున్నావు... అప్పగింతలప్పుడు పలికించే సన్నాయినాదం వినగానే నాకు ఏడుపు వచ్చింది... నువ్వు పక్కన లేకుండా నేను ఎలా ఉండాలి? నువ్వు దూర ప్రాంతానికి వెళ్ళిపోతే నేను నిన్ను ఒదిలి ఎలా ఉండగలను?... భోరున ఏడ్చానట... వెంటనే మెలకువ వచ్చింది" తనకు వచ్చిన కల గూర్చి చెప్పింది.

"నీక్కూడా మంచి మొగుడు వొస్తాడ్లే! నన్ను మరచిపోయి నీ భర్తకౌగిట్లో దూరిపోతావ్!" అంది అనన్య.

ఇద్దరూ నవ్వుకున్నారు.

మనస్సు తేలిక పడటంతో మళ్ళీ నిద్రలోకి జారుకుంది సుప్రజ.

అనన్యకు మాత్రం నిద్ర పట్టలేదు.

యమ్.డి. గుర్తుకొచ్చాడు.

వసుధ హోల్డింగ్స్‌లో తనకు జాబ్ వస్తుందా?

ఆ కంపెనీలో ఉద్యోగం వచ్చినా ఎక్కువ కాలం చెయ్యదు... అది రియల్ ఎస్టేట్ కంపెనీ. చెప్పుకోదగ్గ అనుభవం ఏదీ రాదు... ఓ సంవత్సరం పనిచేస్తే చాలు!...

మరో మంచి కంపెనీలో మేనేజర్ పోస్టుకోసం ప్రయత్నించాలి!

## 'రివర్' అంటే..?

శరీరంలోని చాలా భాగాలను చూపించి వాటినేమని పిలువాలో అడిగితే మనం చెప్పలేము. కనుబొమల మధ్య నుదుటి కింద బొట్టు పెట్టుకునే చోటును ఆంగ్లంలో గ్లబెల్లా అంటారు. అప్పుడే పుట్టిన పసికందు మొదటి ఏడుపుని వజిటస్ అంటారు. నమిలిన భోజనాన్ని బయటికి ఉమ్మేయడాన్ని



ఛాంకింగ్ అంటారు. కారే ముక్కుకు రైనోర్హా అని, కడుపులోని గడబిడను కోల్లివాబుల్స్ అంటారు. సంగీతం వింటూ పొందే మానసికోద్రేకానికి ఫ్రిస్సన్ అని పేరు. చేతి మణికట్టు లోపలి భాగంలోని ముడతలని రాస్కెటా అంటారు. ముక్కుకి ఉండే రెండు రంధ్రాల మధ్యగల భాగాన్ని కొలుమెల్లనాజి అంటారు. భుజానికి, మోచేతికి మధ్యగల భాగం హ్యూమెరస్. పైపెదవికి, ముక్కుకి మధ్య మీసం మొలిచే భాగాన్ని ఫిల్త్రమ్ అంటారు.

ఇలాగే కొన్ని వస్తువుల భాగాలకు కూడా ప్రత్యేక పేర్లు ఉన్నాయి. కాఫి గ్లాసు పైఅంచు బయటి భాగాన్ని జార్ఫ్ అంటారు. టూత్‌బ్రష్ పైన పేస్టును పూశాక ఇక దాన్ని పేస్ట్ అనరు. నర్డుల్ అంటారు. మీరు చదివే ఈ వాక్యాల్లోని పదాల మధ్యన గల తెల్లటి ఖాళీని రివర్ అంటారు. చెప్పుల దుకాణంలో పాదాల పొడవు, వెడల్పులను కొలిచే యంత్రాన్ని బ్రేన్నాక్ డివైస్ అంటారు. ఎవరి మీదైనా కోపం వచ్చి వేగంగా తినడాన్ని, గాలి పీల్చుకుని వదలడాన్ని మిసోఫోనియా అంటారు. వైన్ సీసా అడుగు భాగాన్ని పంట్ అంటారు. ఆదర్శం ప్రకారం కాక తన లాభంకోసం మసలుకునే వ్యక్తిని స్నొల్లిగోస్టర్ అంటారు. ఆకాశం క్రమంగా చీకటి పడటాన్ని డార్నెల్ అంటారు. ఓ పదాన్ని పదేపదే ఉచ్చరిస్తుంటే దానర్థం కోల్పోవడాన్ని జమయిస్వు అంటారు. ఉదాహరణకు రామరామ లాంటివి.

## అరుదైన దీర్ఘ నిద్ర వ్యాధి?!





అమెరికాలోని పెన్సిల్వేనియాకి చెందిన అమ్మాయి నికోల్ ఓ వింతరోగం బారిన పడింది. దీర్ఘంగా నిద్రపోవడమే ఆమె వ్యాధి. దీన్ని 'స్లీపింగ్‌బ్యూటీ సిండ్రోమ్' అంటారు. 2011లో ఆమె వరుసగా అరవైనాలుగు రోజులు నిద్రపోయింది. తల్లి నిద్రలేపి భోజనం పెడితే దాన్ని తినడానికి, బాత్‌రూంకి వెళ్లేందుకు మాత్రం కొద్దిసేపు మేల్కొనేది. దాదాపు నిద్రాణ స్థితిలోనే ఆ పనులు చేసేది.



మొదట్లో కూతుర్ని సోమరి అని తల్లి తిట్టేది. కాని ఆమె త్వరలోనే అదొక రోగమని గ్రహించింది. నికోల్‌ని అనేక ఆసుపత్రులకు తీసుకెళ్లింది. ఏ వైద్యుడికీ ఆమె వ్యాధికి కారణం అంతుపట్టలేదు. చివరికి అల్బెనీ జనరల్ హాస్పిటల్‌లోని ఓ డాక్టరు దీన్ని క్లైయిన్-లెవిన్ డిజార్డర్ అనే అరుదైన రోగమని గుర్తించాడు. దీని బారిన పడ్డవారు వారాలు, నెలలు, ఒక్కోసారి ఏళ్ల తరబడి ఎలాంటి లక్షణాలు లేకుండా ఉంటారు. అకస్మాత్తుగా ఓ రోజు అధిక నిద్ర బయట పడుతుంది. అధిక నిద్రేకాక చిన్నపిల్లల్లా ప్రవర్తించడం, జరగనివి జరుగుతున్నట్లు ఊహించడం, చుట్టుపక్కల జరిగేది గమనించకపోవడం తదితర లక్షణాలు ఉంటాయి. మొదటిసారి ఈ రోగం గురించి క్లెయిన్ అనే డాక్టర్ ఆక్స్‌ఫర్డ్ జర్నల్‌లో వ్యాసం రాయడంతో దీనికి క్లెయిన్-లెవిన్ డిజార్డర్ అనే పేరు పెట్టారు. 'క్లెయిన్-లెవిన్ సిండ్రోమ్ ఫౌండేషన్' ఈ రోగం గురించి పరిశోధన చేస్తోంది. ప్రపంచంలోని వివిధ దేశాల్లోని ఈ రోగుల వివరాలను సేకరిస్తున్నారు. ఎవరికైనా వివరాలు తెలిస్తే వీరి వెబ్‌సైట్‌కి పంపమని మెడికల్ జర్నల్స్‌లో చిరునామా ప్రకటించారు. మనదేశంలోని ఉత్తరప్రదేశ్‌లోనూ ఇలాంటి రోగి ఉన్నారని తెలుస్తోంది.

...వసుధ హోల్డింగ్స్‌లో ఉద్యోగం వచ్చినట్లుగానే భావిస్తున్నదే, తనకు ఏం అనుభవం ఉందని ఉద్యోగం ఇస్తారు?... ఓ క్షణం అనుమానం.

'తనకు తప్పకుండా ఆ కంపెనీ నుంచి ఫోన్‌కాల్ వస్తుంది!'... మరుక్షణంలో ఆత్మ విశ్వాసం!




ఉదయాన్నే స్నానం చేసి కొత్త చీర కట్టుకుంది అనన్య. కళ్ళకు కాటుక, నుదుట ఎర్రని బొట్టు పెట్టుకుని ఇంటి ముందు అరుగుల దగ్గరకు వచ్చి నిలబడింది. ఎదురుగా మామిడిచెట్టు ఆకులు నీరెండలో మెరిసిపోతూ కన్పించాయి. రామచిలుకల దండు మామిడి చెట్టు మీద చేరి కోలాహలం చేస్తుంటే పిచ్చుకలు బెదిరి అటూ ఇటూ పారిపోతున్నాయి.

మామిడి పూల గుత్తులమీద వాలిన తేనెటీగలు మంద్రస్థాయిలో సవ్వడి చేస్తున్నాయి.

ఇంటిముందున్న పూల మొక్కలు తలలు ఊపుతూ పలకరిస్తున్నట్లు అన్పించింది.

"మేడమ్... కొరియర్" అన్నాడు గేటు దాటి లోపలికి వచ్చిన కుర్రాడు.

అతని చేతుల్లోని ఫ్లవర్ బొకే, గిఫ్ట్‌ప్యాక్, స్వీట్‌బాక్స్ చూసి పొరపాటున తన ఇంటికి వచ్చాడేమోననుకుని "ఎవరు కావాలి? ఎవరికి కొరియర్?" అందామె.

"అనన్య మేడమ్ గారు... ఇంటి నెంబరు చూసే వచ్చాను మేడమ్... విష్ యూ హేపీ బర్త్‌డే మేడమ్" అన్నాడతను వినయంగా తలవొంచి.

పింక్ కవరు ఇచ్చి కాగితం మీద సంతకం పెట్టించుకున్నాడు. ఫ్లవర్ బొకే, గిఫ్ట్‌ప్యాక్‌లు ఇచ్చేసి మరోసారి గ్రీటింగ్స్ చెప్పి వెళ్లిపోయాడు కొరియర్ కుర్రాడు. గిఫ్ట్‌ప్యాక్ మీద ఉన్న స్టిక్కర్ చూసి బర్త్‌డే గిఫ్ట్ అని తెలిసిపోయింది.

కవరు ఓపెన్‌చేసి అందులో ఉన్న బ్లూ కలర్ పేపరు తీసి చూసింది.

అంత అందమైన పేపరు అంతకు ముందెప్పుడూ చూడ్లేదు. పెర్‌ఫ్యూమ్ వాసన సన్నగా ముక్కుల్లో దూరింది. ముత్యాల వరుసల్లా ఉన్న అక్షరాల కేసి చూసింది.

"అనన్య గార్కి,

పుట్టినరోజు శుభాకాంక్షలు...

...చెట్టు ఆకు కొసలో వ్రేలాడే మంచు బొట్టులాంటిది జీవితం... ఆ నీటిబొట్టు ఎప్పుడైనా ఆకుమీద నుంచి జారిపోవచ్చు... ఆకుపచ్చ ఆకుమీద ముత్యంలా మెరిసిపోతున్నంతసేపు ఆ నీటిబొట్టుకు విలువ ఉంటుంది... అందాలు సంతరించుకుంటుంది... జారిపోయిందా నేలమీద పడి ఆకృతిని కోల్పోతుంది... లైఫ్ కూడా అంతే!

జీవితాన్ని ఆనందమయం చేసుకోండి.

ఇట్లు

మీ ఆకాష్

వసుధ హోల్డింగ్స్"

...యం.డి. పంపించాడా? అతనికి తన పుట్టినరోజు సంగతెలా తెలిసింది? మరుక్షణంలోనే బయోడేటాలో తను పుట్టిన తేదీ ఉదహరించిన విషయం, స్టెనోకు ఫోన్ నెంబరు, ఇంటి అడ్రస్

కూడా ఇచ్చింది జ్ఞాపకం వచ్చింది.

తనకెందుకు బర్త్‌డే గిఫ్ట్ పంపించాడు? వాళ్ళ కంపెనీలో తను ఉద్యోగి కూడా కాదు... తనమీద ప్రత్యేక శ్రద్ధ ఎందుకు యం.డి. చూపిస్తున్నాడు.

ఆకాష్ రూపం, మనస్సు వామనుడిలా ఎదిగిపోతూ ఉంది.

హృదయం నిండా ఉదయకాంతులు నిండిపోయి కన్నుల్లో మెరుస్తున్నట్లు అన్పించింది... విచిత్రమైన అనుభూతితో కదిలిపోయింది.

పూలగుత్తిని చేతితో తడిమి గిఫ్ట్‌ప్యాక్ విప్పదీసింది.

వెండి నెమలి మెరుస్తూ కన్పించింది.

"ఎవరు పంపించారక్కా?" అంది సుప్రజ ఫ్లవర్ బొకే, గిఫ్ట్ చూసి.

"మా యం.డి. పంపించాడు"

"ఉద్యోగం రాకముందే గిఫ్ట్‌లు పంపుతున్నాడంటే నిన్ను వాళ్ళ కంపెనీలో చేర్చుకున్నాక ఎన్ని బహుమతులు ఇస్తాడో!" అంది సుప్రజ.

"ఉద్యోగంలో చేరేక సరిగ్గా పనిచేయకపోతే తిడతారు... గిఫ్ట్‌లు ఇవ్వరు... మరో కంపెనీలో చేరకుండా వాళ్ళ కంపెనీలవైపు మొగ్గు చూపడానికే గిఫ్ట్ పంపించి ఉంటాడు" సమాధానం ఇచ్చింది చెల్లెలు మళ్ళీ గుచ్చి గుచ్చి ప్రశ్నలు అడిగే అవకాశం ఇవ్వకుండా.

పదకొండింటికి హెచ్.ఆర్. వింగ్ నుంచి ఫోన్‌కాల్ వచ్చింది అనన్యకు, ఇంటర్వ్యూకు రమ్మనమని.

హడావుడిగా ఆటోలో వసుధ హోల్డింగ్స్ ఆఫీసుకు వెళ్ళింది.

హెచ్.ఆర్. మేనేజర్ గదిలోకి వెళ్ళింది.

క్వాలిఫికేషన్స్, అనుభవం గూర్చి అడిగాడు. అంతకుముందు ఏ ఆఫీసులోనూ పని చెయ్యలేదని స్పష్టంగానే చెప్పేసింది.

"యం.డి. గారు ఉన్నారా?" అడిగింది

మేనేజర్‌కు కోపం వచ్చింది "ఇంటర్వ్యూ నీకా? నాకా? నేను అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పు!" అన్నాడు సీరియస్‌గా.

అరగంట గడిచేక 'ఎగ్జిక్యూటివ్'గా అనన్యను అపాయింట్ చేస్తూ ఆర్డర్స్ ఆమెకు ఇచ్చాడు.

"ఓ సంవత్సరం కష్టపడి పనిచేస్తే మేనేజరు అవుతారు, విష్ యు ఆల్ దిబెస్ట్" అన్నాడాయన.

ఆయన గదిలోనుంచి బయటకు వచ్చాక యం.డి.ని కలిసి కృతజ్ఞతలు చెబుదామనుకుంది. యం.డి.గారి స్టెనో దగ్గరకు వెళ్ళి యం.డి.ని కలవడానికి వచ్చినట్లు చెప్పింది.

"ఉదయం ఫ్లెయిట్‌కు హైద్రాబాద్ వెళ్ళారు... వారం రోజుల తర్వాత వస్తారు... మెసేజ్ ఉంటే చెప్పండి... సార్‌కు ఫోన్‌లో పాస్ ఆన్ చేస్తాను" అంది స్టెనో.

"జస్ట్ కర్టసీ కాల్... ప్రత్యేకంగా చెప్పాల్సిందేమీ లేదు" అనేసి అక్కడి నుంచి వొచ్చేసింది.

★ ★ ★

పది రోజుల తరువాత ఆకాష్ వచ్చాడు.

ఆఫీసుకు అతను వచ్చాడని తెలిసి ఎంతో ఆనందపడింది అనన్య.

"యం.డి.గారు పిలుస్తున్నారమ్మా!" అటెండరు వచ్చి చెప్పాడు.

ఆకాష్ ఛాంబర్‌లోకి వెళ్ళింది.

సీరియస్‌గా ఫైలులోని కాగితాలు తిరగేస్తున్నాడు.

అతనికి ఎదురుగా ఉన్న సీట్లో కూర్చుంది.

"పది రోజుల తరువాత కన్పించారు... మీకు థ్యాంక్స్ చెబుదామంటే వీలు పడలేదు" అంది అతన్ని తదేకంగా చూస్తూ.

"నేనేం ఉల్లిపాయలు, చింతపండు వ్యాపారం చెయ్యడంలేదు... విశాఖపట్నం



లోనే ప్రతి రోజూ నీకు కన్పిస్తూ కూర్చోవడానికి... వందల కోట్ల వ్యాపారాలున్నాయి మాకు... నేను ఒక్కడినే ఐదు కంపెనీల వ్యవహారాలు చూడాలి. ఈ రోజు ఇక్కడుంటే రేపు ఢిల్లీలో ఉండాల్సి వస్తుంది" అన్నాడతను చిరాకు పడుతూ.

నొచ్చుకుందామె. అతని వైపు చూడటానిక్కూడా ధైర్యం చాలక తలొంచుకుని కూర్చుంది.

మరో రెండు నిముషాల్లో అతను మామూలు స్థితికి వచ్చాడు.

"టెన్షన్‌కు గురైనప్పుడు అలా మాట్లాడుతుంటాను. సారీ క్షమించాలి! మిమ్మల్ని చూస్తే ఒత్తిడి తగ్గుతుందనే పిలిపించాను నా ఛాంబరుకు. ఆ విషయం మర్చిపోయి మీ మీద ఎగరడం మొదలుపెట్టాను. రియల్లీ ఐ యామ్ ఏ ఫూల్!" అన్నాడు చెంపలు వాయించుకుంటూ.

ఆమె మొహంలో చిరునవ్వు చోటుచేసుకుంది.

"అదృష్టదేవత మా కంపెనీలో అడుగు పెట్టినట్లయింది మీరు రావడంతో... ఇండస్ట్రియల్ పార్కు పెట్టడానికి మనకు ప్రభుత్వం ఐదొందల ఎకరాల భూమి తక్కువ ధరకే ఇచ్చేసింది. మీకు అపాయింట్‌మెంట్ ఆర్డర్ ఇచ్చిన రోజే ప్రభుత్వం భూమిని మన కంపెనీకి అప్పగిస్తూ జీ.వో. విడుదల చేసింది.

...దిసీజ్ గ్రేట్ గోయింగ్... మనం ఇండస్ట్రియల్ పార్కు పెట్టబోతున్నాం. వెయ్యి మందికి ఉద్యోగాలు సంవత్సర కాలంలో ఇవ్వబోతున్నాం. పెద్ద ఎత్తున పెట్టుబడులు తెచ్చి పారిశ్రామిక పార్కు నిర్మించబోతున్నాం!" అన్నాడతను ఆవేశపడుతూ.

అతను ఏ నిమిషాన ప్రసన్నంగా మాట్లాడుతాడో, ఏ క్షణంలో ఫైర్ అవుతాడో ఆ అమ్మాయికి అర్థం కాకుండానే ఉంది.

"మీరు బిజీగా ఉన్నా నా బర్త్‌డే గుర్తుపెట్టుకుని గ్రీటింగ్స్, గిఫ్ట్ పంపారు. చాలా థ్యాంక్స్!" అందామె.

డ్రాయరు సొరుగు లాగి కరాచీ బేకరీ బిస్కెట్స్, పుల్లారెడ్డి స్వీట్స్ ప్యాకెట్లు బయటకు తీసి ఆమె ముందుంచాడు.

"మీ కోసం హైద్రాబాద్ నుంచి వస్తూ తెచ్చాను... తీసుకోండి ప్లీజ్" అన్నాడతను.

మొహమాటపడిపోయింది.

...ఆ ప్యాకెట్లు తీసుకుని బయటకు వెళ్లితే ఇంకేమైనా వుందా? ఆఫీసులో అందరూ ఏమనుకుంటారు? ఆఫీసరుకు, తనకూ సంబంధం వుందని ప్రచారం చెయ్యరూ!...

ఆమె మొహంలోని భావాలు చదివేడతను.

"ఆఫీసులో ఎవరేమన్నా అంటే నాకు చెప్పండి. స్యాక్ చేస్తాను వెధవల్ని! నేను ఒంటరిగాడ్ని... నాకెవ్వరూ లేరు ఈ లోకంలో అమ్మగారు తప్పితే! ఆమె ఏమీ పట్టించుకోదు... ఎప్పుడూ దైవచింతనలో వుంటుంది... మనస్సుకు నచ్చినవాళ్ళతో సన్నిహితంగా వుండటం తప్పా? స్పేస్‌లోకి ఎస్ట్రోనాట్స్‌ను పంపుతాం గాని గుండె లోతుల్లోకి వెళ్ళి ఎక్స్‌ప్లోర్ చెయ్యం... ఎదుటి మనిషి మనస్సును చదివి అర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యం!" అన్నాడతను గ్లాస్‌పేన్ నుంచి దూరంగా కన్పిస్తున్న సముద్రంకేసి చూస్తూ.

మరో మాట మాట్లాడకుండా బిస్కెట్స్, స్వీట్స్ ప్యాకెట్లు తీసుకుంది.

"గుడ్... ఐ లైక్ యూ! మిమ్మల్ని ఎందుకు పిలిచేనో తెలుసా? ఇండస్ట్రియల్ పార్క్‌కు సంబంధించిన పేపర్లు అన్నీ ఓ ఫైల్‌లో ఉంచండి... వెరీ కాన్ఫిడెన్షియల్

మాటర్. ఆ ఫైల్ మీ దగ్గరే వుంచండి. ఎకరం భూమి రెండు లక్షలు వుంటే మనకు యాభై వేలకే ఇచ్చారు. భూమి బదలాయింపుపై స్టాంప్ డ్యూటీ నుంచి మినహాయింపు కూడా వుంది. ఈ విష యాలు అందరికీ తెలియకూడదు. ప్రభుత్వ పెద్దలను ప్రసన్నం చేసుకోవడా నికి నానా తంటాలు పడ్డాను..." అంటూ కొన్ని పేపర్లు ఆమెకు ఇచ్చాడు.

"ఈ పేపర్లు అన్నీ ఫైల్ చేసి మీ దగ్గరే ఉంచండి. నేను అడిగినప్పుడు చూపిం చండి. వెరీ కాన్ఫిడెన్షియల్" అన్నాడతను.

ఆ పేపర్లు తీసుకుని వెళ్ళబోయింది.

"మేడమ్ సాయంత్రం మీకు ఎంగేజ్ మెంట్స్ ఏమీ లేవు కదా? " అడిగాడు.

"ఇంటికి వెళ్ళడం... వంట చేసుకో వడం" అందామె.

"మీరు వంట చెయ్యడం ఏమిటి? గులాబీ రేకుల్లా వుంటాయి మీ చేతులు... వంట చేసి, అంట్లు తోముతూ కూర్చుంటే చేతులు బండబారిపోతాయి... ఏ కూరలో ఎంత ఉప్పు, కారం వెయ్యాలో ఆలోచిస్తూ కూర్చుంటే మీరెప్పుడు ఓ కంపెనీకి సి.ఇ.ఒ. అవుతారు? ఇంట్లో ఎవరూ లేరా? వాళ్లు చెయ్యచ్చుగదా!" అన్నాడ తను.

"మా నాన్న బి.హెచ్.వి.పి.లో చిన్న ఉద్యోగి. మా చెల్లెలు బి.టెక్ చదువుతూ వుంది. తమ్ముడికి చదువు మీద శ్రద్ధ లేదు. డిగ్రీ పూర్తి చెయ్యడానికి దండయా త్రలు చేస్తూ వున్నాడు" అందామె ఇంటి విషయాలు చెబుతూ.

"సాయంత్రం ఆఫీసు పనులు అయ్యేక రెస్టారెంటుకు వెళ్దాం! ఆ తరువాత సినిమా ప్రోగ్రామ్... మిమ్మల్ని ఇంటి దగ్గర కార్లో డ్రాప్ చేస్తాను. ఇంటికి ఫోన్ చేసి ఆలస్యంగా వస్తున్నట్లు చెప్పండి. వంట ఏర్పాట్లు వాళ్లు చూసుకుంటారు"

ఏం మాట్లాడాలో తెలియక అలాగే నిల బడిపోయింది.

"మీరు వెళ్ళి మీ పని చూసుకోండి" అన్నాడతను ఎవరికో ఫోన్ చేస్తూ.

అతని ఛాంబర్‌లో నుంచి బయటకు వచ్చింది.

ఆమె అనుకున్నట్లే ఆఫీసులో పని చేసే ఇతర ఉద్యోగులు ఆమె చేతిలోని ప్యాకెట్లు చూసి చెవులు కొరుక్కున్నారు.

అటెండరును పిలిచి "సార్ హైద్రాబాద్ నుంచి తెచ్చారు. అందరికీ పంచమని ఇచ్చారు... డిస్ట్రిబ్యూట్ చెయ్యి" అంది ప్యాకెట్లు ఇస్తూ.

"ఈ వికెట్టూ పడిపోయినట్లే!" అంది ఓ అమ్మాయి తన ప్రక్కన కూర్చున్న మరో అమ్మాయితో. ఆ అమ్మాయి మాటలు పట్టించుకోకుండా తన గదిలోకి వెళ్ళిపో యింది అనన్య.

★ ★ ★

బీచ్ రోడ్‌లో కొత్త స్కోడా కారులో అందమైన అమ్మాయిని పక్కన కూర్చోబె ట్టుకుని డ్రైవ్ చెయ్యడం అంతులేని ఆనం దాన్ని కలిగిస్తూ వుంది ఆకాష్‌కు.

ఆమె నుంచి మొగలి పూల పరిమళ మేదో తనను చుట్టేస్తున్నట్లుగా అన్పించిం దతనికి.

"కొత్త కార్లు కొంటూ వుంటాను... పది

## కొత్తగాలి... 

**అత్యాచారం**
**ఆపై హత్యాచారం**
**భయము భీతీ లేక**
**ఇప్పుడయింది నిత్యాచారం**

– మాధవీ సనారా,
అనకాపల్లి

రోజులు వాడి ఎవరికో ఒకరికి గిఫ్ట్‌గా ఇచ్చేస్తూ వుంటాను. దట్ ఈజ్ మై హాబీ!" అన్నాడు ఆకాష్ గొప్పగా.

"ఈ కారు ఎవరికి ఇవ్వాలనుకుంటు న్నారు? " అడిగింది అనన్య.

"మీకు కావాలంటే తీసుకోండి... మరో కారు కొనుక్కుంటాను" అన్నాడతను.

"నా పుట్టిన రోజు మీరు ఇచ్చిన వెండి నెమలి తీసుకున్నందుకే ఏదో భారం నెత్తి మీద వున్నట్లు అన్పిస్తూ వుంది. మీకు ఏదోక గిఫ్ట్ ఇచ్చేస్తేగాని ఆ భారం తొలగి పోయేటట్లు లేదు. మీ దగ్గర ఈ కారు తీసుకుంటే రుణభారంతో పాతా ళలోకంలోకి కుంగిపోతాను... ఎవరికి ఇవ్వాలనుకుంటున్నారు? "

## కొత్తగాలి...

**చావు పుట్టుకల మధ్య**
**జీవితం అంతా**
**గందరగోళమే!**
**ఆధార్‌కార్డు కేంద్రాల్లోలాగ**

– పి.వి.ఎస్. ప్రసాద్,
నవులూరు, గుంటూరు జిల్లా

"ఓ నాయకుడికి ఇవ్వాలి"

"ఎందుకు? "

"మన కంపెనీకి భూములు ఇచ్చిన ప్పుడు మనం అతని రుణం తీర్చుకోవాలి గదా!"

"మీకు ఐదారు కంపెనీలు వున్నాయి... వందల కోట్ల ఆస్తి వుంది.. ఆ ఆస్తి సరి పోదా? "

అడగడమైతే అడిగింది కానీ అతని మనస్సు గాయపర్చానేమోననుకుంది. భయపడుతూ అతని మొహంలోకి చూసింది.

ఆమెలోని తత్తరపాటు గమనించి "ఎన్నో జన్మల ఆత్మీయ అనుబంధం వున్న ట్లుంది మనిద్దరి మధ్య. అందుకనే అంత ధైర్యంగా అడిగారు. ప్రతి వ్యాపారవేత్త కొత్త వెంచర్స్ చేపట్టాలని, వాటిలో విజయం సాధించాలని తన కంపెనీల గ్రోత్ రేటు బాగా వుండాలని ప్రయత్ని స్తూనే వుంటాడు. ఉన్నదానితో తృప్తిపడ్డ వాడు వ్యాపారవేత్త కాడు. వ్యాపారాలు చెయ్యడం మానేసి తత్త్వవేత్త అవుతాడు. హైద్రాబాద్ నుంచి ఇంత దూరం వచ్చి విశాఖపట్నంలో కంపెనీ పెట్టాల్సిన అవ సరం లేదు నాకు... ఇక్కడ కంపెనీ పెట్టి మరో నలుగురికి ఉపాధి కల్పించడం మంచి పని కాదంటారా? " అన్నాడు ఆమె పరువపు సొంపులను తనివితీరా చూస్తూ.

ఎందుకనో అతను చెబుతున్న మాటలు నమ్మబుద్ధి కాలేదు ఆమెకు.

అకౌంటెంటు తనతో అన్న మాటలు గుర్తుకు వచ్చాయి.

"మన యం.డి. ఆకాష్ సామాన్యుడు కాదమ్మా! రెండు కోట్ల పెట్టుబడి పెట్టి రెండొందల కోట్లు వెనకేసుకుందామనే దురాలోచనలో వున్నాడు. అది అతని దూర ఆలోచన. ప్రభుత్వ భూముల్ని కారుచౌకలో కొట్టేశాడు. ఆ భూముల్ని బ్యాంకుల్లో తాకట్టు పెట్టి భారీయెత్తున రుణాలు మంజూరు చేయించుకునే పనిలో వున్నాడు. పారిశ్రామిక పార్కు ఏర్పాటు చెయ్యడం... ఎంతోమందికి ఉపాధి కల్పిం చడం అవన్నీ ఉత్తుత్తి మాటలే!... ఆ విష యాలు సరే గానీ నువ్వు అతనికి మరీ క్లోజ్‌గా మూవ్ కావద్దు. చిక్కుల్లో పడ తావ్... పెద్దవాడిని చెబుతున్నాను, నీ శ్రేయస్సు కోరి. పది రోజులు ఓ అమ్మా యిని వెంటేసుకుని తిరిగితే ఆ తరువాత మరో అమ్మాయి అతని పక్కన కార్లో కూర్చుంటుంది" ఎన్నో విషయాలు చెప్పా

డాయన.

అతను తనతో గౌరవంగానే మాట్లాడు తున్నాడు.

అతనికి ఎంతమంది ఆడవాళ్ళతో సంబంధాలు వుంటే తనకేమిటి? తనతో అసభ్యంగా మాట్లాడినప్పుడు, తనను లోబ ర్చుకోవాలని అతను ప్రయత్నిస్తే, అప్పుడ తనికి బుద్ధి చెబుతుంది. అతనికి దూరంగా జరిగిపోతుంది.

"మీరు పక్కన వుంటే మనస్సులో మధు రిమలు నింపుతున్నట్లు అన్పిస్తుంది" అన్నా డతను రెస్టారెంటులో తన ప్రక్కన కూర్చుని.

అతని మాటలు ఎబ్బెట్టుగా అన్పించ లేదు.

అందమైన ఆడపిల్ల పట్ల ఆరాధనా భావం వుండటం తప్పెట్లా అవుతుంది?

'సినిమా హాల్లో అతని ప్రవర్తన ఎలా వుంటుందో చూద్దాం!' అనుకుంది.

తన భుజం మీద సినిమా మొదల య్యాక చెయ్యి వెయ్యడమో, చీకట్లో తన పైకి ఒరిగిపోయి ముద్దు పెట్టుకోవాలనే ప్రయత్నం చేస్తేనో అప్పుడు అతనికి దూరంగా జరుగుతుంది. ఉద్యోగం కూడా మానేస్తుంది తను.

షాపింగ్ మాల్‌లో వున్న థియేటర్‌కు వెళ్లారు.

పాత సినిమా 'సెక్రెటరీ' ఆడుతోంది.

హాలంతా ఖాళీగానే వుంది. వెనుక వరుసకు తీసుకువెళ్ళాడు. ఆ వరసలో వాళ్లిద్దరు తప్పితే ఎవరూ లేరు.

సినిమాలో లీనమైపోయాడు ఆకాష్.

పొరపాటున కూడా ఆమె చేతిని తాకే ప్రయత్నం చేయలేదు. ఆమెపై ఒరిగి పోయి ఆమె చెంపలను తాకాలనే ఆకాంక్ష అతనికి వున్నట్లు అన్పించలేదు.

సినిమా అయ్యేక అనన్యను ఇంటి దగ్గర డ్రాప్ చేశాడు. వెంటనే తిరిగి వెళ్ళి పోకుండా కారు దిగి డోర్ దగ్గర నిలబడి ఐదు నిమిషాలు మాట్లాడేడు.

ఇంటి వరండాలో నిలబడ్డ కార్తీక్‌కు కారు శబ్దం విన్పించి గేటు దగ్గరకు వచ్చి ఆకాష్‌ను చూశాడు.

'అతన్ని ఎక్కడో చూసినట్లు వుందే!' అనుకున్నాడు.

ఎయిర్‌పోర్ట్ దగ్గర జరిగిన సంఘటన మదిలో మెదిలింది.

ఆకాష్ కారు డ్రైవ్ చేసుకుని వెళ్ళిపో యేక అనన్య లోపలికి వచ్చి కాళ్లూచేతులు కడుక్కుని డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుంది.

ఆమె దగ్గరకు వచ్చి నిలబడ్డాడు కార్తీక్.

"ఏమిట్రా! భోజనం చేయలేదా?"

"చేశానక్కా! నిన్ను డ్రాప్ చేసిన ఆయన ఎవరు?"

"నీకు చెప్పాలా అన్ని వివరాలు?" అంది విసుగ్గా.

"అది కాదక్కా! మొన్న మా స్నేహితుడు బెంగుళూరు వెళ్తుంటే అతనికి సెండాఫ్ ఇద్దామని ఎయిర్‌పోర్ట్‌కు వెళ్లాను. నిన్ను డ్రాప్ చేసినాయన ఎయిర్‌పోర్ట్ లోపలి నుంచి బయటకు వస్తున్నాడు. పాతికేళ్ళ అమ్మాయి అతని చెయ్యి పట్టుకుని ఆపింది. ఇద్దరూ చాలా సేపు ఘర్షణ పడ్డారు. ఇంగ్లీషులో చాలాసేపు పోట్లాడు కున్నారు. నాకు అర్థం అయిందేమి టంటే... ఆ అమ్మాయితో ఆయన చాలా క్లోజ్‌గా తిరిగేడట. పెళ్ళి చేసుకుంటానని మాట ఇచ్చేడట. ఆ అమ్మాయికి గర్భం రాగానే అతను తప్పించుకు తిరుగుతున్నా డట... 'నీకు చాలా డబ్బు ఖర్చు పెట్టాను. నువ్వు ఇష్టపడే నావెంట తిరి గావు. నువ్వు రూడ్‌గా మాట్లాడతావ్ కాబట్టే నిన్ను తప్పించుకు తిరుగుతు న్నాను' అని సమాధానమిచ్చాడు. చాలాసేపు వాళ్లిద్దరి మధ్య గొడవ జరి

గింది. సెక్యూరిటీ సిబ్బంది వచ్చి ఇద్దరికీ సర్దిచెప్పి పంపించేశారు" వివరంగా ఎయిర్ పోర్టులో జరిగిన సంఘటన గూర్చి చెప్పాడు కార్తీక్.

ఆలోచనలో పడింది అనన్య.

తమ్ముడు అబద్ధం చెప్పడు.

...ఆకాష్‌తో చనువుగా తిరగ్గూడదు. ఏదో సాకు చెప్పి అతనికి దూరంగా వుంటేనే మంచిది.

"సర్లే... నువ్వెళ్ళి పడుకో! అతను మా ఆఫీసరు. లేటయితే డ్రాప్ చెయ్యడానికి వచ్చాడులే!" తమ్ముడి వైపు చూస్తూ అంది.

'అతనితో జాగ్రత్తగా వుండు. మంచి వాడు కాదు' అని అక్కకు చెప్పాలనుకున్నా గానీ నోరు పెగల్లేదు. అక్కకు చెప్పే స్థాయి కాదు తనది. అక్కకు అన్నీ తెలుసు. ఆమె జాగ్రత్తలో ఆమె వుంటుంది. ఆ విషయాల గూర్చి తను మాట్లాడకూడదు' అని తనకు తానే సమాధానపడి తన గదిలోకి వెళ్ళిపోయాడు కార్తీక్.

★ ★ ★

ఆఫీసులో వున్నంతసేపు ఆకాష్ గూర్చే ఆలోచిస్తూ వుండేది అనన్య.

అతను తన ఛాంబరుకు పదే పదే పిలవడం, అటు వైపు వెళ్తున్నప్పుడు అందరూ చూడడంతో సిగ్గుతో కుంచించుకుపోయేది.

ఆఫీసు పనిలో చిన్న పొరపాటు జరిగితే నవ్వేసేవాడు. అప్పుడప్పుడు గంభీరంగా వున్నట్లు అన్పించేది. అతను మాట్లాడకుండా సీరియస్‌గా మొహం పెట్టి కూర్చుంటే చిరుచెమటలు పట్టేవి ఆమెకు. అతను నవ్వితే ముఖం మీద గులాబీ రంగు పులుముకునేది.

ఫైల్ చదువుతూ హఠాత్తుగా తల పైకెత్తి "నువ్వు నాకు నచ్చావ్!" అనేవాడు.

ఓ క్షణం అతని మాటలు మధురానుభూతి కల్గించేవి. మరుక్షణంలోనే అతను వంచించి మోసం చేస్తాడేమోనని భీతి కలిగేది.

ఓ రోజు ఆఫీసులో అతను తన సీటు దగ్గరకొచ్చి "మా ఫ్లాట్‌కు వెళ్లొద్దాం పద!" అన్నాడు.

ఎందుకు రమ్మంటున్నాడో అర్థం కాలేదామెకు. "నేను రాను. ఇంటికి వెళ్ళాలి! అర్జెంట్ పని వుంది" అని అందామనుకుంది. గొంతు పెగల్లేదు.

తలొంచుకుని అతన్ని అనుసరించింది.

కార్లో అతను వుండే ఫ్లాట్‌కు వెళ్ళారు.

పెద్ద హాలు, రెండు బెడ్‌రూములు, ఫ్లాట్‌లో ఎటువైపు చూసినా ఖరీదైన ఫర్నీచర్. 'విశాఖపట్నంలో అతను వుండేది నెలలో నాలుగైదు రోజులు. ఇంత ఖరీదైన ఫ్లాట్ ఎందుకు? ' అనుకుంది.

ఫ్లాట్‌లోకి అడుగుపెట్టగానే "పాతాళభైరవి ఎదుట ప్రత్యక్షమై 'నరుడా ఏమి నీ కోరిక? ' అని అడిగితే... ఏం చెబుతానో తెలుసా? " అన్నాడతను.

అతని మనస్సులోని కోరిక తనకేం తెలుసు?

...అనీల్ అంబానీ, ముఖేష్ అంబానీల్లా ఎదిగిపోవాలని కోరుకుంటాడేమో...!

...బిల్ గేట్స్ స్థాయిలో వుండాలని కోరుకుంటాడేమో! 'స్కై ఈజ్ మై లిమిట్!' అని అంటూ వుంటాడు గదా!

తల అడ్డంగా ఊపింది. అతను కోరుకోబోయేది తనకు తెలియదన్నట్లు.

"నువ్వు పక్కన నిలబడితే వలపు జల్లు మనస్సును తడిపేస్తున్నట్లుగా వుంటుంది. అల్లకల్లోలంగా వున్న మనస్సును నీ చల్లని చూపులతో శాసిస్తూ ప్రశాంతంగా వుండేటట్లు చేస్తావ్... రియల్లీ యూ ఆర్ మై ఫాంటమ్ ఆఫ్ లవ్! ఎప్పుడూ ఈ వెన్నెలమ్మ నా ప్రక్కన వుండేటట్లు చెయ్యి అని పాతాళభైరవిని కోరుకుంటాను" అన్నాడు

ఆమెకు బాగా దగ్గరగా జరిగి.

తన నడుం చుట్టూ చెయ్యి వెయ్యబోతున్నాడని గ్రహించిందామె.

కొంచెం దూరంగా జరిగింది "మీ పక్కనే వున్నాను గదా! పాతాళభైరవిని కోరుకోవాల్సినంత పెద్ద కోరికేమీ కాదే!" అంది అతని వైపు చూస్తూ.

అతని కళ్ళల్లో జ్వలించే కోరిక ప్రస్ఫుటంగా కన్పించింది.

మొదటిసారి ఉలిక్కిపడింది.

"తన మీద అఘాయిత్యం చేస్తే ఏం చెయ్యాలి? " అదే ఆలోచన ఆమె మనస్సును తొలిచేసింది.

అతని సెల్‌ఫోన్ మోగింది అదే సమయంలో.

హైద్రాబాద్ నుంచి హెడ్ ఆఫీసులో పనిచేసే మేనేజర్ ఫోన్ చేశాడు. ఆ కాల్ రావడం నిజంగా అనన్య అదృష్టమే!

బాల్కనీలోకి వెళ్ళి ఫోన్లో మాట్లాడడం మొదలుపెట్టాడు.

అతని మాటల బట్టే ఏదో సీరియస్ మ్యాటరేననుకొంది.

"షిట్... అలా జరుగుతుందనుకోలేదు... పెద్ద లాయర్ని పెట్టినా కేసులో ఓడిపోయాం! సుప్రీంకోర్టులో మనకు చుక్కెదురు అవుతుందని నేను కల్లో కూడా అనుకోలేదు"

అవతల వైపు నుంచి మేనేజరు ఏదో చెబుతుంటే, కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతూ వింటూ వున్నాడు.

"ఈ రాత్రికే బయల్దేరి వచ్చేస్తున్నాను" అనేసి ఫోన్ ఆఫ్ చేశాడు.

అనన్య దగ్గరకొచ్చి "నా మూడ్ ఆఫ్ అయ్యింది. నిన్ను మీ ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను పద" అన్నాడు ఆకాష్.

అనన్య ఇంటికి చేరుకునే వరకు కార్లో ఒక్క మాట మాట్లాడలేదతను. బాగా 'అప్‌సెట్' అయ్యాడని అర్థం అయ్యిందామెకు.




**సీ**సాలోని నిద్రమాత్రలు గుప్పెట్లో పోసుకున్నాడు అనురాగ్.

వాటిని మెత్తగా పొడుం చేసి నీళ్ళగ్లాసులో కలిపాడు.

నిర్వికారంగా గ్లాసులోని నీళ్ళు గడగడా తాగేసేడు.

ఎటువంటి సమాచారమూ లేదు. సంతోషం లేదు.

తల్లి గర్భంలో నుంచి బయటపడ్డాక వెలుగును చూసి కెవ్వున ఏడ్చాడు. ఇప్పుడు మౌనంగా చీకట్లోకి జారుకుంటున్నాడు.

బెడ్‌రూములోని లైటు తీసేశాడు. బయట విద్యుద్దీపాల వెలుగు కిటికీల్లోకి చొచ్చుకు రాకుండా కర్టెన్స్ వేసేశాడు.

చుట్టూ చీకటి. చిమ్మచీకటి. తనకు ఇష్టమైన చీకటి....

ముఖంలోకి నవ్వు తీసుకువచ్చింది... ఆ నవ్వు ఎవరికీ కన్పించదు...

ఒక్కసారి గతమంతా సింహావలోకనం చేసుకోవాలనిపించింది.

ఇరవై ఎనిమిదేళ్ళ జీవితమే గదా! ఇరవై ఎనిమిది నిమిషాలు పట్టదు ఒక్కసారి రివ్యూ చేసుకోవడానికి.

...ఊహ తెలిసినప్పటి నుంచి నాన్న ఎప్పుడూ ఎత్తుకున్నట్లుగాని, ముద్దు చేసి

నట్లుగాని గుర్తులేదు.

నాన్న పేరు ఆనందరావు. ఇంట్లో ఎప్పుడూ చిటపటలాడుతూ వుండేవాడు. ఆనందంగా నాలుగు నిమిషాలు గడిపే వాడు కాదు. చిన్న చిన్న కారణాలు చూపి అమ్మను గొడ్డును బాదినట్లు బాదేవాడు. అమ్మను కొడుతుంటే తను ఓ మూల నక్కి చూస్తూ వుండేవాడు.

ఓ రోజు తండ్రికి అడ్డొచ్చి ఆయన చేతి లోని బెల్టు లాక్కోబోయాడు. తనను నెట్టేసి తననూ, అమ్మనూ ఇద్దర్నీ చితకబా దేడు. నాన్నంటే గుండెల్లో అసహ్యం పేరు కుపోయింది.

విశాఖపట్నం, కాకినాడలో ఆయనకు సినిమా హాల్స్ వున్నాయి. సినిమా డిస్ట్రి బ్యూటర్... విశాఖపట్నం చుట్టూ పాతిక ఎకరాల పొలం వుంది. సిటీలో ఎనిమిది పెద్ద భవనాలు వున్నాయి. వాటి మీద అద్దెలే లక్ష రూపాయలు వొస్తాయి.

అమ్మాయిలతో విచ్చలవిడిగా తిరిగే వాడు. అప్పుడప్పుడూ ఇంటిక్కూడా తీసు కువచ్చేవాడు. నాన్నకే కాకుండా ఆయన తీసుకువచ్చిన అమ్మాయిక్కూడా అమ్మే అన్ని సేవలు చేయాలి. బ్రాందీలోకి ఐస్ గడ్డలు రెడీగా వుంచాలి. చికెన్ వేపుడు, మటన్ కూర వండి సిద్ధంగా వుంచాలి. ఆయన భోజనం చెయ్యగానే చేతులు తుడుచుకోవడానికి నాప్కిన్‌తో ఎదురుగా నిలబడాలి. ఒక్క నిమిషం ఆలస్యం అయితే బండబూతులు.

తను పెద్దయ్యాక అమ్మ సిగ్గు విడిచి ఓ విషయం చెప్పింది.

"మీ నాన్న నేనూ ఎప్పుడూ ఒకే మంచం మీద పడుకోలేదురా... నేనో గదిలో పడుకుంటే ఆయన మరో గదిలో పడుకునేవారు... మురిపెంగా ఒక్కరోజూ నాతో మాట్లాడలేదు"

"మరి నేనెట్లా పుట్టాను" అమాయకంగా అడిగాడు తను.

"పెళ్ళయ్యాక మూడునిద్రలు మా ఇంట్లో ఏర్పాటు చేశారు. శోభనం కూడా ఆ మొదటిరాత్రే! మూడు నిద్రలయ్యాక కట్నం డబ్బు ముట్టచెబుతానన్నాడు మా నాన్న. ఆ డబ్బు కోసం పందిరి మంచంలో చోటు ఇచ్చాడో, లేక మరో ఆడ దానితో అత్తగారి వూళ్ళో కులకడానికి వీలు పడకో నాతో ఆ మూడు రాత్రులు గడి పారు. ఆ మూడు రాత్రుల సుఖానికి నువ్వు కడుపున పడ్డావు" చెప్పుకుపో యింది అమ్మ.

స్నేహితులతో బయట తిరిగితే ఊరుకు నేవాడు కాదు. తన స్నేహితులనెవరినీ ఇంటికి రానిచ్చేవాడు కాదు. ట్యూషన్ మాస్టర్లు కూడా ఇంటికి వచ్చి చదువు చెప్పేవారు. మార్కులు తక్కువొస్తే టీచ ర్లని కోప్పడేవాడు. తనని డాక్టర్ని చెయ్యా లని నాన్న ఆరాటం.

తరచూ తలనొప్పి వచ్చేది. సైన్సు పుస్త కాలు చదువుతుంటే తలనొప్పి ఎక్కువ య్యేది. అప్పుడర్థమయింది తను డాక్టరు కాలేడని. నాన్న ఒత్తిడి వల్లనే సైన్సు సబ్జె క్టులంటే తనకు అయిష్టత ఏర్పడింది. లిట రేచర్ చదువుతుంటే మనస్సుకు ఆహ్లా దంగా వుండేది.

కాలేజీలో కూడా ఒంటరిగానే తిరిగే వాడు. ఒక్కళ్ళిద్దరితో స్నేహం చేసినా వాళ్ళు ఇంటికి వచ్చినా, ఫోన్ చేసినా స్నేహితులనే తిట్టేవాడు నాన్న. తనతో ఎవరూ క్లోజ్‌గా మూవ్ అయ్యేవాళ్ళు కాదు.

ఏ విషయంపైనా ఆసక్తి వుండేది కాదు. కాలేజీలో అందమైన అమ్మాయిలు వుండే వాళ్ళు. అమ్మాయిల చుట్టూ తన క్లాస్‌మేట్స్ తిరుగుతుండేవాళ్ళు. వాళ్ళను ఏడిపించేవాళ్ళు.

ఓ రోజు ఒకడు ఓ అమ్మాయి చెయ్యి

పట్టుకుని లాగేడు క్లాసురూములోనే. ఆ దృశ్యం చూడగానే రక్తం ఉడుకెత్తింది. నరాలు పొంగాయి... కోపంతో ముఖం బిగుసుకుపోయింది. ఆ కుర్రాడిని చితక బాదేడు.

మిగతా అబ్బాయిలు తనను చుట్టుముట్టేరు.

"వాడిని ఎందుకు కొట్టావ్? "

"ఆ అమ్మాయిని అల్లరి పెడుతుంటే కొట్టావ్రా? " అన్నాడు తన మీదకు దూసుకువస్తున్న కుర్రాళ్ళను నెట్టివేస్తూ.

"నువ్వు బి.సి. కాలంలో వుండాల్సినవాడివి. అబ్బాయి, అమ్మాయి చెయ్యి పట్టుకుని లాగకుండా ముసలమ్మతో వసంతాలు ఆడతాడా? అబ్బాయి అల్లరి చేస్తుంటే ఆ అమ్మాయి ముసిముసిగా నవ్వుకుందిగాని వాడి చెంప పగలకొట్టిందా? నువ్వు పెద్ద హీరోలా వచ్చి వాడిని కొట్టావ్? నిన్ను మేము కొడితే దిక్కెవ్వరు నీకు? " అంటూ తన మీద పిడిగుద్దుల వర్షం కురిపించారు.

లవకుమార్ వచ్చి అడ్డుపడ్డాడు. తనను వాటేసుకుని వాళ్ళకు దూరంగా తీసుకెళ్ళాడు.

"అమ్మాయిలను ఏడిపించడం, ఆటపట్టించడం అబ్బాయిలకు ఉండే అల్లరి హక్కు! నీకెందుకు అంత కోపం వచ్చింది? " అడిగాడు లవకుమార్ తనను క్యాంటీన్‌లో.

"ఆడవాళ్లను ఎవరన్నా హింసిస్తున్నా, ఏడిపిస్తున్నా తట్టుకోలేను. చిన్నప్పటి నుంచి మా అమ్మకు నాన్న నరకం చూపించడం చూస్తూ వున్నాను. ఆడపిల్లల జీవితాలను నాన్న నాశనం చెయ్యడం గమనించాను. ఆ ప్రభావం నా మీద వుందేమో! ఆడపిల్లలకు అన్యాయం జరుగుతుంటే తట్టుకోలేను. ఆ దృశ్యాలు చూస్తే రక్తం సలసలా కాగిపోతుంది. టీవీల్లో, సినిమాల్లో అటువంటి దృశ్యాలు చూసినా ఏడుపు వస్తుంది. టీవీ ఆఫ్ చెయ్యడమో, సినిమా హాలు నుంచి బయటకు వచ్చేయడమో చేస్తాను. ఆ రోజంతా మనస్సు బాధతో ముడుచుకుపోతుంది" మనస్సు విప్పి లవకుమార్‌తో మాట్లాడేడు.

లవకుమార్ మంచి స్నేహితుడయ్యాడు. క్లాసులో తన పక్కనే కూర్చునేవాడు.

సాయంత్రం పూట బీచ్‌కు వెళ్ళేవారు. అందరికీ దూరంగా జన సంచారంలేని చోట కూర్చునేవాళ్లు.

మౌనంగా ఎగిసి పడుతున్న కెరటాలకేసి చూస్తూ కూర్చునేవాళ్ళు.

ఉన్నట్లుండి "దిస్ ఈజ్ లైఫ్" అనేవాడు లవకుమార్.

చాలా సేపు మౌనంగా కూర్చుని ఒక్కసారి నోరు విప్పి ఏదో చెప్పుకుపోయేవాడు.

"సముద్రంలోని నీరు ఎండకు ఆవిరై ఆకాశంలో చేరుతుంది. మేఘమై కదలాడుతుంది. చల్లబడినప్పుడు వర్షమై భూమికి చేరుతుంది. నదుల్లో ప్రవహించి పొలాలను తడిపి మళ్ళీ నీరు సముద్రంలో చేరుతుంది. మనిషి జీవితం కూడా అంతే! నలుగురికి ఉపయోగపడి మట్టిలో కలిసిపోవాలి. దిస్ ఈజ్ లైఫ్!" అన్నాడతను.

అతని మాటలు నచ్చేవి. ఆత్మీయుడయ్యాడు.

ఒక్కరోజు అతను కన్పించకపోతే పిచ్చెక్కినట్లు వుండేది.

అదే మాట అతని దగ్గర అంటే "ఎప్పుడూ నీ పక్కన వుండలేను కదా! ఎప్పుడో ఏదోక రోజు జారిపోతాను" అన్నాడతను.

"అలా అనొద్దు. నువ్వెప్పుడూ నా పక్కనే వుండాలి" అన్నాడతను ఉద్వేగం నిండిన కంఠంతో.

మరో రోజు పార్కులో సిమెంటు బెంచీ మీద పక్కపక్కనే కూర్చుని ఆడుకునే పిల్లల్ని చూస్తూ "మా అమ్మానాన్నలు విడాకులు తీసుకోవాలనుకుంటున్నారు" అన్నాడు లవకుమార్.

ఉన్నట్లుండి అకస్మాత్తుగా ఎగదోసుకువచ్చిన ఉద్వేగాన్ని, ఆందోళనను అదుముకునే ప్రయత్నం చేస్తున్నాడతను.

"ఎందుకు? పెళ్ళయ్యి పాతికేళ్ళు గడిచేక ఇప్పుడు ఆ ఆలోచన ఎందుకు వచ్చింది? " అడిగాడు తను.

"చిన్న విషయం మీదే ఇద్దరి మధ్య ఘర్షణ వాతావరణం వచ్చేసింది" అన్నాడతను.

విడాకుల దాకా దారితీసిన సంఘటన గుర్చి చెప్పాడు.

...లవకుమార్ తల్లి పాత బట్టలకు స్టీలు సామాను అమ్మే పాతికేళ్ళ అమ్మాయిని ఇంట్లోకి పిలిచి హాల్లో కూర్చోబెట్టింది.

మార్బుల్ ఫ్లోరింగ్ మీద చతికిలబడి కూర్చుని చీర మోకాళ్ళ వరకూ లాక్కుని స్టీలు గిన్నెలు చూపిస్తూ వుందా అమ్మాయి. సోఫాలో కూర్చున్న లవకుమార్ తండ్రి దృష్టి పచ్చగా మెరుస్తున్న ఆ అమ్మాయి కాలి పిక్కల పైనే ఉంది.

బీరువాలో ఉన్న పాత చీరలు, చొక్కాలు తెచ్చి ఇచ్చింది తల్లి.

ఆ అమ్మాయి వొంగినప్పుడు పచ్చటి వక్షోజాలు పండిన మామిడిఫలాల్లా రవికె లోంచి బయటకు తోసుకువస్తున్నాయి. అతని చూపులు వక్షోజాలను కాంక్షతో తడుముతున్నాయి.

తను ఇచ్చిన బట్టలకు పెద్ద స్టీలుగిన్నె ఇమ్మని అడుగుతూ వుంది లవకుమార్ తల్లి.

"ఓ పాత పట్టుచీర పట్రండి అమ్మగారూ... గిన్నె ఇచ్చేస్తా" అంటూ వుందా అమ్మాయి. కుదరదంటోంది ఆమె.

"పోనీలేవే... ఓ పాత పట్టుచీర ఇచ్చెయ్యి! రెండు బీరువాల నిండా పట్టుచీరలు వున్నాయి. ఏం చేసుకుంటావ్? " అన్నాడతను పేపర్ కొసుల్లో నుంచి ఆ అమ్మాయిని చూస్తూనే.

"మీరు మధ్యలో కల్పించుకోకండి. మీ పని మీరు చూసుకోండి! ఆడవాళ్ళ వ్యవహారంలో వేలు దూరుస్తారెందుకు? " అందామె.

ఆమె 'వేలు దూరుస్తారెందుకు' అంటే నవ్వొచ్చిందతనికి ఏదో గుర్తుకువచ్చి.

"సిగ్గులేకపోతే సరి!" ముటముటలాడిందామె.

రవిక సర్దుకుని అందమైన సంపదను

**కొత్తగాలి...** 

**అలనాటి మూకీచిత్రాలు**
**తొలినాటి సంబరాలు!**
**నాటి ప్రేక్షకుల ఓర్పునకు**
**నిదర్శనాలు!!**

— యం.కె. మూర్తి,
సూర్యాపేట

దాచుకునే ప్రయత్నం చేసిందా అమ్మాయి. స్టీలు పాత్రలు అమ్ముకునే అమ్మాయి ఎంత బతిమలాడినా మరో చీర ఇవ్వడానికి ఒప్పుకోలేదు లవకుమార్ తల్లి.

మరోరోజు వొచ్చిందా అమ్మాయి 'అమ్మగారు లేరా సారూ!' అంటూ.

"లేరులే లోపలికి రా! పాత చీరలకేం ఖర్మ... కొత్త పట్టు చీరలే ఇస్తాను" అన్నాడతను కొంటెగా నవ్వుతూ.

ఆ అమ్మాయి లోపలికి వచ్చింది.

అందమైన లోయల్లో విహరిస్తున్నట్లు

ఆమె ఎత్తు పల్లాలను తనివితీరా స్పృశిస్తూ పరవశించిపోయాడతను.

ఆఫీసు నుంచి ఇంటికి తిరిగివచ్చిన లవ కుమార్ తల్లికి రవిక ముడి బిగించు కుంటూ తమ పడక గదిలో నుంచి వొస్తున్న ఆ అమ్మాయిని చూడగానే విషయం అర్థం అయ్యింది.

పడక గదిలో ఒంటిమీద బట్టల్లేకుండా మత్తుగా పడుకున్న భర్తను చూసి చీదరిం చుకుంది.

తల్లిదండ్రులు ఎందుకు విడాకుల కోసం ప్రయత్నిస్తున్నారో వివరించి చెప్పాడు లవ కుమార్.

"మగవాళ్ళు అన్నాక ఏవేవో చిన్న తప్పి దాలు చేస్తుంటారు. చిన్న విషయానికే సంసారం కూల్చుకోవాలా? తప్పుచేసిన భర్తను క్షమిస్తుందిగాని ఏ ఆడదైనా రోడ్డు ఎక్కి అల్లరి చేస్తుందా? మా అమ్మ చేసిన పని నాకు నచ్చలేదు" అన్నాడు లవకు మార్.

మిత్రుడి మాటలతో విభేదిస్తూ "చిన్న విషయం అంటావేమిటి? నిబద్ధత, భార్యా భర్తలు ఒకరిమీద ఒకరికి వుండాల్సిన నమ్మకం, గౌరవాన్ని మంటగలిపిన సంఘ టన అది... కట్టుకున్న భార్యపట్ల నిబద్ధత కలిగి వుండాలి. పరాయి స్త్రీలతో శారీరక సంబంధాలు పెట్టుకోవడం నేను సహిం చను. మా నాన్నంటే అందుకే నాకు వొళ్ళు మంట!" తన మనస్సులోని మాట చెప్పేశాడు

మిత్రుడి భుజం మీద చెయ్యి వేసి "మా నాన్నకు మా అమ్మంటే పంచ ప్రాణాలు... అయినా ఏదో బలహీనమైన క్షణంలో ఆ తప్పు చేశాడు. చేసిన తప్పుకు పశ్చాత్తాపపడుతున్నాడు గదా! మా అమ్మ కొంచెం సర్దుకుపోతే బాగుండేది" అన్నాడ తను.

"మన మగవాళ్ళ బుద్ధే అంతరా! మగ వాడు తప్పుచేస్తే సర్దుకుపోవాలి. చూసీ చూడనట్లు వుండాలని లెక్చర్లు దంచుతాం. ఆడది తప్పుచేస్తే చీల్చి చెండాడుతాం! 'కులట' అని బిరుదు తగిలిస్తాం!" అన్నాడు తను ఆవేశంగా.

"నీకు ఆడవాళ్ళంటే అభిమానం, ప్రేమ వుందిరా! నిన్ను కట్టుకోబోయే అమ్మాయి ఎక్కడుందోగాని సుఖపడుతుంది" అన్నాడ తను నవ్వు ముఖం పెట్టి.

వారం రోజులు తిరిగేసరికి లవకుమార్ హాస్పిటల్లో అడ్మిట్ అయ్యాడు. క్యాన్సర్ వ్యాధి కబళించటంతో మూడు నెలలు తిర క్కముందే కాలగర్భంలో కలిసిపోయాడు.

కొడుకు చనిపోవడంతో లవకుమార్ తల్లి భర్తమీద వొరిగిపోయి వెక్కివెక్కి ఏడ్చింది. మళ్ళీ వాళ్ళిద్దరూ ఒకటయ్యారు. కొడుకు పోవడం వాళ్ళిద్దరిని ఒకటిని చేసింది.

స్నేహితుడు చనిపోవడం అనురాగ్‌కు పెద్ద షాక్.

కొన్నాళ్ళు డిప్రెషన్‌లో పడిపోయాడు. ఇంట్లో నుంచి బయటకు వెళ్ళేవాడు కాదు. ఎవరితో మాట్లాడటానికి ఇష్టపడేవాడు కాదు. మానసికంగా బాగా కుంగిపో యాడు. ఒంటరిగా గదిలో గడపడం అల వాటైపోయింది.

తండ్రి తనను మళ్ళీ మామూలు స్థితికి తీసుకురావడానికి ఎంతో ప్రయత్నించేడు. పెళ్ళి సంబంధాలు చూడటం మొదలుపె ట్టాడు.

అమ్మాయిల ఫొటోలు తెచ్చి చూపించే వాడు. ఎవరూ నచ్చేవారు కాదు... పెళ్ళి చూపులని ఆ వూరూ ఈ వూరూ తిప్పే వాడు. మనసును తాకిన అమ్మాయి కన్పించలేదు. ఎందుకు నచ్చలేదని నాన్న విసుక్కునేవాడు.

"మీ అమ్మ అందంగా లేకపోయినా నేను చేసుకోలేదూ! పెళ్ళి అయ్యేక నచ్చిన

అమ్మాయి కన్పిస్తే ఆ అమ్మాయితో తిరుగు. నువ్వు మగాడివి! ఎవరు వొద్దంటారు? ముందు పెళ్ళికి ఒప్పుకో!" అనే వాడు నాన్న.

తన ప్రవర్తన చూసి నాన్నక్కూడ విసుగెత్తిపోయింది. పెళ్ళి ప్రస్తావన తేవడం మానేశాడు.

మనస్సుకు నచ్చిన అమ్మాయి తారసపడితే పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. నెలలు, సంవత్సరాలు గడిచిపోతున్నాయి. తన ఊహాసుందరి ప్రత్యక్షం కాలేదు. ఇరవై ఎనిమిదేళ్ళు దాటేయి...

...ప్రేమించడం అంటూ జరిగితే ప్రేమ తడి ఆరిపోకూడదు. ఇబ్బందులు ఎదురైనా పెళ్ళికాకముందు ఎటువంటి ప్రేమను పొందాడో చివరిదశ వరకూ అలాగే కొనసాగాలి. కష్టాలు వొచ్చినప్పుడు ప్రేయసికి దూరంగా జరిగిపోకూడదు...

...నిజమైన ప్రేమకు స్వార్థం వుండదు..

అదే తన ఆలోచన ప్రేమ పట్ల.. కానీ మనస్సుకు ఎవరూ నచ్చరు... అందరూ తన ఆస్తి చూసి వెంటబడుతున్నారనే ఫీలింగ్...

డిప్రెషన్ నుంచి బయటపడలేకపోవడానికి కారణం హృదయంలో ప్రేమాంకురాలు మొలకెత్తకపోవడమే! ప్రేమ రాహిత్యం!...

గదిలో ఒంటరిగా కూర్చుంటే ఎవరు ప్రేమిస్తారు? ఒకవేళ ప్రేమిస్తున్నానని ఎవరన్నా అన్నా, తనకు ఆ అమ్మాయి నచ్చాలిగదా!

అమ్మమీద కూడ కోపం వొచ్చింది.

లివర్ పూర్తిగా పాడయిపోయి నాన్న చనిపోతే అమ్మ ఏడ్చేసింది. దిగులుపడింది. నాన్న చనిపోయాడని అమ్మ బాధపడటం నచ్చలేదు.

ఏం సుఖ పెట్టాడని ఏడ్చి మొత్తుకోవడం?

అన్ని వ్యవహారాలు తన చేతుల్లోకి వొచ్చాయి... సినిమాహాల్స్ నిర్వహణ తనేం చెయ్యడం లేదు... లీజు ఎగ్రిమెంటు ప్రకారం డబ్బు తెచ్చి ఇస్తున్నారు. కాకినాడ, విశాఖపట్నం భవనాల అద్దెలు తన ఎకౌంట్‌లో జమ అవుతున్నాయి. పొలాలు కౌలుకు ఇచ్చారు కాబట్టి వ్యవసాయం పనులుకూడా ఏమీ లేవు... సినిమా డిస్ట్రిబ్యూషన్ కంపెనీకూడ పెద్దగా తన ప్రమేయం లేకుండానే నడుస్తూ వుంది.

బ్యాంకుల్లో ఎంత ఖర్చు పెట్టినా తరగని డబ్బు వుంది.

ఆర్థిక వ్యవహారాలు కూడ చిరాకును

**కొత్తగాలి...**

**ఆశ నడిపిస్తుంది**
**నిరాశ జడిపిస్తుంది**
**ఆశ, నిరాశల మధ్య**
**ఓర్పు గెలిపిస్తుంది!**

– ఇంద్రకంటి జయకిరణ్,
కవాడిగూడ, హైదరాబాద్

తెప్పించేవి. అన్నిటికి దూరంగా పారిపోవాలనిపించేది... విసుగు... చిరాకు... కోపం...

ఓ రోజు పబ్‌కు వెళ్ళాడు.

"స్వర్గం అవుట్‌లెట్స్ అవి, ఇంద్రుడు, కుబేరుడు అక్కడే వుంటారు. చూపులతో మైకం తెప్పించే మగువలు, మధుపాత్రలు, అమ్మాయిలు అబ్బాయిల సయ్యాటలు... ఖుషీ, ఖుషీగా వుంటుంది" అన్నాడో స్నేహితుడు.

అతనితోపాటు నైట్‌క్లబ్‌కు వెళ్ళాడు.

అందమైన పార్టీవేర్‌లో అద్భుతంగా

కన్పించారు అమ్మాయిలు, అబ్బాయిలు లోపలికి వెళ్ళేటప్పుడు. కాక్‌టైల్ చప్పరిస్తూ మ్యూజిక్‌కు అనుగుణంగా ఫ్లోర్ మీద డాన్సులు చేసేటప్పుడు మొదట్లో పద్ధతిగా డిగ్నిఫైడ్‌గానే కన్పించారు. ఆ తర్వాత మొదలైంది కోలాహలం.

ఎక్కువసేపు అక్కడ వుండలేక బయటకు వొచ్చేశాడు నైట్ హోటల్లోనే రూము తీసుకుని వుండిపోదామన్న మిత్రుడిమాట విన్పించుకోకుండా.

కారు పార్కింగ్‌వైపు వెళ్ళాడు. ఎటువైపు చూసినా అన్నీ ఖరీదైన కార్లే! వాచ్‌మన్ ఎక్కడో దూరంగా గేటుదగ్గర వున్నాడు.

ఓ కారు పక్కన అమ్మాయి ఏడుపు విన్పించింది.

అటువైపు వెళ్ళాడు. ముగ్గురు కుర్రాళ్ళ మధ్య వో అమ్మాయి సన్నగా ఏడుస్తూ నిలబడి వుంది. ఆ అమ్మాయి కూడా డ్రింకు పుచ్చుకున్నట్లుంది. తూలిపోతూ వుంది. ఆ అమ్మాయిని కారు వెనుక సీట్లో నెట్టే ప్రయత్నం చేస్తూ వున్నాడో అబ్బాయి.

"నా తర్వాత నీ టర్న్‌రా" అన్నాడు కుర్రాడు.

ఆ అమ్మాయి వాళ్ళ ప్రయత్నాలను అడ్డుకోవాలని ప్రయత్నిస్తోంది గాని ఆమె ప్రయత్నాలు ఫలించడంలేదు.

వాళ్ళను అడ్డుకోబోయాడు.

తనను చితకతన్ని అవతలకు తోసేశారు. తన కళ్ళముందే ఆ అమ్మాయిని కారు వెనుక సీట్లోకి నెట్టడం, లోపలికి వో కుర్రాడు దూరడం తలుపు వేసుకోవడం జరిగిపోయింది. మిగిలిన ఇద్దరు కుర్రాళ్ళు బాడీగార్డుల్లా కారు పక్కన నిలబడ్డారు.

పార్కింగ్ ఏరియా నుంచి మెయిన్ గేటు దగ్గరకు కారు డ్రైవ్ చేసుకుంటూ వొచ్చాడు. గేటు దగ్గర కన్పించిన వాచ్‌మన్‌కు జరిగిన సంఘటన గూర్చి చెప్పాడు.

"అవన్నీ ఇక్కడ మామూలే సార్... మీరు వెళ్ళండి!" అన్నాడు వాచ్‌మన్.

...తనను రక్షించమంటూ ఆ అమ్మాయి చూసిన బేల చూపులు తనను వెంటాడాయి. సినిమాలో హీరో పదిమందిని తన్ని అమ్మాయిని అటువంటి పరిస్థితుల నుంచి కాపాడటం గుర్తుకు వచ్చింది...

తనేం చెయ్యలేకపోయాడు...

...అన్నీ వైఫల్యాలే! లాట్ ఆఫ్ ఫ్రస్టేషన్!...

..కడుపులో ఏదో తిప్పుతున్నట్లు అన్పించింది... మైకం కమ్మేస్తూవుంది.

నిద్రమాత్రలు ప్రభావం చూపడం మొదలుపెట్టాయి...

జీవితం ముగియబోతూ వుంది.

చెవుల్లో వింత ధ్వనులు... వాంతి చేసుకోవాలనిపిస్తున్నది గాని తమాయించుకుని బెడ్‌మీద అచేతనంగా వుండిపోయాడు.

ఏదో తెలియని భయం చుట్టుముడుతూవుంది.

పెద్దగా అరవాలనుకున్నాడు అనురాగ్.

గొంతు పెగలడం లేదు.

స్పృహ పూర్తిగా కోల్పోయాడు.

అదే సమయంలో అనురాగ్ వాళ్ళింటికి వొచ్చింది అనన్య.

★ ★ ★

అనురాగ్‌తో పరిచయం కూడా లేదు అనన్యకు. అంతకుముందు ఎప్పుడూ చూడ్లేదు కూడ.

ఆరోజు ఉదయం ఆఫీసుకు వెళ్ళబోయేముందు నెట్ ఓపెన్ చేసింది, ఇంట్లో కంప్యూటర్ ముందు కూర్చుని.

ఫేస్‌బుక్‌లోకి వెళ్ళింది.

అమెరికాలో వున్న నయనికతో ఫ్రెండ్‌షిప్ ఫేస్‌బుక్ ద్వారానే జరిగింది. ఇద్దరూ చాల దగ్గరయ్యారు. ప్రతిరోజూ జరిగిన విషయాలు, తమ అనుభవాలు ఆన్‌లైన్‌లో షేర్ చేసుకునే అలవాట

య్యింది. ఆన్‌లైన్‌లో ఆమెను కలుసుకోక పోతే పిచ్చెక్కినట్లుగా వుంటుంది.

నయనిక అమెరికాలోనే పుట్టి పెరిగింది.

ఆ అమ్మాయి తల్లిదండ్రులది హైద్రాబాద్. ఎనభయ్యో దశకంలోనే వాళ్ళు అమెరికావెళ్ళి డాక్టర్లుగా స్థిరపడ్డారు.

నయనిక అమెరికా స్కూల్స్, కాలేజీల్లో చదువుకున్నా తెలుగు బాగా వస్తుంది.

అమెరికాలో పుట్టిపెరిగినా తెలుగు పద్యాలు అంటే ఇష్టం. ఇండియా నుంచి తెలుగు పుస్తకాలు తెప్పించుకుని చదివేది. తెలుగువారి సాంప్రదాయం, సంస్కృతి అంటే చెవికోసుకుంటుంది.

పల్లెలంటూ ప్రత్యేకంగా అమెరికాలో వుండవు. వ్యవసాయం చేసేవాళ్ళు కూడ పట్టణాలకు దగ్గర్లోనే వుంటారు. అక్కడక్కడ ఫామ్ హవుసెస్ తప్పితే పల్లె జీవితం కన్పించదు. 'ఇండియావొచ్చి పల్లెటూళ్ళు చూడాలని వుంది' అంది నయనిక ఛాటింగ్‌లో.

నయనిక వుండేది న్యూజెర్సీలో. బ్రిజ్ వాటర్ ఏరియాలో వున్న వెంకటేశ్వర స్వామి ఆలయానికి ప్రతి శనివారం వెళ్తుంది. అక్కడ కూడ తెలుగు లేటెస్టు సినిమాలు విడుదల అవుతూవుంటాయి. వొక్కటి మిస్ కాకుండా చూస్తుంది. పాత యన్టీఆర్ సినిమాల సీడీలు అన్నీ నయనిక దగ్గర వున్నాయి.

ఇద్దరి అభిరుచులు కలవడంతో అనన్య, నయనికలు బాగా సన్నిహితులయ్యారు.

నయనిక ఆన్‌లైన్‌లోకి వొచ్చి "హాయ్.... సాయంత్రం ఎండ మిలమిలా మెరుస్తూ వుంది.. ఎనిమిదయినా చీకటి పడదు సమ్మర్‌లో... మాకు సాయంత్రం అయితే ఇండియాలో ఉదయం... ఈ రోజు నీ ప్రోగ్రామ్ ఏమిటి? ఆర్ యూ మీటింగ్ యువర్ బాయ్ ఫ్రెండ్?"

ఆఫీసులో పరిచయం అయిన ఆకాష్ గూర్చి అంతకు ముందోసారి చెప్పింది అనన్య.

"నెలరోజులైంది... అతన్ని చూసి... ఫోన్‌కాల్ కూడా లేదు... విశాఖపట్నం రావడంలేదు... హైద్రాబాద్‌లోనే వుంటున్నాడు... నువ్వు ఎప్పుడు ఇండియా వస్తు

## చతుర లో మొదటి నవల



### అలపర్తి రామకృష్ణ

'గుండె గుప్పెడంత' నవల 'చతుర' మాస పత్రికలో నా తొలి నవల. ఇతర మాసపత్రికల్లో పదహారు నవలలు ప్రచురితమయ్యాయి. మూడు నవలలకు, పదికథలకు బహుమతులు వచ్చాయి. దాదాపు అన్ని ప్రముఖ పత్రికల్లో 300 కథలు, 'ఈనాడు'లో కొన్ని యాత్రాకథనాలు అచ్చయ్యాయి. కొన్ని కథలు, 'యాత్ర' అనే నవల కన్నడంలోకి అనువాదమయ్యాయి. పిడికిలి మించని హృదయంలో కడలిని మించిన కోరికలు ఉంటాయి. కొందరు కష్టపడి ఆ కలలను సాకారం చేసుకుంటారు. మరికొందరు తప్పటడుగులు వేస్తూ కూలబడిపోతుంటారు. విభిన్న పాత్రల చుట్టూ అల్లిన నవల 'గుండె గుప్పెడంత'. ఈ నవలను ప్రచురిస్తున్న సంపాదకులకు ధన్యవాదాలు.

చిరునామా:
అలపర్తి రామకృష్ణ,
ఇంటి నెం. ఎస్1 - బి - 346,
సచివాలయ నగర్,
వనస్థలిపురం, హైదరాబాద్ - 500070

న్నావు?" తెలుగు అక్షరాలను ఇంగ్లీషులో టైప్‌చేస్తూ ఛాటింగ్ చేస్తూ వుండిపోయింది అనన్య.

"...ఇంపార్టెంట్ మాటర్ నీకు చెప్పాలి... ఇక్కడ యు.యస్.లో నాక్లోజ్ ఫ్రెండ్ వొకామె వుంది. ఆమెది మీ విశాఖపట్నమే! వాళ్ళ కజిన్ బాగా డిప్రెషన్‌లో వున్నాడట... బయట తిరగడు... మనుష్యుల్లో తిరగాలంటే అతనికి ఎలర్జీ! ఏదో సైకలాజికల్ ప్రాబ్లమ్ వుందతనికి. వీలుంటే అతన్ని కలసి పరిచయం చేసుకో! అతన్ని మామూలు మనిషిని చెయ్యాలి! అతనిపేరు అనురాగ్... అతనిలో మార్పు వొస్తే నా స్నేహితురాలు సంతోషిస్తుంది. సీతమ్మధార ప్రాంతంలో వుంటున్నారు... ఇంటి అడ్రెస్ కూడ ఇస్తున్నాను.. వీలున్నప్పుడు వెళ్ళి అతన్ని కలుస్తావ్ కదూ!"

"సర్టెన్లీ!" జవాబు ఇచ్చింది అనన్య.

"దట్స్‌గ్రేట్... ఆపదలో వున్నప్పుడు సాటిమనిషికి సాయపడాలి! మళ్ళీరేపు కలుద్దాం! బై..బై!"

ఇంటర్‌నెట్ క్లోజ్ చేసి ఆఫీసుకు వెళ్ళింది అనన్య.

సాయంత్రం అయిదింటికి నయనిక చెప్పిన ఇంటికి బయిల్దేరింది. ఇంటి అడ్రెస్ లొకేట్ చెయ్యడం ఇబ్బందిగానే అన్పించింది.

అనురాగ్ ఇంటికి చేరుకునేసరికి బాగా చీకటి పడింది.

కాలింగ్‌బెల్ నొక్కగానే అనురాగ్ తల్లి వనజాక్షి తలుపు తీసింది.

పొరపాటున తమ ఇంటికి వొచ్చేరేమోననుకుని "కార్పొరేటర్ పద్మగారి ఇల్లు పక్కన" అనేసింది.

కార్పొరేటర్ కోసం ఎప్పుడూ ఎవరోకరు వస్తూనే వుంటారు... అలాంటి వారు అప్పుడప్పుడూ వనజాక్షి వాళ్ల ఇంటి తలుపు తట్టడం మామూలే!

"అనురాగ్‌గారి ఇల్లు ఇదేనా?" అడిగింది అనన్య.

కుందనపు బొమ్మలాంటి అమ్మాయి తన కొడుకును వెతుక్కుంటూ వొచ్చిందంటే ఆమెకేదో శుభపరిణామంలా అన్పించింది.

"రామ్మా! లోపలికిరా.. నేను అనురాగ్ తల్లిని... మావాడు నీకు బాగా పరిచయమా? ఎప్పుడూ చెప్పలేదు... ఏ విషయం నాతో మాట్లాడడమ్మా... గదిలో కూర్చుని వాడిలోనే వాడు మదనపడుతూ వుంటాడు... ఎగిరి గంతులు వెయ్యాల్సిన వయస్సులో మూలకూర్చుని ఎప్పుడూ ఆలోచిస్తూ వుంటాడు... నీ పేరు ఏమిటన్నావ్?" అడిగిందామె.

"అనన్య"

"సోఫాలో కూర్చో! కూల్‌డ్రింక్స్ తీసుకువస్తాను" అందామె ఫ్రిజ్‌వైపు అడుగులు వేస్తూ.

"వొద్దండి... వొద్దండి!" అని అనన్య అంటూవున్నా విన్పించుకోకుండా ద్రాక్ష జ్యూస్ తెచ్చి ఇచ్చింది.

జ్యూస్ తాగేక "మీ అబ్బాయిగార్ని కలువమని అమెరికాలో వుండే మా స్నేహితురాలు నయనిక చెప్పింది... మీ చెల్లెలు కూతురు స్వప్నకు నయనిక దగ్గరి స్నేహితురాలు" అని తను వొచ్చినదెందుకో చెప్పింది అనన్య.

"అబ్బాయి మేడమీది గదిలో వున్నాడు... వెళ్ళి కలిసిరామ్మా! నాకు మోకాలి నొప్పులు. మెట్లు ఎక్కలేను... నువ్వెళ్ళి మాట్లాడు.. కొంచెం బిడియపడుతూ వుంటాడుగాని నువ్వేం పట్టించుకోకుండా చొరవగా మాట్లాడు తల్లీ!" అంది వనజాక్షి.

ఎందుకనో మొదటి చూపులోనే అనన్య బాగా నచ్చేసింది ఆమెకు.

"చిదిమి దీపం పెట్టుకోవచ్చు! ఈ పిల్ల తన కోడలు అయితే ఏడుకొండలవాడా

నీకు తలనీలాలు సమర్పించుకుంటాను... నిలువుదోపిడి ఇచ్చేస్తాను... నా కోరిక తీర్చు తండ్రీ!" మనస్సులోనే ప్రార్థించు కుంది.

మేడమెట్లు ఎక్కి అనురాగ్ గది తలు పులు నెట్టింది.

లోపల ఎటువంటి అలికిడి విన్పించ లేదు.

చేత్తో తడుముకుంటూ తలుపు దగ్గ రున్న స్విచ్‌బోర్డ్ తడిమి చేతికి అందిన స్విచ్‌లు అన్నీ నొక్కింది.

లైటు వెలుగులో అచేతనంగా స్పృహకో ల్పోయి పడివున్న అనురాగ్ కన్పించేడు.




**ద**గ్గర్లో వున్న కార్పొరేట్ హాస్పిటల్లో అనురాగ్‌ను చేర్పించారు.

న్యూరోసర్జన్ అనురాగ్ వున్న స్పెషల్ రూములోకి వొచ్చాడు, మరో ఇద్దరు కుర్ర డాక్టర్లను, వో నర్సును వెంటబెట్టుకుని.

కేస్ షీట్‌కేసి వో క్షణం చూశాడు. స్టాండుకు వేలాడదీసిన బాటిల్స్ నుంచి ట్యూబ్‌ల ద్వారా శరీరంలోకి ఎక్కిస్తున్న ఫ్లుయిడ్స్‌కేసి చూశాడు.

"దిస్ పేషెంట్ వజ్ బ్రాట్ వెన్ హి వజ్ ఇన్ కోమా... హిజ్ బ్రెయిన్ సెల్స్ వర్ పార్షియల్లీ డామెజ్‌డ్... దేర్ వజ్ ఎ నెక్రోసిస్ ఆఫ్ ది వెంట్రికల్..." మెడికల్ పరిభాషలో కుర్రడాక్టర్లకి చెబుతున్నాడు సీనియర్ డాక్టరు.

డాక్టరు గారు వెళ్ళిపోబోతుంటే వనజాక్షి అడిగింది "మా అబ్బాయికి ప్రాణ భయం లేదుగదా!" తడబడ్డాయి ఆమె మాటలు.

"ఐదురోజులు 'ఇంటెన్సివ్ కేర్ యూని ట్'లో వున్నాడు... అక్కడనుంచి స్పెషల్ వార్డుకు మార్చామంటేనే ప్రమాదం లేనట్లే! మీ అబ్బాయి కోలుకోవడానికి నెలరోజులు పట్టొచ్చు" అనేసి వెళ్ళిపోయాడు న్యూరోస ర్జన్, తన పరివారంతో.

గదిలోనే వున్న అనన్య చెయ్యి పట్టుకుని ఆప్యాయంగా నిమిరింది.

"అదే సమయానికి నువ్వు మా ఇంటికి వొచ్చావు కాబట్టి మావాడు బతికి బయట పడ్డాడు... మేడమీద వాడి గదిలోకి వెళ్ళే దాన్నికాదు... నిద్రపోతున్నాడులేనని వూరుకునేదాన్ని.... నిజంగా దేవతలా మా ఇంటికి వొచ్చి మావాడి ప్రాణాలు కాపాడేవ్... నీ రుణం ఎలా తీర్చుకుం టానో తల్లీ!" అంది వనజాక్షి.

"గదిలోకి వెళ్ళి నాలుగైదుసార్లు పిలి చాను... సమాధానం లేదు... నిద్రపోతు న్నాడులే ఎందుకు డిస్టర్బ్ చెయ్యడం అను కుని వెనక్కు తిరిగి వొచ్చెద్దామనుకు న్నాను... ఏదో అనుమానం వచ్చింది... మీ అబ్బాయి తల మంచం మీద నుంచి కిందకు వాలి వుంది.. పెదాలు కొరుక్కుం టున్నట్లు అన్పించింది... కిందపడివున్న స్లీపింగ్ పిల్స్ సీసా కన్పించింది.... ఆత్మ హత్యా ప్రయత్నం చేశాడని అప్పుడు అర్థం అయ్యింది... వెంటనే కిందకు వొచ్చి మీకు చెప్పడం, హాస్పిటల్‌కు ఫోన్ చేసి అంబు లెన్స్ పిలిపించడం జరిగింది" అనురాగ్ కేసి చూస్తూ అంది అనన్య.

కొద్దిగా కదిలేడు అతను.

కళ్ళు తెరిచే ప్రయత్నం చేశాడు.

చుట్టూ చీకటి ఆవరించుకున్నట్లనిపిం చింది.

ఏదో కాంతిరేఖ వో పక్కన కదులుతున్నట్లుగా వుంది.

ఆ కాంతి పుంజాన్ని పట్టుకుని చీకట్లో నుంచి బయటపడే ప్రయత్నం చేస్తున్నట్లుగా చెయ్యి కొద్దిగా చాపాడు.

"నీకేం భయం లేదురా నాయనా!" పక్కన కూర్చున్న అమ్మ వెచ్చటి చేతి స్పర్శ.

'బతకాలనుకున్నవాడికి భయం వుంటుంది గాని... చనిపోవాలనుకున్నవాడికి భయం ఎందుకు వుంటుంది?' అనుకుంది అనన్య.

"అసలు వీడెందుకు ఆత్మహత్యా ప్రయత్నం చేశాడో అర్థం కావడం లేదమ్మా! వీడికేం తక్కువ? బోలెడంత ఆస్తి వుంది... వాళ్ళ నాన్నగారు వుంటే కోప్పడుతూవుండేవారుగాని ఇప్పుడు ఇంటి పెత్తనం వాడిదే! ఎంత ఖర్చు పెట్టుకున్నా అడిగేవారు లేరు... 'అమ్మాయిల చుట్టూ తిరగడం- ప్రేమలో విఫలం కావడం' అటువంటివేమీ లేవు... అసలు ఏ సమస్యాలేదు వీడికి!" కొడుకు అవస్థ చూసి మొత్తుకుందా మాతృహృదయం.

"ఏ సమస్యాలేక పోవడంతోనే బతుకు మీద విరక్తి పుట్టిందేమో! సమస్యలతో సతమతమవుతూ వుండటం కూడ లైఫ్‌లో థ్రిల్లే!" మనస్సులో అనుకుంది అనన్య.

"ఆఫీసుకు టైమవుతోంది ఆంటీ! మళ్ళీ సాయంత్రం వొస్తాను" అంది వనజాక్షితో.

"ఆప్యాయంగా 'అత్తయ్యా!' అని పిలువు తల్లీ" అనన్య భుజం నిమిరి అంది వనజాక్షి.

★ ★ ★

ఆఫీసుకు వెళ్ళేసరికి గంట లేటయ్యింది.

ఆకాష్ ఆఫీసుకు రావడం పూర్తిగా మానేశాడు. అతను లేకపోతే ఆఫీసు కళ తగ్గిందనుకుంది అనన్య.

తనంటే ఎంతో ప్రేమను, అభిమానాన్ని చూపించినవాడు కనీసం వొక్కసారి కూడ ఫోన్ చెయ్యకపోవడం ఆశ్చర్యంగానే అన్పించిందామెకు.

ఆకాష్ గురించి ఎక్కౌంట్స్ ఆఫీసరును అడిగింది.

"ఏవో కోర్టు గొడవల్లో చిక్కుకున్నట్లున్నాడమ్మా! వివరాలు తెలియవు. ఎవరికీ ఫోన్ చెయ్యడం లేదు... వసుధా హోల్డింగ్స్ కంపెనీ వ్యవహారాలు సరిగ్గా లేవు. పారిశ్రామిక పార్కు పెడతామని ప్రభుత్వం నుంచి భూములు తీసుకున్నాం! ఆ భూములు తాకట్టుపెట్టి బ్యాంకు లోన్ కూడ తెచ్చాడు యం.డి.గారు... ఆ లోన్ ఎమౌంట్ ఆకాష్‌గారే స్వయంగా డ్రా చేసుకున్నారు... కంపెనీ ఎకౌంట్‌లో జమచేయలేదు. ఆ డబ్బు ఎటో డైవర్టు అయిపోయింది... వరుస చూస్తూవుంటే కంపెనీ మూతపడేటట్లే వుంది! నమ్మకస్తురాలివి కాబట్టి నీకు చెప్పాను... ఈ మాట నేను అన్నట్లు ఎవరితో చెప్పకు!" అన్నాడాయన.

ఆలోచనలో పడిపోయింది.

"ఏవో ఆశలు రేపి నిన్ను మోసం చెయ్యలేదు కదా! కూతురులాంటి దానివి... నిన్ను ఇలా అడిగానని ఏమనుకోకు!" అన్నాడాయన.

"అదేం లేదండి. నేనంటే ఆకాష్‌గారు అభిమానం చూపించిన మాట వాస్తవం... ఎటువంటి తప్పటడుగు వెయ్యలేదు. నా జాగ్రత్తలో నేను వున్నాను" అంది తలొంచుకుని.

"గాడ్ ఈజ్ గ్రేట్... అంత నమ్మదగిన వ్యక్తి కాదమ్మా!" అన్నాడాయన.

ఎకౌంట్స్ ఆఫీసరుగారికి మొదట్నుంచి ఆకాష్ మీద సదభిప్రాయం లేదు.

పర్సనల్ మేనేజరు పిలుస్తున్నాడని చెప్పడంతో ఆయన రూములోకి వెళ్ళింది. ఆయన ఎదురుగా ఎవరో కూర్చుని

ఉన్నారు.

తన గురించి ఆ గదిలోకి వెళ్ళకముందు ఏమన్నా చెప్పాడేమో ఎదురుగా కూర్చున్న వ్యక్తి తనను చూసి కిసుక్కున నవ్వాడు.

"మీరు ఈ మధ్య ఆఫీసుకు లేటుగా రావడం... ఎర్లీగా ఆఫీసు నుంచి వెళ్ళిపోవడం... మీ పద్ధతి బాగుండటం లేదు" అన్నాడు పర్సనల్ మేనేజర్.

ఆకాష్ ఆఫీసులో వున్నప్పుడు తనవైపు చూడటానికే భయపడేవాడు... అతనెటూ రాడని తనను దబాయిస్తున్నాడేమో!....

"దగ్గరవ్యక్తి వొకాయన హాస్పిటల్లో ఎడ్మిట్ అయ్యాడు... ఆయనను ఎటెండ్ చేయవలసి వస్తున్నది... అయినా నాకు ఎసైన్ చేసిన పనులన్నీ కంప్లీటు చేస్తున్నా సార్!" అందామె.

"అందరూ నీకు దగ్గర వ్యక్తులే!" అన్నాడు పర్సనల్ మేనేజర్ వ్యంగ్యంగా.

వాళ్ళిద్దరూ పెద్దగా నవ్వారు.

గదిలో నుంచి బయటకు వొచ్చేసింది.

తన దగ్గర ఆకాష్ ఫోన్ నెంబరు, ఈమెయిల్ అడ్రెస్ వుంది. ఆ ఫోన్‌కు ఎప్పుడు ప్రయత్నించినా రెస్పాన్స్ రావడంలేదు. తను ఉద్యోగానికి రాజీనామా చేస్తున్నట్లు, తన దగ్గరవున్న కాన్ఫిడెన్షియల్ ఫైల్స్ పర్సనల్ మేనేజరుకు అప్పగిస్తున్నట్లు ఈమెయిల్ ఇచ్చి, రిజిగ్నేషన్ లెటర్ పర్సనల్ మేనేజరుకు ఇచ్చి ఆఫీసు నుంచి బయటపడింది.

స్కూటి మీద ఇంటికి వొచ్చేసింది.

ఎంతో రిలీఫ్‌గా వున్నట్లు అనిపించింది.

'ఆ ఉద్యోగం కాకపోతే మరొకటి! మాటలు పడుతూ ఆ ఆఫీసులో పని చేయలేదు. ఆకాష్ ఈ మెయిల్ తప్పకుండా చూస్తాడు. తనతో తప్పకుండా ఫోన్‌లో మాట్లాడుతాడు' అనుకుంది.

★ ★ ★

ఈ మెయిల్ ద్వారా చాల కంపెనీలకు అప్లికేషన్స్ పంపింది అనన్య. నాలుగు కంపెనీల్లో వాక్ ఇన్ ఇంటర్వ్యూలకు వెళ్ళింది.

ఉద్యోగం రాలేదు.

"ఉద్యోగం రాలేదని నాలో నిరాశ, నిస్పృహలు చోటు చేసుకోలేదు.... నా ప్రయత్నాలు చేస్తూనే వున్నాను... జీవితం

## పటేల్ చతురోక్తులు



ఉక్కుమనిషి సర్దార్ వల్లభాయ్ పటేల్ మన దేశ ప్రప్రథమ హోంమంత్రిగా అనేక సంస్థానాలను భారతదేశంలో విలీనం చేశారు. ఆయన ఎంత గంభీర స్వభావుడో అంత చమత్కారి కూడా. వివిధ సందర్భాల్లో ఆయన విసిరిన చలోక్తులు కొన్ని...

### ఉరికొయ్యకు అప్పగించడమా!

వకీలుగా పటేల్ ఎలాంటి క్రిమినల్ కేసులనైనా తన వాదనా పటిమతో గెలిచేవాడు.

ఒకసారి ఉరిశిక్ష పడుతుందనుకొంటున్న ఒక ముద్దాయిని రక్షించాలని ఆయన హైకోర్టులో వాదిస్తున్నాడు. ప్రాసిక్యూషన్ వాదం బలంగా ఉంది. పటేల్ విజృంభించి విశ్వరూప ప్రదర్శన చేస్తే తప్ప ముద్దాయికి ఉరిశిక్ష ఖాయమనుకుంటున్నారు. ఇంతలో పటేల్ ఉన్న కోర్టు గదిలోకి ఒక టెలిగ్రాం వచ్చింది. అది రెప్పపాటు కాలంలో చదువుకొని పటేల్ తన వాదన కొనసాగించి 'శభాష్' అనిపించుకొని, బయటికొచ్చాడు.

ముద్దాయికి శిక్ష తప్పింది.

టెలిగ్రాంలోని విషయం తెలిసిన మిత్రుడు 'భార్య చనిపోయిందని తెలిసీ వాదన కొనసాగించావా?' అన్నాడు ఆశ్చర్యంగా.

ఆ మాటకు పటేల్ బాధపడకుండా 'ఏం చేయను మిత్రమా? ఆమె ఎలాగూ చనిపోయింది. తిరిగిరాదు! ఆమెకోసం ఈ ముద్దాయిని కూడా ఎలా చంపుకోను?' అన్నాడు.

ఈ సమాధానం విన్న ఆ మిత్రుడికి ఆశ్చర్యంతో నోటమాట రాలేదు.

మంచి మలుపే తిరుగుతుందని అంత రాత్మ చెబుతూవుంది" నయనికతో ఛాటింగ్ చేస్తూ టైప్ చేసింది.

"అదృష్టదేవత తలుపు దగ్గరే నిలబడు తుంది... మనం కృషి చేసి ద్వారాన్ని తెరిచే ప్రయత్నం చేయాలి" అంటూ రిప్లయి ఇచ్చింది నయనిక, అమెరికా నుంచి. అప్పుడప్పుడు ఫోన్లో మాట్లాడుతూ వుంటుంది నయనిక.

అమెరికా నుంచి ఫోన్ వొస్తే గంటసేపు మాట్లాడాల్సిందే!

అమెరికా గురించి ఎన్నో విషయాలు చెప్పేది. కానీ ఆ దేశంలో వుండి పోవడా నికి వైముఖ్యం చూపేది నయనిక.

## కొత్తగాలి...

**ఏడుస్తూ పుట్టడం**
**ఏడుస్తూ చావడం**
**నడుమ నడుమ నవ్వడం**
**ఎంత వింత జీవితం?!**

*– లోగిశ లక్ష్మీనాయుడు,*
*సింహాచలం*

ఇండియా రావాలని అనుకుంటూ వుందా అమ్మాయి.

ఆకాష్ గురించి చెప్పింది అతని వేర్ ఎ బౌట్స్ తెలియడంలేదని, కనీసం తన ఈమెయిల్‌కు రెస్పాన్స్ ఇవ్వడంలేదని.

"అతని గురించి మర్చిపో! కొత్త అధ్యాయం మొదలయ్యింది... అతన్ని డంప్ చెయ్యి... డస్ట్‌బిన్‌లో పడెయ్యి!" సమాధానమిచ్చింది నయనిక.

★ ★ ★

అప్పుడప్పుడు మెలకువ వొస్తూవుంది అనురాగ్‌కు.

చేతులకి, కాళ్ళకి, మొహానికి అమర్చిన ట్యూబులు, మెషిన్స్ ఒక్కొక్కటే తీసివేస్తూ వున్నారు. శరీరంలో వేడి పెరుగుతూ వుంది.

తల్లి మొహంలో ఆందోళన తగ్గి ప్రశాం తంగా కన్పించడం గమనించాడు. గది లోకి వొచ్చిన నర్సులు జోక్స్ వేసుకుంటు న్నారంటే తను ఆందోళన పరిస్థితి నుంచి బయటపడ్డట్టే!

కొత్తగా వో అమ్మాయి రోజూ తన గది లోకి వచ్చి అమ్మ పక్కనే కూర్చుని తదే కంగా తనవైపు చూస్తూ వుండటం గమ నించాడు.

'ఎవరా అమ్మాయి? అంతకు ముందె ప్పుడూ చూడ్లేదు...' అనుకున్నాడు.

"ఏలావుందిరా? తేలిగ్గా వుందా?" వన జాక్షి అడిగింది.

అనన్య వైపే చూస్తూ వుండిపోయాడు.

"నువ్వు నిద్రమాత్రలు మింగినప్పుడు ఆ అమ్మాయి వొచ్చింది కాబట్టి బతికి బట్టక ట్టగలిగావు. లేకపోతే ఒక్కగానొక్క కొడుకూ నాకు దూరమయ్యేవాడు" అంది దానిమ్మ గింజలు వొలుస్తూ.

పసుపుపచ్చని చీర కట్టుకుంది అనన్య. ఎంబ్రాయిడరీ వర్క్ చేసిన చీర, గులాబీ రంగు జాకెట్ వేసుకుని ఉంది. తల్లో చేమంతులు మెరిసిపోతూ కన్పించేయి. ఎక్కువగా డ్రెస్‌లే వేసుకుంటుంది. ఆరోజు శ్రావణ శుక్రవారం అవడంతో చీర కట్టు కుంది.

చందనపు బొమ్మలా వుంది.

అతని మనోనయనంలో వో దృశ్యం మెదిలింది.

అమ్మ పెళ్ళి చూపులకు తీసుకువెళ్ళింది బలవంతంగా.

తన ఎదురుగా కుందనపు బొమ్మలా వో అమ్మాయి కూర్చుని వుంది.

"ఏదో ఒక ప్రశ్న అడగరా?" అంది అమ్మ.

"మీరు వర్కింగ్ ఉమనా? హవుస్ వైఫా? "

పెళ్ళి చూపులకు వొచ్చిన అమ్మాయి హవుస్‌వైఫ్ ఏలా అవుతుంది?

వెర్రివాడిని చూస్తున్నట్లు అందరూ తన వైపు చూశారు. వాళ్ళ చూపులు తట్టుకో లేక అక్కడి నుంచి వొచ్చేశాడు... ఆ దృశ్యం చెదిరిపోయింది...

అనన్య అనురాగదేవతలా కన్పించింది.

"ఎడారిలో తిరిగేవాడికి ఒయాసిస్సులా మీరు కన్పించారు" అన్నాడు అనురాగ్

ఇబ్బందిగా కదిలింది అనన్య.

"సారీ! ఏమనుకోకండి! ఏదో వాగే శాను" అన్నాడతను చేతికి ఫిక్స్ చేసిన సిరెంజ్ నీడిల్, ఎడెశివ్ టేప్ తీసెయ్య బోతూ.

ఆమె అతని చేతిని పట్టుకుని వారిం చింది.

వెన్నెలమ్మ చల్లటి చేతి స్పర్శ తనకు తగి లినట్లు అన్పించింది.

కొద్దిపాటి ఆలోచనలకే అతడి మెదడు అలసిపోతూవుంది.

నర్సు వొచ్చి ట్రాంక్విలైజర్ ఇచ్చింది. నిద్రలోకి జారుకున్నాడు.

"అతను మెలకువలో ఉన్నప్పుడు గతాన్ని గుర్తుకుతెచ్చే ప్రశ్నలు వేస్తూ వుండండి... మెదడు చురుకుదనం పెరు గుతుంది. అతనికి ఆందోళన కల్గించే విష యాలు ముచ్చటించకండి... ఆహ్లాదంగా మాట్లాడండి! త్వరలోనే పూర్తిగా కోలుకుం టాడు" రౌండ్స్‌కు వొచ్చినప్పుడు డాక్టరు అన్నాడు వనజాక్షితో.

అతను నిద్రపోగానే, అనన్యతో మెల్లగా మాట్లాడటం మొదలుపెట్టింది.

"మావాడు నిన్ను ఇబ్బందిపెట్టే మాటలు మాట్లాడినా పట్టించుకోవొద్దు తల్లీ! ఇప్పుడు ఎక్కడా ఉద్యోగం చెయ్యడం లేదా? " అడిగిందామె అనన్యను.

"వో కంపెనీలో పనిచేస్తూ వుండేదాన్ని. వాళ్ళు ఉద్యోగంలో నుంచి తీసేశారు. మరో ఉద్యోగం వెతుక్కోవాలి" అంది అనన్య తలొంచుకొని.

"నువ్వు ఏమనుకోనంటే ఓ మాట చెబు తాను"

"చెప్పండి!"

"మా వారు వున్నప్పుడు వ్యాపారాలన్నీ ఒంటిచేత్తో నడిపేవారు... మంచి వ్యాపా రదక్షులు... ఆయన చనిపోయేక మా అబ్బాయి వ్యాపారం గొడవలు చూస్తు న్నాడుగాని వాటిల్లో పెద్దగా ఆసక్తిలేదు... ప్రకృతిని చూస్తూ పరవశించిపోవడం, మంచి సంగీతం వినడం, ఆపదలో వున్న వారిని ఆదుకోవడం- అవీ వాడి లక్ష ణాలు. నువ్వు యమ్.బి.ఎ. చదివేవు... మా వ్యాపారాలు నువ్వు పర్యవేక్షణ చేస్తే బాగుంటుందని నా అభిప్రాయం... నువ్వా వో పెద్ద కంపెనీలో పనిచేస్తే ఎంత జీతం ఇస్తారో అంత తీసుకో! రెండు మూడు సంవత్సరాలు చూడు... నీకు నచ్చకపోతే వొదిలెయ్యి..."

వనజాక్షిగారు చెప్పింది బాగానే వుంద నుకుంది... ప్రస్తుతం తను ఖాళీగానే వుంది... పెద్దమనసుతో తనకు బాధ్య తలు అప్పగించాలనుకుంటున్నారు... సొంతమనిషిలా భావిస్తారు... ఆంటీ

## కొత్తగాలి...

**ప్రభుత్వ రక్కసి**
**పాదాల కింద**
**అణగారుతున్నాడు**
**అన్నదాత**

**– చిత్తూరి సాయిప్రసాదరెడ్డి,**
*చింతలగూడెం, ప.గో. జిల్లా*




అనొద్దు... 'అత్తయ్యా!' అని పిలవమని వనజాక్షిగారు అన్నారంటే వాళ్ళకు తను ఆత్మీయురాలే! మంచి ఉద్యోగం దొరికేవరకూ వారి దగ్గరే పన్జేయడం ఉత్తమం...

"అలాగేనండి!" అందామె.

"నేను ఇంటికి వెళ్ళి స్నానం చేసివొస్తాను... నేను వొచ్చేదాకా అబ్బాయిని చూస్తూ వుండమ్మా! మరో పదిరోజులు మనకీ ఇబ్బంది తప్పదు. ఆ తర్వాత డిశ్చార్జి చేస్తారు... హాయిగా ఇంటిదగ్గర వుండొచ్చు... ఈ హాస్పిటల్ వాసన పడదు... గత్యంతరం లేక వుండటమే!" అంటూ ఇంటికి తీసుకువెళ్ళాల్సిన వస్తువులు బుట్టలో సర్దుకుని వెళ్ళిపోయింది.

అరగంట గడిచేక అటుఇటూ కదిలి కళ్ళు తెరిచి చూశాడు అనురాగ్.

ఎదురుగా అనన్య కన్పించింది.

"అమ్మ ఏది? "

"ఇంటికి వెళ్ళారు... స్నానం చేసి వొస్తారు... మీకు ఏమన్నా కావాలా? కొబ్బరి నీళ్ళు ఇమ్మంటారా? " అంది అతనికి దగ్గరగా కుర్చీ లాక్కుని.

"కాఫీ తాగాలని వుంది" అన్నాడతను.

ఫ్లాస్కులో కాఫీ లేదు. బయటకు వెళ్ళి హాస్పిటల్ వాళ్ళ క్యాంటిన్‌లో రెండు కప్పులు కాఫీ ఫ్లాస్కులో పోయించుకుని తిరిగివొచ్చింది.

"మీకు శ్రమ ఇచ్చాను. ఉదయం నుంచి హాస్పిటల్లోనే వున్నారు.. మీకు ఆఫీసు పనులుగాని, ఇంట్లో పనులుగాని వుండవా? " అడిగాడు కాఫీ సిప్ చేస్తూ.

"ఇక మీ ఇంట్లోనే నా పనులు... మీకు సెక్రెటరీగా వుండబోతున్నాను. మీ బిజినెస్ వ్యవహారాలు నన్ను చూడమన్నారు మీ అమ్మగారు" కాఫీ తాగేక అతని మొహానికి పట్టిన చిరుచెమట టవల్‌తో



తుడుస్తూ అందామె.

అతని మొహంలో చిరునవ్వు తొంగిచూసింది.

ఆ అమ్మాయిని మొదటిసారి చూసినప్పుడే జీవించాలని ఆశ కలిగింది. ఆ ఆశే అతన్ని త్వరగా కోలుకునేటట్లు చేసింది.

కిటికీ తలుపులు తెరిచింది. తెల్లటి వెలుగు గదిలోకి తోసుకువొచ్చింది. డాక్టరు చెప్పిన మాటలు గుర్తుకువొచ్చాయి.

పదే పదే గతాన్ని ప్రశ్నించాలి... అప్పుడు అతని మెదడు పదును ఎక్కుతుంది.

"మీరు ఎంతవరకూ చదువుకున్నారు?" అడిగిందామె.

"ఎమ్.ఎ."

"ఏ సబ్జెక్ట్?"

"ఇంగ్లీషు లిటరేచర్"

"అందరూ డాక్టర్లు, ఇంజినీర్లు కావాలని సైన్సు, మాథ్స్ సబ్జెక్టులు చదువుతుంటే మీరు ఆర్ట్స్ సబ్జెక్టు తీసుకున్నారెందుకు?"

"అందరూ నడిచేదారిలో నాకు నడవాలనిపించదు... ఐ ప్రిఫర్ టు వాక్ ఆన్ ద రోడ్ లెస్‌ట్రావెల్డ్"

"మీ డేట్ ఆఫ్ బర్త్ గుర్తుందా?"

"జనవరి తొమ్మిది, పందొమ్మిది వందల ఎనభైమూడు... ఎందుకు ఈ ప్రశ్నలన్నీ అడుగుతున్నారు?" కొంచెం అలసటగా కన్పించాడు.

'ఒక్కసారే అన్ని ప్రశ్నలు గుప్పించకుండా ఈ ఎక్సర్‌సైజ్ కొనసాగించాలి' అనుకుంది.

ఆమెవైపే చూస్తూ వుండిపోయాడు.

ఆమెను చూస్తుంటే మదిలో మల్లెలు విచ్చుకుని సౌరభాన్ని వెదజల్లుతున్నట్లనిపిస్తూ వుంది.

"మీరు ఏదొకటి చెబుతూ వుండండి...

నేను వింటూ వుంటాను" అన్నాడతను.

గీతాంజలిలో కొన్ని పేజీలు చదివి విని పించింది.

తన్మయత్వంతో వింటూ ఉండిపో యాడు రవీంద్రుని కవితల్ని.

"మీ గొంతు చాలా బాగుంది... మరో రోజు కీట్స్, షెల్లీ కవితలు మీరు చదివి వినిపించాలి" అన్నాడతను.

నవ్విందామె.

"జీవితాన్ని ఏం చూశారని? చిన్న వయ స్సులోనే మృత్యువును కౌగలించుకోవాలను కుంటున్నారు? మనం వద్దనుకున్నా, ఎంత దూరంగా జరిగినా నీడలాగా మృత్యువు మన పక్కనే వుండి ఏదోక క్షణంలో కబళించి వేస్తుంది... భూమి మీద నాలుగు రోజులు జీవితాన్ని ఆనంద మయం చేసుకోవాలి! జీవితం వద్దనుకునే వాళ్ళకి కీట్స్, షెల్లీ, టాగూర్ కవితలు కూడా ఎందుకు? " అందామె.

ఆమె మాటలు మనస్సును తాకేయి. తన ఆలోచనలలోనే ఏదో లోపం వుందని మొదటిసారి అనుకున్నాడు.

"మరోసారి ఆ ప్రయత్నం చెయ్యను" గుండెలోతుల్లోంచి వచ్చాయి ఆ మాటలు.

"మీకు ఆర్థిక సమస్యలు లేవు, ప్రేమ వ్యవహారంలో దెబ్బతినలేదు, పరీక్షల్లో ఉ త్తీర్ణుడు కాలేదన్న బెంగాలేదు... జీవితం ఎంతో అందమైంది. అందమైన గులాబి పువ్వు పక్కన సూదిమొనలాంటి ముళ్ళుం టాయి... ముళ్ళు గుచ్చుకుంటున్నాయని 'గులాబీ మొక్కను పీకిపారేస్తాను' అంటే ఎలా? నూట యాభయ్యేళ్ళు ఎవడూ బత కడు... ఎటూ అందరం చనిపోయేవా ళ్ళమే!" ఆమెకు తోచిన రీతిలో జీవితం రసమయంగా ఉంచుకోవాలని చెప్పింది.

కిటికీలోనుంచి బయటకు చూశాడు.

హాస్పిటల్ ముందువైపున్న గార్డెన్ కన్పించింది.

ఉదయాన్నే రంగురంగుల పువ్వులు విచ్చుకుని గాలిలో నాట్యం చేస్తూ నవ్వుతు న్నట్లుగా కనిపించేయి. మోడువారిన బతు కులో కొత్తచిగురు వేస్తున్నట్లుగా అనిపిం చింది.

ఆమెవైపు చూశాడు. ముద్దబంతి పువ్వులా మిసమిసలాడుతూ కనువిందు చేస్తూ కన్పించింది.

టానిక్కులు, మందులకంటే అనన్యతో పరిచయం అతనికి కొత్త ఉత్సాహం కల్గిస్తూ వుంది.

★ ★ ★

శివరావు వంట చేస్తున్నాడు.

కూరగాయలు తరిగి అందిస్తూ "ఈరోజు వంట మీరు చేస్తున్నారేమి టండీ? " అడిగింది పార్వతి.

"పెద్దమ్మాయి ఇంటికి రావడం ఆలస్యం అవుతూ వుంది... రెండో అమ్మాయికి పరీ క్షలు. మా అబ్బాయికి వంటరాదు... తినడం ఒకటే వచ్చు!" అన్నాడు నవ్వుతూ.

అంతకుముందు ఇంట్లో పని అమ్మాయి ఉండేది కాదు. ఈమధ్యే అంట్లు తోమడా నికి, బట్టలు ఉతకడానికి పనమ్మాయిని పెట్టుకున్నారు.

పార్వతికి నలభై ఏళ్ళుంటాయి. వాళ్లది సింహాచలం దగ్గర పల్లెటూరు. భర్త వ్యవ సాయం చేస్తూ ఉండేవాడు. పంట బాగా

### కొత్తగాలి...

**వెన్నెల**
**నేలపైకి బొట్లుగా కురిసింది!**
**నింగిలో బొట్టుగా మెరిసింది!**

– రఘుపాత్రుని శ్రీనివాసరావు,
శ్రీకాకుళం

పండిన సంవత్సరం దాన్యానికి గిట్టుబాటు ధర ఉండేది కాదు. పంట అమ్మగా వచ్చిన డబ్బు అప్పు తీర్చడానికి సరిపోయేది కాదు.

పంట పండని సంవత్సరం అప్పులు రెట్టింపు అయ్యేవి.

ఉన్న ఎకరం పొలం తక్కువ ధరకు అమ్ముకోక తప్పలేదు. ఆ దిగులుతో మంచానపడి కన్నుమూశాడు పార్వతి భర్త.

సొంతూరుతో పేగుబంధం తెంచుకుని వైజాగ్ వచ్చేసింది పార్వతి. గుడిసెలో వుంటూ ఐదారు ఇళ్ళలో పనిచేసుకుంటూ పొట్టపోసుకుంటూ ఉంది.

"మొగుడికి వంట వస్తే ఇంటి ఆడది సుఖపడుతుందట! అమ్మగారు ఉంటే ఎంత సంతోషపడేదో ఎదిగిన పిల్లల్ని చూసుకుని... ఆయమ్మకి అంత అదృష్టం లేదు" అంది పార్వతి.

భార్య గుర్తుకు వచ్చింది శివరావుకు.

కడిగిన ముత్యంలా ఉండేది గంగ. ఆమె మాట, పలుకు, నవ్వు మనసులో ముద్రవేసుకుపోయేయి. పొడుగాటి జడ ఉండేది చూడముచ్చటగా.

పెళ్లయిన కొత్తల్లో మైసూర్‌పాక్ చేసి ఆ ముక్క నోట్లో పెట్టబోయింది.

"పిరుదులు దాటే నీ జడను చూస్తుంటేనే కడుపు నిండిపోయింది... మనస్సు మధురాతిమధురంగా మీగడ ముంత అయ్యింది... ఇంకా స్వీట్ ఎందుకూ?" అనేవాడు.

"సిగిరెట్టు తాగి వాసనకొట్టే నోటితో నా దగ్గరకు వస్తావ్... నీ నోరు తియ్యనైతే ఆ రుచి నా నోటికి తగులుతుంది" అనేది దూరంగా జరిగిపోతూ.

అదో కవ్వింపు!

ఆమె వెనుక పరుగెత్తి ఆమెను దొరకబుచ్చుకుని నడుంచుట్టూ చెయ్యి బిగించి దగ్గరకు లాక్కునేవాడు. కౌగిలిలో గువ్వలా ఒదిగిపోయేది.

గంగకు కోపం రావడం ఎప్పుడూ చూడ్లేదు. ముగ్గురు పిల్లల్ని కని తనకు అప్పగించి తనను దాటుకుని పైలోకాలను హడావుడిగా వెళ్ళిపోయింది.

"చిన్న పిల్లల్ని పెంచడం కష్టం... మళ్ళీ పెళ్ళి చేసుకో! నిండా ముప్ఫయ్యేళ్ళు లేవు నీకు" అనేవారు ఫ్యాక్టరీలో తనతోపాటు పనిచేసే కార్మికులు.

ఎన్నో మధురిమలు పంచిపోయిందామె. తన మనసులోని భావాలను పరులకు చిక్కనివ్వకుండా మళ్ళీ పెళ్ళి ప్రస్తావన లేకుండా కాలం గడిపాడు. ఆమెమీద తనకున్న ప్రేమ గుండె గుహల్లో ఉండిపోయింది.

**కొత్తగాలి...**

**వరికి కోతలు**
**ఏడాదికి రెండుసార్లే!**
**కరెంటుకు మాత్రం**
**ప్రతిరోజూ కోతలే!!**

– సంపంగివారి జయచంద్రారెడ్డి,
బాపట్ల, గుంటూరు జిల్లా

అనన్య పెద్దదయ్యేక అప్పుడప్పుడూ అంటూ ఉండేది.

"పెళ్ళి చేసుకో నాన్నా! మాకేం అభ్యంతరం లేదు... సవతి తల్లి మమ్మల్ని పట్టించుకోకపోయినా ఫర్వాలేదు. ఎలాగోలా బతికేస్తాం!"

"మీ పెళ్ళిళ్ళు ఎలా చెయ్యాలా అని సతమతమవుతూ ఉంటే నా పెళ్లి సంగతి మాట్లాడతావేంటి తల్లీ! నీది బంగారు మనస్సు. అందుకే అందరి గూర్చి ఆలోచిస్తూ ఉంటావ్... ముందు నీకు

మొగుడ్ని వెతకనీ!" అనేవాడు.

"పోనీ మా పెళ్ళిళ్లు అయ్యేక చేసుకో నాన్నా"

"యాభైయ్యేళ్లు దాటేయి... ముసలాడికి పెళ్ళి ఎందుకమ్మా? "

"మాకు రెక్కలు వొచ్చి ఎగిరిపోయాక గూడు బోసిగొడుతుంది. గుండెల్లో దిగులు మొదలవుతుంది. నీ అవసరాలు గమనించడానికి, ఆత్మీయంగా కబుర్లు చెప్పడానికి నీకూ వో తోడు కావాలి నాన్నా!" వాదించేది అనన్య.

కూతురి మాటలకు నవ్వుకునేవాడు.




బుచ్చినాయుడి తండ్రి వెంకటాద్రినాయుడు రైళ్ళ రాకపోకలు లేని రోజుల్లో బ్రిటిష్ సైనిక స్థావరాలకు సామాగ్రి ఎడ్ల బండ్ల మీద తరలించే కాంట్రాక్టరుగా పని చేశాడు. అధికార్ల చుట్టూ తిరుగుతూ వాళ్ళ ప్రాపకం సంపాదించి నాలుగు డబ్బులు వెనకేసుకున్నాడు. చదువు లేక పోయినా ఇంగ్లీషు మాట్లాడేవాడు.

చదువుకున్న వాళ్ళంటే ఎంతో గౌరవం ఆయనకు. రెవెన్యూ ఆఫీసులో కాగితం టేబుల్ మీద నుంచి జారిపడితే తీసి కళ్ళకు అద్దుకునేవాడు. కాగితం అంటే అందరికీ తెలియని రోజులవి. 'చదువుల తల్లి... సరస్వతి' అనేవాడు కాగితాన్ని పవిత్రంగా చూస్తూ.

బుచ్చినాయుడ్ని కింగ్ ఎడ్వర్డ్ స్కూల్లో స్కూల్ ఫైనల్ వరకూ చదివించేడు. పైచదువులకు కొడుకును దూరప్రాంతాలకు పంపడం ఇష్టం లేక తెనాలి తాలూకా ఆఫీసులో గుమస్తాగా తన పరపతి ఉపయోగించి ఉద్యోగం ఇప్పించాడు. నెలకు జీతం పదిహేను రూపాయలు అప్పట్లో.

బుచ్చినాయుడు వసుధను పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళి అయిన రెండేళ్ళకు తండ్రి చనిపోయాడు. తనను పైచదువులకు మద్రాసు పంపకుండా తాలూకా గుమాస్తాగా చేశాడని తండ్రి మీద కోపం. తండ్రి చనిపోగానే ఆస్తులన్నీ అమ్మేసి హైద్రాబాద్ చేరుకున్నాడు. భార్య పేరు మీద వ్యాపారాలు మొదలు పెట్టాడు. అన్నీ కలిసొచ్చాయి. 'వసుధ గ్రూప్ ఆఫ్ కంపెనీస్' పేరు పట్నమంతా మారుమ్రోగిపోయింది.

భార్య అంటే ఎంతో ఇష్టం బుచ్చినాయుడుకు. ఆమె ఎప్పుడూ తులసికోట చుట్టూ తిరుగుతూ పూజలు చేస్తూ వుండేది. ఆమె పూజా పునస్కారాలే తనను రక్షిస్తున్నాయని గట్టి నమ్మకం వుండేదతనికి. భూదేవికి ఉన్నంత ఓర్పు వుంది ఆమెకు. అందరితో ఆప్యాయంగా మాట్లాడేది చుట్టుపక్కల ఎవరికి ఒంట్లో బాగుండకపోయినా ఆమె మనస్సు విలవిల్లాడేది. తెలిసినవాళ్ళ ఇళ్ళలో ఏ శుభకార్యం జరిగినా ఆమె అక్కడ వుండేది. బంధువులు ఎవరన్నా చనిపోతే శవం పక్కన కూర్చుని చనిపోయిన వ్యక్తితో అందరికీ వున్న అనుబంధాన్ని గుర్తు చేస్తూ ఏడ్చేది. అప్పటి వరకు మాట పలుకులేకుండా గంభీరంగా వున్న వాతావరణాన్ని శోకమయం చేసేది. ఏడ్చేక అందరి మనస్సులు తేలికపడేవి.

పిల్లల్లేరు బుచ్చినాయుడికి చాలా సంవత్సరాలు. అనాథాశ్రమం నుంచి వో అమ్మాయిని తెచ్చి పెంచుకున్నాడు. కమలాంబ అని పేరు పెట్టాడు. అపురూపంగా

చూసుకునేవాడు ఆ అమ్మాయిని.

ఆ తరువాత కొడుకు పుట్టాడు. వాడికి 'మనోహర్' అని పేరు పెట్టాడు. కన్నకొడుకుతో సమానంగా పెంపుడు కూతుర్ని పెంచారు భార్యాభర్తలు. మరీ దగ్గరి బంధువులకు తప్పితే కమలాంబ పెంపుడు కూతురని ఎవరికీ తెలియదు.

కొడుకును ఇంజనీరు చెయ్యాలనుకున్నాడు బుచ్చినాయుడు. ఇంజనీరైతే తన కంపెనీ వ్యవహారాలు కొడుక్కి అప్పగించవొచ్చని ఆయన ఆలోచన.

మనోహర్‌కు మాత్రం డాక్టరవ్వాలని పట్టుదల. తండ్రిమాట పట్టించుకోకుండా యం. బి. బి. ఎస్ చదివాడు. ఆ తరువాత యం. యస్ చేశాడు.

యం. యస్ చదివే రోజుల్లో క్లాస్‌మేట్ అఖిలతో పరిచయం అయ్యింది. పరిచయం ప్రేమగా మారడానికి నాలుగు నెలలు కూడ పట్టలేదు. యం. యస్ పూర్తయ్యే వరకూ తను ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నాని తండ్రికి చెప్పలేదు.

కమలాంబ పెళ్ళి వైభవంగా చేశాడు బుచ్చినాయుడు. పెళ్ళికి వచ్చిన పెద్దల్ని రిసీవ్ చేసుకోవడంలో హడావుడిగా వున్న తండ్రికి అఖిలను చూపించి పెళ్ళి చేసుకోవాలనుకున్నట్లు చెప్పాడు. పెళ్ళి హడావుడిలో కొడుకు మాటలు పట్టించుకోలేదు.

పెళ్ళి అయ్యేక తీరుబడిగా కూర్చున్నప్పుడు కొడుకు అఖిలను తనకు చూపించడం గుర్తుకు వచ్చింది.

"ఆ అమ్మాయి ఎవర్రా?" అడిగాడు కొడుకును.

"నాతో పాటు యం. యస్ చదువుతోంది. వాళ్ళది నల్గొండ.. హైద్రాబాద్ వొచ్చేశారు"

"వాళ్ళ నాన్నగారు ఏం చేస్తుంటారు?"

"ఆటో డ్రైవరు.. అఖిల వొక్కటే కూతురు. వాళ్ళమ్మ టీచరు. ఎంతో మర్యాదగా, గౌరవంగా వుంటారు" తడుముకోకుండా చెప్పేశాడు కొడుకు.

"ఎందుకు గౌరవంగా వుండరు.. వసుధ గ్రూప్ అఫ్ కంపెనీస్‌కు కాబోయే అధిపతివి. రెండొందల కోట్ల ఆస్తి వుందని తెలుసుకుని వుంటారు" ఆవేశపడుతూ అన్నాడు బుచ్చినాయుడు.

"మీ ఆస్తిపాస్తుల గూర్చి మీకు వున్న సిమెంటు ఫ్యాక్టరీ, పవర్‌ప్లాంటు గూర్చి

## నన్నడగండీ.. చెబుతా!

ఒకసారి కొందరు యువకులు గాంధీజీని కలుసుకోవడానికి వెళుతూ పటేల్‌కు తటస్థపడ్డారు.

'ఏమిటి గాంధీజీతో పని?' అడిగాడు పటేల్.



'గాంధీజీతో బ్రహ్మచర్యానికి సంబంధించిన విషయాలు చర్చించబోతున్నాం!' అన్నారట వాళ్లు.

వెంటనే పటేల్ 'ఆయనకు భార్య ఉంది! నలుగురు కొడుకులు. వాళ్ళందరికీ పెళ్లిళ్లయ్యాయి. పిల్లాజెల్లా కూడా ఉన్నారు. అలాంటి ఆయనతోనా బ్రహ్మచర్యానికి సంబంధించిన విషయాలు మాట్లాడేది? నా భార్య చనిపోయి చాలా ఏళ్ళయింది. నాకు ఇద్దరే పిల్లలు. నేను మళ్లీ పెళ్లి ప్రసక్తే ఎత్తలేదు. బ్రహ్మ చర్యాన్ని గురించి నన్నడిగితే నేను చెప్పనా?' అన్నారట నవ్వుతూ.

దాంతో పటేల్ చమత్కారానికి ఆ విద్యార్థులంతా హాయిగా నవ్వుకుంటూ గాంధీజీని దర్శించేందుకు వెళ్లారట.

నేను వాళ్ళకు చెప్పలేదు నాన్నగారూ!" అన్నాడతను కూల్‌గా.

రెండు నిముషాలు ఆలోచనలలో పడి పోయాడు బుచ్చినాయుడు. సమస్య ఎదురైనప్పుడు ఆవేశపడితే లాభం లేదని ఆయనకు తెలుసు.

"నువ్వు ఆ అమ్మాయితో స్నేహం కొనసాగించాలంటే కొనసాగించు. ఆ అమ్మాయి హాస్పిటల్ పెట్టుకోవడానికి ధన సహాయం కావాలంటే చేద్దాం! నీ పెళ్ళి మాత్రం మా స్నేహితుడు భార్గవ కూతురితోనే! భార్గవ నీకు తెలుసు గదా పెద్ద ఇండస్ట్రియలిస్టు... అతనికి నేను మాట కూడ ఇచ్చాను వాళ్ళమ్మాయిని కోడలిగా తెచ్చుకుంటానని" అన్నాడు, తన పక్కన కూర్చున్న కొడుకు భుజం ఆప్యాయంగా నిమురుతూ.

"నేనూ అఖిల తండ్రికి మాట ఇచ్చాను వాళ్ళమ్మాయిని పెళ్ళిచేసుకుంటానని" నెమ్మదిగా అన్నాడు మనోహర్.

"ఇండస్ట్రియలిస్టుకు ఇచ్చిన మాట, ఆటో డ్రైవరుకు ఇచ్చిన మాట ఒకటేనా? " కోపంతో ఊగిపోతూ అడిగాడు బుచ్చినాయుడు.

"ధైర్యవంతుడు ఇచ్చిన మాట మీద నిలబడతాడు... పిరికివాడు మాట మారుస్తాడు... ఇచ్చిన మాట మర్చిపోతాడు"

"నా మాటకు నువ్వు విలువ ఇవ్వనప్పుడు నీతో మాట్లాడటం అనవసరం. నీ ఇష్టం వచ్చిన అమ్మాయిని పెళ్లి చేసుకో... మళ్లీ నాకు కన్పించకు"

తండ్రి స్వభావం మనోహర్‌కు తెలుసు. మహా మొండి మనిషి! తను ఏదంటే అది జరగాలి! నచ్చని వ్యక్తుల్ని దూరంగా పెట్టేస్తాడు.

నిరాడంబరంగా మనోహర్, అఖిల పెళ్ళి జరిగింది.

పెళ్ళికి కమలాంబ వెళ్ళింది, తండ్రికి తెలియకుండా.

అమెరికా వెళ్లిపోయారు. డాక్టర్లుగా డాలర్లు పండిస్తూ న్యూజెర్సీలో స్థిరపడిపోయారు మనోహర్, అఖిలలు.

పన్నెండు సంవత్సరాలు గడచిపోయాయి. పుష్కరకాలంలో ఎన్నో మార్పులు...

వసుధ చనిపోయింది. బుచ్చినాయుడు బాగా దిగులుపడి మంచాన పడ్డాడు. కొడుకు దూరమైనా పెద్దగా కుంగిపోలేదుగాని భార్య చనిపోతే మధనపడి మంచం ఎక్కాడు.

ఓ రోజు పదేళ్ల అమ్మాయిని ఇంటికి తీసుకొచ్చింది కమలాంబ.

"ఈ అమ్మాయి ఎవరో తెలుసా? " అడిగింది కమలాంబ బంగారు బొమ్మలా మెరిసిపోతున్న అమ్మాయిని బుచ్చినాయుడి ఎదురుగా నిలబెట్టి.

వసుధ పోలికలు కన్పించాయి పాపలో. పాప రూపంలో వచ్చి తన ఎదుట నిలబడిందా? పెద్ద కళ్ళు, విశాలంగా నుదురు, వొత్తు జుట్టు, శంఖంలాంటి మెడ- అన్నీ వసుధ పోలికలే. పట్టు పరికిణి, జాకెట్టు వేసుకుని కాళ్ళు కొంచెం పొడుగ్గా ఉండటంతో పదిహేనేళ్ల అమ్మాయిలా కన్పించింది. జుట్టంతా వెనక్కు దువ్వుకుని పోనీటైల్ కట్టింది.

మల్లె మొగ్గలా మెరిసిపోతూ ఉంది, తెల్లటి రంగులో.

ఆ పాపను దగ్గరకు తీసుకుని "నీ పేరేమిటి? " అడిగాడు.

"నయనిక" కళ్ళు తిప్పుతూ అంది.

నవ్వొచ్చింది బుచ్చినాయుడికి.

ఆ పాప కురులు నిమిరి "ఏ ఊరు మీది? " అన్నాడు.

"న్యూజెర్సీ... అమెరికా అమ్మాయిని" అంది నవ్వుతూ

అప్పుడు అర్థం అయ్యింది, ఆ పాప తన

మనవరాలేనని.

"మీ నాన్న, అమ్మ రాలేదా? "

"వచ్చారు... మా అమ్మమ్మ వాళ్లింట్లో ఉన్నారు... ఇక్కడకు నువ్వు రావొద్దన్నావ టగా!" అందా పాప.

నయనిక మాటలకు తండ్రికి కోపం వస్తుందేమో! పాపను తీసుకు వెళ్లిపొమ్మం టాడేమోనని కంగారు పడింది కమలాంబ.

"తమ్ముడు ఒద్దంటున్నా నేనే తీసుకువ చ్చాను నాన్నగారూ! నయనికను మీకు చూపించాలనిపించింది" అంది కమలాంబ సంజాయిషీ ఇస్తున్నట్లు.

కాలి గజ్జల పట్టీ వేసుకుంది.

గజ్జల పట్టీల సవ్వడి తాతకు విన్పించా లని హాలంతా కలయ తిరిగింది. నవ్వుతూ గంతులేసింది.

లేగదూడలా చెంగు చెంగున గంతులు వేస్తున్న పాపను పట్టుకుని బుగ్గల మీద ముద్దు పెట్టుకుని "నా బంగారు తల్లీ!" అంటూ మురిసిపోయాడు.

"అత్త కొనిపెట్టింది గజ్జల పట్టీలు... మా అమెరికాలో దొరకవు" అంది నయ నిక.

"ఇక్కడే ఉండిపోతావా? " అడిగాడు చెమ్మగిల్లిన కళ్లతో

"నెల రోజులే ఇక్కడ ఉండేది... అమె రికా వెళ్లిపోతాం. నేను స్కూలుకు వెళ్ళా లిగా!" అంది తాత ఒడిలో కూర్చుని.

బుచ్చినాయుడి కళ్ళలోని మెరుపును, సంతోషాన్ని చూసి ఆనందపడింది కమ లాంబ.

ట్యూషన్‌కు వెళ్ళి తిరిగొచ్చాడు ఆకాష్, భుజానికి బ్యాగ్ తగిలించుకుని. వాడి దృష్టి నయనిక మీద పడింది.

ఆ అమ్మాయి ఎవరన్నట్లు తల్లివైపు చూశాడు.

"మీ మామ కూతురు... పేరు నయ నిక... అమెరికాలో మనోహర్ మామయ్య ఉన్నాడని చెప్పానుగా... వాళ్ళమ్మాయి" పాప గురించి చెప్పింది ఆకాష్ తల్లి.

పాపను తిరిగి తీసుకెళ్లబోతూ "తమ్ము డిని, అఖిలను ఇక్కడకు రమ్మనమని చెప్ప మంటారా నాన్నగారూ? " అడిగింది.

"వొద్దు... వొద్దు!" అన్నాడాయన

"తమ్ముడికి పెద్ద శిక్ష వేస్తున్నారు"

"లేదమ్మా! శిక్ష నాకు నేనే విధించుకుం టున్నాను... ప్రేమించుకున్న వాళ్ళిద్దరిని కలిపి పెళ్లి చేయకుండా దూరంగా పెట్టే శాను... నా ఇంటికి రావొద్దని షరతు విధించాను... తప్పు నాదే! శిక్ష నాకు పడాల్సిందే!"

"మనలో మనకు పంతాలు, పట్టింపులు ఎందుకండీ? " ఇంకా ఏదో చెప్పబోయింది.

ఆమె మాటలకు అడ్డొస్తూ "ఇంకేం చెప్పొద్దు. పాపను మాత్రం ఇండియాలో ఉన్నన్నాళ్లు అప్పుడప్పుడు ఇక్కడకు తీసు కురా!" అనేశాడు.

తండ్రి మొండితనం, తమ్ముడి పట్టుదల కమలాంబకు తెలుసు. మరో మాట మాట్లాడలేకపోయింది.

"ఒక్క క్షణం ఆగు!" అని లోపలికి వెళ్ళి వసుధ బంగారు గొలుసు తెచ్చి మనవ రాలి మెడలో వేశాడు.

నయనికను అఖిల వాళ్ళింట్లో వదిలి పెట్టి వచ్చింది. పాపను చూసి తండ్రి

## కొత్తగాలి...

**పొత్తిళ్లలో**
**వెచ్చదనాన్నిచ్చిన పాపానికి**
**ఆ తల్లి వీధరుగు మీద**
**చలికి వణుకుతోంది!**

– ఎన్.కె. నాగ్,
మార్టేరు, ప.గో. జిల్లా

సంతోషపడ్డ సంగతి వివరంగా తమ్ముడికి చెప్పింది. తండ్రిలో కొంత మార్పు వచ్చిం దిలే అని సంతోషపడ్డాడు.

షాపింగ్ మాల్‌లో తండ్రిని చూడటం తటస్థించింది. వాళ్లిద్దరూ మాట్లాడుకో లేదు. ఆ తర్వాత కొన్నిరోజులకు అమెరికా తిరిగి వెళ్లిపోయారు మనోహర్‌వాళ్లు

★ ★ ★

ఆకాష్ ఓ రోజు రాత్రి తన పక్కన కూర్చుని చదివిస్తున్న తల్లిని అడిగాడు "ఆ రోజు తాత మనింట్లో గొలుసు ఆ పాపకు ఇచ్చాడేమిటి? తాతకు బుద్ధి లేదు... అలా దానధర్మాలు చేస్తే మనకేం మిగులు తుంది? "

కొడుకు నోరు మూసి "పిచ్చివాగుడు వాగకు... తాత విన్నాడంటే మనల్ని ఇంట్లో కూడా ఉండనివ్వడు... నా పెళ్ళ ప్పుడు తాత పదికోట్ల ఆస్తి ఇచ్చాడు మీ నాన్నకు. ఆ ఆస్తి అంతా తగలేశాడు మీ నాన్న.. మీనాన్న చనిపోయాక మళ్ళీ ఆయన నీడన చేరాం!" చెప్పుకుపోయింది.

తను ఆయన సొంత కూతురు కాదన్న విషయం కొడుక్కు చెప్పలేదు.

పక్క గదిలో ఉన్న బుచ్చినాయుడు ఆలోచనలో పడిపోయాడు.

కొడుకు, కోడలికి తన ఆస్తిమీద మమ కారం లేదు... ఆస్తికోసం తన చుట్టూ తిరిగి ఆస్తి అంతా తమ పేరు మీద రాయించుకోవాలన్న ఆరాటం లేదు... ఇండియాకు తిరిగివచ్చే ఆలోచనే లేదు.

కమలాంబ తనను కనిపెట్టుకుని ఉంది. పెంచిన మమకారం తనకూ ఉంది. పది శాతం ఆస్తి ఆమె పేరుమీద రాసేస్తాడు... మిగిలిన ఆస్తి అంతా తన మనవరాలు నయనికకు చెందాలి... తను చనిపోయే లోపు రాతకోతలు పూర్తికావాలి.

...ఆకాష్ బాగా చదువుకుని తన మన వరాలిని పెళ్ళి చేసుకుంటే బాగుం టుంది... భగవంతుడు ఎలా రాసిపెడితే అలా జరుగుతుంది...

తను అనుకున్నట్లు ఏది జరిగింది?

తన కొడుకు తను చెప్పినట్లు చే సాడా? ... తన గ్రూప్ ఆఫ్ కంపెనీస్‌ను వాడే మంచి దక్షతతో నిర్వహిస్తాడని ఆశ పడ్డాడు. వాడు దూరంగా వెళ్లిపోయాడు.

ఆరోగ్య సమస్యలు తనకు వున్నాయి. ఓ కిడ్నీ పనిచెయ్యదు... గుండెజబ్బు, షుగరూ అన్నీ ఉన్నాయి. వసుధ గుమ్మ టంలా చలాకీగా తిరుగుతూ ఉండేది... ఆమెకంటే ముందు తను పైలోకాలకు యాత్ర కడతాడనుకున్నాడు... ఆమె తనను దాటుకుని ముందే టపా కట్టే సింది.

మనవరాలికి ఆస్తి దక్కేటట్లు కట్టుదిట్ట మైన చర్యలు తనున్నపుడే తీసుకోవాలి... లేకపోతే ఆస్తి అంతా చెల్లాచెదరయిపో తుంది.

కంపెనీ వ్యవహారాలు చూసే అడ్వకే ట్‌ను పిలిపించాడు.

దాదాపు రెండొందల కోట్ల ఆస్తి ఉన్న వసుధా గ్రూప్ ఆఫ్ కంపెనీస్ ఆస్తిపాస్తు లను ఓ ట్రస్టు కిందకు తీసుకువచ్చి, ఆ ట్రస్టు ఛైర్మన్‌గా మనోహర్ కూతురు నయనికను నియమించడం, ఆ అమ్మాయి మైనరు కాబట్టి ఆమెకు ఇరవై ఒక్క సంవ త్సరాలు వచ్చేంతవరకూ కమలాంబ ట్రస్ట్ ఎగ్జిక్యూటర్‌గా నియామకం, నయనికకు మైనారిటీ తీరేక ఆమే సోల్ ఎగ్జిక్యూట ర్‌గా ఉండేటట్లు రాతకోతలు పూర్త య్యాయి. ఆ డాక్యుమెంట్లు అన్నీ రిజిస్టర్ చేయించాడు.

చనిపోయేముందు కమలాంబను పిలిచి "ఎక్కడో అనాథాశ్రమంలో గేటు దగ్గర నిన్ను కన్న తల్లిదండ్రులు వదిలేశారు... పసిగుడ్డుగా ఉన్న నిన్ను తెచ్చుకుని పెంచుకున్నాం... నిన్ను కన్నకూతురు

# ఉష్ణోగ్రత బట్టి ధరలు

పాశ్చాత్య దేశాల్లో వెండింగ్ మెషీన్స్ చాలా ప్రాచుర్యం పొందాయి. మనుషులు లేనిచోట కూడా వీటినుంచి ఆహారపానీయాలను కొన వచ్చు. కొత్తగా స్పెయిన్‌లో మూమెంటం అనే కంపెనీ కొత్తరకం వెండింగ్‌మెషీన్‌లు పెట్టింది. స్మార్ట్ వెండింగ్‌మెషీన్స్‌గా పిలిచే వీటిలో పానీయాలను అమ్ముతారు. ఆ మెషీన్‌లోని టెంపరేచర్ ప్రకారం అందులోని పదార్థాల ధర మారుతుండటం విశేషం. ఎవరైనా బాగా చల్లటి పానీయాలను తాగాలనుకుంటే దాని ఆధారంగా ఈ మెషీన్ ధరను మార్చి అమ్ముతుంది. స్మార్ట్ వెండింగ్ మెషీన్‌లోని టెంపరేచర్ 77 డిగ్రీల ఫారెన్‌హీట్ ఉంటే అప్పుడా పానీయం ధర రెండు యూరోలు. ఆ ఉష్ణోగ్రత 78కి లేదా 84కు పెరిగితే అప్పుడా పానీయం ధర 1.7 యూరోలకి పడిపోతుంది. ఇంకా ఉష్ణోగ్రత 86 డిగ్రీలు లేదా మరికొంత పెరిగితే అప్పుడు దాని ధర 1.22 యూరోలకు తగ్గిపోతుంది. ప్రతి స్మార్ట్ వెండింగ్ మెషీన్ దానిలోపలి ఉష్ణోగ్రతని, ధరను ఎప్పటికప్పుడు ప్రదర్శిస్తూ







వుంటుంది. ఓ ప్రత్యేక సాఫ్ట్‌వేర్ యాంత్రికంగా ఈ రెండింటినీ నియంత్రిస్తుంటుంది. కోకాకోలా కంపెనీ తయారీ అయిన మినిట్ మెయిడ్ లెమనేడ్‌లకు స్పెయిన్‌లో డిమాండ్ అధికం. అందువల్ల మొదటగా వాటిని స్మార్ట్ వెండింగ్ మెషీన్స్‌లో ఉంచి అమ్ముతున్నారు. స్పెయిన్‌లో అలాంటి వెండింగ్ మెషీన్లను దాదాపు పద్దెనిమిది దాకా వాటర్ పార్కులు, అమ్యూజ్‌మెంట్ పార్కుల్లో ఉంచారు. త్వరలోనే బీర్‌క్యాన్లు ఇచ్చే స్మార్ట్ వెండింగ్ మెషీన్స్ కూడా అందుబాటులోకి రానున్నాయి. వీటిని ఇదివరకు పానీయాలను అమ్మే పాత సాధారణ వెండింగ్ మెషీన్ల స్థానంలోనే ప్రవేశపెట్టనుండటం గమనార్హం.

కంటే ఎక్కువగానే చూసుకున్నాను. ఆస్తికి వారసురాలిగా నా మనవరాలికి న్యాయపరమైన చిక్కులు రాకుండా ఉండేందుకు ట్రస్టు ఛైర్మన్‌గా నియమించాను. నయనిక అమెరికాలో పుట్టి పెరిగింది... ఇండియాకు తిరిగి వస్తుందని నమ్మకం లేదు... తిరిగి వస్తే మాత్రం అన్ని వ్యవహారాలు ఆమెకు అప్పగించు... నీకు, నీ కొడుక్కి ఏ లోటూ రాకుండా ఓ పదికోట్ల ఆస్తి రాశాను... నా మనవరాలు ఆకాష్‌ను పెళ్ళి చేసుకోవడానికి పెద్దయ్యాక ఇష్టపడితే వాళ్ళిద్దరి పెళ్ళి చెయ్యి! లాయరు రిజిస్టర్డ్ డాక్యుమెంటు వివరాలు నా కొడుక్కి కూడా వివరంగా చెబుతాడు.. మీ అందరికీ ఏ ఇబ్బందులు ఉండవ్... అన్ని ఏర్పాట్లు చేశాను" అని చెప్పాడు.

★ ★ ★

బుచ్చినాయుడు చనిపోయాడు.

ఆకాష్ పెద్దవాడయ్యాక తల్లి తరపున కంపెనీ వ్యవహారాలు చూసేవాడు.

నయనిక అమెరికా నుంచి తిరిగిరాదని గట్టి నమ్మకం ఉంది.

అయినా ఏదో అనుమానం! అతని మెదడును పురుగు తొలిచింది. కోర్టులో కేసు వేశాడు. ఆస్తికంతటికీ తనే వారసుడని, అమెరికాలో పుట్టి పెరిగిన నయని

కకు ఏ హక్కులూ ఉండవని, ఆస్తి అంతా బుచ్చినాయుడిగారి స్వార్జితం, వంశపారం పర్యంగా వచ్చిన ఆస్తి కాదు. ఆయన కొడుక్కి ఆస్తిలో హక్కు లేదు, ఆ విధంగా నయనికకు ఎటువంటి క్లయిము ఆస్తి మీద లేదని కోర్టులో వాదించారు ఆకాష్ తరఫున లాయర్లు.

సిటీ సివిల్ కోర్టులో తీర్పు ఆకాష్‌కు వ్యతిరేకంగా వచ్చింది.

హైకోర్టుకు అపీలుకు వెళ్ళాడు. అక్కడా చుక్కెదురైంది.

ఆ సమయంలోనే నయనిక తల్లిదండ్రులు కార్లో డెట్రాయిట్ నుంచి షికాగో వెళ్తూ ఉంటే దాన్ని పెద్ద ట్రాన్స్‌పోర్ట్ వెహికిల్ గుద్దేసింది. మనోహర్, అఖిల స్పాట్‌లోనే చనిపోయారు. యాక్సిడెంట్ జరిగిన సమయంలో నయనిక డౌన్‌టౌన్‌లో ఉంది.

నయనికకు అదో పెద్ద షాక్.

సుప్రీంకోర్టు కూడా కింది కోర్టు తీర్పును అప్‌హోల్డ్ చేసింది. ఇండియాలో ఉన్న అడ్వకేట్ ఫోన్లో ఆ విషయం నయనికకు చెప్పినప్పుడు ఆమెకు ఏ మాత్రం సంతోషం కలిగించలేదు. తల్లిదండ్రులు చనిపోయారనే దిగులుతోనే ఉంది.

అనన్య ఫోన్లో నయనికతో మాట్లాడి ఓదార్చే ప్రయత్నం చేసింది. తన స్నేహితురాలికి వచ్చిన కష్టాన్ని విని చలించిపోయింది.

★ ★ ★

సుప్రీం కోర్టులో కూడా ఓడిపోవడం పెద్ద తలవంపుగా తోచింది ఆకాష్‌కి.

అప్పటివరకు వసుధ గ్రూప్ ఆఫ్ కంపెనీస్‌కు తనే అధిపతినని మిడిసిపడ్డాడు. ఎక్కడో అమెరికాలో ఉండే అమ్మాయి ట్రస్ట్‌కు అధిపతి అని అందరికీ తెలిసిపోవడంతో తలకొట్టేసినట్లయింది.

బుచ్చినాయుడికి తను మనవడనుకుని ఆకాష్ విర్రవీగాడు. రిజిస్టర్డ్ డాక్యుమెంటులో తన తల్లిని బుచ్చినాయుడు పెంచుకున్నాడని తెలియడంతో కంగు తిన్నాడు. కోర్టు చుట్టూ తిరిగినా ప్రయోజనం దక్కలేదు.

ఈ గండం ఎలా గట్టెక్కాలో అర్థం కాలేదు.

అనన్య నుంచి వచ్చిన ఈమెయిల్స్ చూసి చిరాకుపడ్డాడు. తన ఇబ్బందుల్లో తనుంటే ఉద్యోగం నుంచి తీసేశారని ఆమె ఘోష!

అనన్య రూపాన్ని, ఆమెను గూర్చిన తలపులను తుడిచేశాడు మెదడు పొరల్లోంచి.

తనెప్పుడూ కింగ్‌గానే ఉండాలి.

అమెరికా అమ్మాయి కింద అసిస్టెంట్‌గా బతక్కూడదు.

ముందు ఆ అమ్మాయి అమెరికా నుండి ఇండియా రాకుండా చేయాలి. తానే ఆమె తరఫున కంపెనీలన్నిటినీ అజమాయిషీ చెయ్యాలి.

కమలాంబ దగ్గర కూర్చున్నాడు.

"అమ్మా! నువ్వు నయనికతో మాట్లాడి నచ్చచెప్పు. ఆమెకు ఎంత డబ్బు అవసరం అయితే అంత పంపుదాం. అమెరికాలోనే ఉండిపొమ్మను. కంపెనీ వ్యవహారాలు చూడటం తలనొప్పి పనని నూరిపొయ్యి. వీలుంటే ఆమె ఆస్తిపాస్తులకు నన్ను 'పవర్ ఆఫ్ అటార్నీ'గా నియమించమను... ఆమెకు ఆడిట్, ఇన్‌కంటాక్స్ గొడవలు, చికాకులు లేకుండా ఆ ఇబ్బందులు నేను పడతాను" తల్లిని ప్రాధేయపడుతూ అడిగాడు.

'అలాగే చెబుతాలే!' అందామె.

ఇండియాలో మధ్యాహ్న సమయం అంటే ఆ టైములో నయనిక గాఢనిద్రలో ఉంటుంది. ఇక్కడ పగలైతే అమెరికాలో రాత్రి.

రాత్రి తొమ్మిది గంటలప్పుడు నయనిక




ఫోన్ చేసింది.

"ఏమ్మా! ఎలావున్నావ్? " అడిగింది.

తల్లిదండ్రులను కోల్పోయి దుఃఖసాగరంలో మునిగి ఉంటుందని ఆమెకు తెలుసు.

ఏడ్చేసింది.

"అమ్మ నాన్నలు చనిపోయి దుఃఖంతో నేను తల్లడిల్లిపోతుంటే ఇక్కడ పలుకరించి గుండెలో గూడుకట్టుకున్న బాధను తొలగించేవారే కరువయ్యారత్తయ్యా! మీరు పలుకరిస్తుంటే ఏడ్పు వచ్చేసింది" అంది నయనిక.

"ఇండియా వొచ్చెయ్యి తల్లీ! మేమంతా నీకు అండగా ఉంటాం!"

"బావ ఎలా ఉన్నాడత్తయ్యా? కోర్టు కేసులో గెలిచామని మా ప్లీడరు చెప్పాడు... నాకు మైనారిటీ తీరినందున ఇండియాకు వచ్చి ఆస్తిపాస్తులను, కంపెనీలను స్వాధీనం చేసుకోవచ్చని చెప్పాడు... ఆ విషయాల్లో నాకు పెద్ద ఆసక్తిలేదు.. బావ అన్నీ సక్రమంగానే చూస్తున్నాడు గదా! నేను వచ్చి తలదూర్చడం ఎందుకు? "

చనిపోయే ముందు తండ్రి చెప్పిన మాటలు గుర్తుకువచ్చాయి.

కొడుకుమీద ప్రేమతో తను తప్పుటడుగు వెయ్యకూడదు... తన బాధ్యతలు తను సక్రమంగా నిర్వహించాలి! నాన్న తనమీద నమ్మకంతో నయనిక కస్టోడియన్‌గా తనను ఉండమన్నాడు. ఇప్పుడు ఆ అమ్మాయి పెద్దదయ్యింది. ఆమె ఆస్తి ఆమెకు అప్పగించాలి. అది తన బాధ్యత. తనను పెంచి పెద్దచేసిన తండ్రి కోరుకున్నట్లుగా తను ప్రవర్తించాలి.

"కంపెనీల వ్యవహారాలు ఏమీ సక్రమంగా ఆకాష్ నిర్వహించడం లేదమ్మా! వాడి నిర్వహణలో వ్యాపారాలు కొనసాగితే బాగా నష్టపోతాం! నాన్నగారు ఎంతో కష్టపడి నిర్మించిన వ్యాపార సామ్రాజ్యం కూలిపోతుంది... కంపెనీలలో పనిచేసే నమ్మకస్తులైన ఉద్యోగులు నాదగ్గరకు వచ్చి ఆకాష్ అసమర్థత గూర్చి చెప్పారు. ఆ విషయాలు నాకు చేరవేశారని వాళ్లను ఉద్యోగాల్లోనుంచి తీసేశాడు... కొన్ని వ్యసనాలు కూడా ఆకాష్‌కు అలవడ్డాయని తెలిసింది. నువ్వు ఇండియా వచ్చి నీ కంపెనీ వ్యవహారాలు సరిదిద్దుకోవాలి. వాడిని కూడ సక్రమమైన మార్గంలో పెట్టాలి! తమ్ముడు చనిపోయాడనే బాధ నా గుండెనూ తొలిచేస్తున్నది... నువ్వు నా పక్కనే ఉంటే ఆ బాధను మర్చిపోతాను... ఇక్కడ ఉంటే ఒకరికొకరు

> ## కొత్తగాలి...
>
> **పాలన**
>
> **అ(హ)స్తవ్యస్తం**
>
> **పార్టీ**
>
> **అస్తమయం**
>
> – చక్కా లక్ష్మీప్రియ,
>
> కావలి

తోడుగా ఉంటాం!" కొడుకు చెప్పమన్నట్లుగా కాకుండా తన మనస్సులోని మాటను స్పష్టంగా చెప్పేసింది.

గంటసేపు మాట్లాడుకున్నారిద్దరూ ఫోన్‌లో

★ ★ ★

శీతాకాలం వొచ్చేస్తూవుంది.

న్యూజెర్సీ రంగుల లోకంలా కన్పిస్తూ వుంది.

శీతాకాలంలో మంచు కురిసే సమయానికి ముందే ఆకులన్నీ రాలిపోయి చెట్లు మోడులవుతాయి. రాలిపోయేముందు వో పదిహేను రోజులు చెట్ల ఆకులు ఎరుపు,

పసుపుపచ్చ, నీలిమ, గోధుమ రంగుల్లోకి మారిపోతాయి. చెట్లమీద చేరిన రంగురం గుల పిట్టలు కోటిరాగాలు పలుకుతూవుం టాయి.

ఫాల్ కలర్స్ చూస్తూ ప్రిన్సిటన్ నుంచి శాండర్స్ డ్రైవ్‌కు వెళ్తూ వుంది నయనిక కారులో.

ఉదయం అత్తయ్య చెప్పిన మాటలు గుర్తుకు వొచ్చాయి.

అమెరికాలోనే పుట్టి పెరిగింది. ఇప్పుడు ఇండియాకు వెళ్ళిపోయి అక్కడ స్థిరపడగ లదా?

తను పుట్టి పెరిగింది అమెరికాలోనైనా 'మీ తల్లిదండ్రులు ఆసియా నుంచి వొచ్చారా?' అని అడుగుతూ వుంటారు అమెరికన్స్. ఎందుకనో ఇండియా అంటే అభిమానం... 'ఇంట్లో కూడ ఇంగ్లీషులోనే మాట్లాడాలి!' అని టీచర్లు చెప్పినా తను ఇంట్లో తెలుగులోనే మాట్లాడేది. ఇండియా నుంచి తెలుగు పుస్తకాలు, మ్యాగజైన్స్ తెప్పించుకుని చదివేది.

అమెరికన్స్‌కు ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి మకాం మార్చెయ్యడం బాగా అలవాటు. న్యూజెర్సీలో వో ఐదేళ్ళు వుంటే షికాగోలో మూడేళ్ళు వుంటారు. తల్లిదండ్రులు వో ప్రాంతంలో, వాళ్ళ సంతానం మరో ప్రాంతంలో... చివరి దశలో చాలామంది ఫ్లోరిడా చేరుకుం టారు... 'పెన్షనర్స్ ప్యారడైజ్' అనే పేరు వుంది ఆ ప్రాంతానికి.

న్యూజెర్సీ గార్డెన్ స్టేట్... ఎటుచూసినా పచ్చదనం పరవొళ్ళు తొక్కుతూ వుంటుంది.

శాండర్స్ డ్రైవ్ చేరుకుంది కారు.

కారు గేరేజ్‌లో పెట్టి ఇంట్లోకి వెళ్ళింది.

విశాలమైన ఇల్లు. తల్లిదండ్రులు ఎకరం పొలం మధ్యలో కట్టుకున్నారు. 'మైత్రి వనం' ఇంటికి పెట్టుకున్న పేరు.

ఒంటరిగా వుంటున్నా భయమేమీ వుండదు. ఏదన్నా ఆపద జరిగినా నిము షాల్లో వాలిపోతారు పోలీసులు, ఫైర్ ఇంజనువాళ్ళు మెడికల్ అంబులెన్స్‌తో సహా.

ఇంట్లోకి వెళ్లాక నెట్ ఓపెన్ చేసి అన న్యతో ఛాటింగ్ చేసింది.

మనసులోని మాటను చెప్పుకునేందుకు ప్రాణంలో ప్రాణంగా వుండే స్నేహితులు వుండాలి. మగవాళ్ళ స్నేహంలో కొంత స్వార్థం వుంటుంది. ఆడవాళ్ళ స్నేహం మనస్ఫూర్తిగా వుంటుంది.

మెదడులో వేడివేడిగా మరిగిపోతున్న ఆలోచనలను స్నేహితులతో పంచుకుంటే మనస్సు చల్లబడుతుంది.

"అమ్మానాన్నలు చనిపోయేక అమె రికాలో వుండాలంటే ఇబ్బందిగా వుంది. అంతా గ్లూమ్‌గా వుంది... ఆర్థికంగా ఇక్కడ నాకేం ఇబ్బందులు లేవు. వేలకు వేల డాలర్లు అమ్మానాన్న సంపాదిం చేరు... ఒకప్పుడు 'అమెరికా ఈజ్ పార డైజ్ ఆన్ ఎర్త్'... ఇప్పుడా పరిస్థితి లేదు... ఇప్పుడన్నీ సమస్యలే! ఒకప్పుడు-సైన్సు, టెక్నాలజీ రంగాలలో కొత్త కొత్త ఆవిష్కరణలన్నీ అమెరికా నుంచి వచ్చేవి... ఇప్పుడు కొత్త విషయాలు కని పెట్టే ఉద్వేగం, ఉత్తేజం అమెరికన్స్‌లో లేదు... అందరిలో వో విధమైన నిర్లి ప్తత... ఇండియా వొచ్చెయ్యాలని వుంది" టైపు చేసింది నయనిక.

"నువ్వు హైద్రాబాద్ వొచ్చేస్తే నాకెంతో సంతోషం... అప్పుడప్పుడు నిన్ను కలుసు కోవొచ్చు! ఆత్మీయంగా వుండే మనుషులకు కొదవలేదిక్కడ... ఇండియా ఎంతో అద్భు తంగా వుంటుంది. మన సంస్కృతి ఎన్ని వేల సంవత్సరాలైనా ఎన్ని ఒడుదుడుకులు ఎదురైనా ఏ మార్పుకు లోనుగాకుండా చెక్కుచెదరకుండా వుంది... మనం సాంప్ర

దాయికంగా జరుపుకునే పండుగలు కూడ ఎన్ని వందల సంవత్సరాలు గడిచినా అదే ఉత్సాహంతో జరుపుకుంటూ వున్నారు" తన అభిప్రాయం వ్యక్తపర్చింది అనన్య.

"వాట్ ఎబౌట్ యువర్ బాయ్ ఫ్రెండ్? " అడిగింది అనన్యను.

"ఐ పుట్ ఫుల్‌స్టాప్ టు దట్ ఫ్రెండ్ షిప్... ఆకాష్ ఈజ్ నోమోర్ మై ఫ్రెండ్. అతని గూర్చి తలవడంలేదు. అంత రిలయబుల్ పర్సన్ కాదతను"

"హౌ ఈజ్ అనురాగ్స్ హెల్త్? "

"హి ఈజ్ ఫైన్... అనురాగ్ కోలుకుంటున్నాడు. వాళ్ళమ్మగారు నన్ను తమ కుటుంబ సభ్యురాలిగా ఆత్మీయంగా చూస్తుంది"

"ఐ విల్ మీట్ యు ఇన్ ఇండియా" ఓ నిర్ణయానికి వొచ్చేసి టైప్ చేసింది మనస్సులోని మాటను నయనిక.




అన్ని రూములు తిరుగుతూ అనురాగ్ రూములోకి వొచ్చాడు డాక్టర్.

"యూ ఆర్ ఫర్‌ఫెక్ట్లీ ఆల్‌రైట్... ఈ రోజే డిశ్చార్చ్ చేస్తున్నాం... బిహేపీ" అన్నాడు అనురాగ్ వైపు చూస్తూ...

అనురాగ్ చూపులు అనన్యపై నిలిచాయి.

"మా అబ్బాయి పూర్తిగా కోలుకున్నట్లేనా? " అడిగింది అనురాగ్ తల్లి వనజాక్షి.

"ప్రస్తుతం ఓకే! మళ్ళీ ఇటువంటి పిచ్చి పనులు చెయ్యకూడదు"

"మా వాడికి అందం వుంది, ఆస్తివుంది. అన్ని సౌకర్యాలు అందుబాటులో వున్నాయి. దేనికీ కొరతలేదు... ఆ ఆలోచన ఎలా వచ్చిందీ? " అందామె.

"అన్నీ సౌఖ్యాలు వున్నా ఇబ్బందేనమ్మా! జీవించడం ఎలాగో తెలియక ఆత్మహత్యలకు పాల్పడతారు... కెనడా, జపాన్‌లో ఇటువంటి కేసులు ఎక్కువ! నడుస్తున్న దారి సాఫీగా వుంటే నడకలో మజా తెలియదమ్మా! ఎత్తుపల్లాలు వున్నదారిలో నడిస్తే ఆహ్లాదంగా వుంటుంది" అనేసి వెళ్ళిపోయాడాయన.

"డాక్టరు గారు చెప్పింది గుర్తుంచుకోండి" అంది అనన్య నవ్వుతూ

"ఏమన్నారు? " అడిగాడు, ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తూ

"బీ హేపీ! అన్నారు... ఆనందమే జీవితమకరందం" అందామె.

"అంటే? " మరో ప్రశ్న సంధించాడు.

"ఏ విషయం గూర్చి బుర్ర బద్దలు కొట్టుకోవొద్దు... నూరేళ్ళు ఆనందంగా జీవించండి"

"నూరేళ్ళు ఆనందంగా గడుస్తాయని మీరు గ్యారంటీ ఇస్తారా? నథింగ్ ఈజ్ సర్టెన్ ఇన్ మెడిసిన్!" అన్నాడతను.

"ఈ పిచ్చివాగుడే కట్టిపెట్టరా నాయనా!" అంది వనజాక్షి, కొడుకు తల నిమురుతూ.

★ ★ ★

మహర్షి ఆధ్యాత్మిక విషయాలగూర్చి అద్భుతంగా మాట్లాడుతాడు.

అంతకుముందు నాలుగైదుసార్లు ఆయన ప్రసంగాలు వింది అనన్య.

'కళాభారతి'లో ఆయన ప్రసంగ కార్యక్రమం వుందని తెలుసుకుని అనురాగ్‌ను

తీసుకుని కార్లో మద్దెలపాలెం వెళ్ళింది.

దాదాపు రెండొందల మంది మహర్షి ప్రసంగం వినాలని వొచ్చారు.

సాయంత్రం ఐదింటికే ఆయన ప్రసంగం మొదలుకావాలి. ఏడు గంటలయినా ఆయన రాలేదు.

చాలామంది వెళ్ళిపోయారు, ఎక్కువ సేపు వేచివుండలేక. ఎనిమిదింటికి వొచ్చాడు మహర్షి తూలుకుంటూ.

అప్పటికి వో యాభైమంది మిగిలారు. వాళ్ళకు కూడ చిరాకు వేసింది, ఆయన తూలుకుంటూ రావడంచూసి. మహర్షి వో అందమైన అమ్మాయి భుజం మీద చెయ్యి వేసి స్టేజి దగ్గర అటు ఇటు తిరగడం చూసి "తాగి వొచ్చాడు... అమ్మాయి భుజం నిమురుతూ కాలక్షేపం చేస్తున్నాడు... ఈ మహానుభావుడు మనకేం చెబుతాడు" అనుకుంటూ వాళ్ళూ వెళ్ళిపోయారు.

ఇక మిగిలింది అనన్య, అనురాగ్.

వాళ్ళ దగ్గరకు వొచ్చాడు మహర్షి "మీరు వెళ్ళిపోలేదే? టైమ్ తొమ్మిదవుతూ వుంటే? " అడిగాడు.

"మీ ఉపన్యాసం విందామని వొచ్చాం... మీరు తాగిరాలేదని నాకు తెలుసు.. అమ్మాయి భుజంమీద మీరు చెయ్యివేసి నడుస్తున్న తీరు మనవరాలి భుజంమీద తాతగారు చెయ్యి వేస్తున్నట్లు అన్పించింది... మీ ప్రవచనం వినడం కోసం వచ్చాం!"

వాళ్ళిద్దరిని స్టేజి దగ్గరకు తీసుకు వెళ్ళి తన పక్కన కూర్చొబెట్టుకుని చెప్పడం మొదలుపెట్టాడు.

"గురువుమీద నమ్మకం వుండాలమ్మా మొట్టమొదట... నమ్మకం లేకుండా గురు బోధ విన్నా వొంటబట్టదు. మీటింగుకు వొచ్చినవారి సహనాన్ని పరీక్షించడానికి ఆలస్యంగా వొచ్చాను. తాగి తూలుతున్నట్లు ప్రవర్తించాను.. అందరూ వెళ్ళిపోయారు. మీరిద్దరూ ఓపిగ్గా కూర్చున్నారు" అన్నాడాయన.

ఆయన కళ్ళల్లో నుంచి వస్తున్న వింత కాంతిని చూసి ఆశ్చర్యపోయింది అనన్య.

అనురాగ్‌ను మహర్షిగార్కి పరిచయం చేస్తూ "వీరు అనురాగ్... కోటీశ్వరులు... అయినా ఏదో తెలియని అశాంతితో కొట్టుమిట్టాడుతున్నారు... జీవితంమీద విరక్తి పుట్టిందాయనకు ఇరవై ఎనిమిదేళ్ళకే"

నవ్వాడు మహర్షి.

"అన్ని సంపదలలోకెల్లా మిన్న అయినది ఆరోగ్యం! బతికినన్నాళ్లూ ఉల్లాసంగా, ఉత్సాహంగా వుండాలి! మనిషితోపాటే సమాధి కూడ వుంటుంది... ఉలిపిరి కాగితంలాంటిది జీవితం... కాగితాన్ని చింపి ముక్కలు చెయ్యాలన్న ఆలోచన అనవసరం... ఏదో ఒకరోజు ఉలిపిరి కాగితం చిరిగిపోతుంది..." చెప్పుకుపోయాడు.

మహర్షిగారి ఉపన్యాసం ఎంతో బాగుందనుకున్నాడు అనురాగ్.

ఎండిన భూమిమీద తొలకరి జల్లులా ఆయన మాటలు మెదడు పొరల్లో దూరేయి.

గంట గడిచేక ఆయన దగ్గర సెలవు తీసుకుని కార్లో ఇంటికి వొచ్చేశారు. దార్లో తన ఇంటిదగ్గర దిగిపోయింది అనన్య.

## కొత్తగాలి...

**గెలిచేది**
**నాయకులు**
**ఓడేది**
**ఓటర్లు**

– బిక్కునూరి రాజేశ్వర్,
పొన్కల్

ఆ రోజు రాత్రి అనురాగ్‌కు బాగా నిద్ర పట్టింది.

అనన్య రోజంతా తన పక్కన వుండటం తోపాటు మహర్షిగారి ఉపన్యాసం అతని మనస్సును ఆహ్లాదపరిచాయి. గాఢనిద్ర లోకి జారుకున్నాడు.




"ప్లీజ్ ఫాజన్ యువర్ సీట్ బెల్ట్స్... ద ఫ్లయిట్ ఈజ్ లాండింగ్ ఎట్ షంషాబాద్ ఎయిర్‌పోర్ట్... ద గ్రౌండ్ టెంపరేచర్ అవుట్‌సైడ్ ఈజ్ థర్టీఫైవ్ డిగ్రీస్... లోకల్ టైమ్ ఈజ్ నైన్ వో క్లాక్ పి.యమ్."

కేబిన్ నుంచి అనౌన్స్‌మెంట్ రావడంతో సీట్‌బెల్ట్ నడుంచుట్టూ బిగించుకుంది నయనిక, చేతిలోని స్పార్క్ నికోలస్ నవల హ్యాండ్‌బ్యాగ్‌లో పెట్టుకుని.

న్యూజెర్సీలోని నేవార్క్ ఎయిర్‌పోర్ట్ నుంచి హైదరాబాద్ చేరుకోవడానికి ఇరవై గంటలకు పైగా పట్టింది. ఫ్లయిట్ జర్నీ ప్లజెంట్‌గానే వుంది తన పక్కన కూర్చున్న యాభైయ్యేళ్ళ పెద్దాయన నాన్‌స్టాప్‌గా వాగుతూనే వున్నాడు. 'విసిగించేశాడు' అనుకుంది. విమానం దిగి సెక్యూరిటీ చెక్ దగ్గరకు వొచ్చేదాకా ఏవేవో అడుగుతూనే వున్నాడు 'మీరు వుండబోయేది ఎక్కడ?', 'మిమ్మల్ని రిసీవ్ చేసుకోవడానికి ఎవరైనా వొస్తున్నారా?' తదితర ప్రశ్నలతో విసిగిస్తూనే వున్నాడు.

"నన్ను రిసీవ్ చేసుకోవడానికి నా బాయ్‌ఫ్రెండ్ వొస్తున్నాడు" అంది విసుగ్గా.

చెంపదెబ్బ తగిలినట్లు దూరంగా జరిగిపోయాడు.

బయట గేటు దగ్గరకు రాగానే 'వసుధ గ్రూప్ ఆఫ్ కంపెనీస్' డిస్‌ప్లే బోర్డు పట్టుకున్న ఒకతను, అతని పక్కనే నిలబడ్డ అందమైన కుర్రాడిని చూడటంతో వాళ్ళ దగ్గరకు వొచ్చింది.

"ఐయామ్ నయనిక... ఫ్రం న్యూజెర్సీ" అంది యువకుడి దగ్గరకు వెళ్ళి.

ఫ్లేర్డ్ ప్యాంటు, తెల్లటి జాకెట్, బ్రౌన్ షూస్‌లో మెరిసిపోతూ కన్పించిన నయనికను కళ్ళార్పకుండా చూస్తూవుండిపోయాడు.

రెండు క్షణాల తరువాత తేరుకుని "ఐయామ్...ఆకాష్" అన్నాడు చెయ్యి ముందుకు చాపి.

సుతారంగా అతని చేతిని స్పృశించి వొదిలేసింది. ఒళ్ళంతా ఝల్లుమంది అతనికి.

"వెల్‌కమ్ టు ఇండియా.. వసుధ కంపెనీస్ హార్టీ వెల్‌కమ్స్ యూ!" అన్నాడు ఆమె చేతితో పట్టుకున్న ట్రాలీ బార్‌ను తాను అందుకుంటూ. కొంచెం దూరం వెళ్ళేక ట్రాలీ డ్రైవరుకు ఇచ్చాడు. కారు పార్కు చేసిన స్థలానికి ట్రాలీ తోసుకెళ్ళాడు డ్రైవరు.

"నాకు తెలుగు బాగా వొచ్చు... తెలుగులో మాట్లాడటం ఇష్టం నాకు... కమలాంబ అత్తయ్యగారు బాగున్నారా?" అడిగిందామె.

"అమ్మకి జలుబు, దగ్గు... ఎయిర్‌పోర్టుకు వొద్దామనుకుంది... రాలేకపోయింది"

లగేజీ కార్లో సర్దేక వెనుకసీటులో

కూర్చున్నారు ఇద్దరూ.

ఆకాష్‌కు ఎంతో ఆనందంగా వుంది. మనోహర్ మామయ్య కూతురు అంత అందంగా వుంటుందని ఊహించలేదు. కోర్టులో కేసు ఓడిపోయినందుకు అప్పటివరకూ దిగులుపడుతూ వున్నాడు. అప్సరసలా నయనిక కన్పించేసరికి 'ఆస్తితోపాటు అందాలరాశి కూడా తనకు తప్పకుండా దక్కుతుంది' అనుకున్నాడు.

ఎక్కడో యూయస్‌లో పెరిగిన అమ్మాయి కంపెనీ గొడవలు ఎలా తలకెక్కించుకుంటుంది. విసుగుపుట్టి అన్ని వ్యవహారాలు తనకే వొదిలేస్తుంది.

మచ్చిక చేసుకుంటే ఈ అందాల భామ తన సొత్తవుతుంది.

తను తొందరపడకూడదు. నయనికతో పెళ్ళయ్యేవరకు వేరే అమ్మాయిలతో సంబంధాలు పెట్టుకోకూడదు.

అనన్య తనమీద పిచ్చి ఆశలు పెట్టుకుందేమో! కోటీశ్వరుడు మొగుడు కావాలని ప్రతి మిడిల్ క్లాసమ్మాయి కలలు కంటూ వుంటుంది... భార్యగా స్వీకరించే స్టేటస్ ఆ అమ్మాయికి లేదే! ఆ అమ్మాయికి అభ్యంతరం లేకపోతే సెకెండ్ సెటప్‌గా విశాఖపట్నంలో వుంటుంది... నారీ నారీ నడుమ మురారి...

నవ్వుకున్నాడు.

అదే సమయంలో నయనిక కూడ అనన్యను తలుచుకుంటూ వుంది.

సోషల్ నెట్‌వర్కింగ్ సిస్టమ్‌ద్వారా ఇద్దరూ క్లోజ్ ఫ్రెండ్స్ అయ్యారు. ఫేస్‌బుక్‌లో ఆమె ఫొటోలు చూడటమే! ఏం చేస్తుందో ఇప్పుడు? ఇండియా వస్తున్నట్లు మెసేజ్ ఇచ్చింది.

కారు జూబ్లీహిల్స్‌లో వో పెద్ద భవనం ముందు ఆగింది.

పదేళ్ళ క్రితం తల్లిదండ్రులతోపాటు ఇండియా వొచ్చినప్పుడు అమ్మమ్మ వాళ్ళింట్లో వుంది. కమలాంబ అత్తయ్య

## కాళ్ళు నెత్తిన పెట్టుకుంటే..

ఒకసారి ఓ అతి చాదస్తుడు గాంధీజీ దగ్గరకొచ్చి 'గాంధీజీ! మనం ఈ మూడు మణుగుల శరీర భారంతో భూమిమీద నడుస్తుంటే ఎన్నెన్ని జీవులు ఈ బరువు కిందపడి నలిగి చనిపోతున్నాయో గదా?' అన్నాడట ఎంతో బాధగా.



గాంధీజీ ఆ మహా అహింసావాదికి ఎలా సమాధానం చెప్పాలో, ఏమని చెప్పాలో తోచక ఇబ్బంది పడుతున్నారు.

అది చూసి అక్కడే ఉన్న పటేల్ వెంటనే అందుకుని, 'దీనికింత ఆలోచించే పనేముంది! కాళ్ళు నెత్తిన పెట్టుకొని నడిస్తే సరి, సమస్య తీరిపోతుంది కదా?' అన్నాడు వ్యంగ్యంగా.

దాంతో కంగుతిన్న ఆ అహింసావాది తన చాదస్తపు మాటలను కట్టిపెట్టి కాస్సేపు లోకాభిరామాయణం చెప్పి వెళ్లిపోయాడట.

వొచ్చి తనను తాతయ్యకు పరిచయం చేసింది.

చెట్టంత మనిషి తాతయ్య! నడుస్తుంటే భూమి అదురుతున్నట్లు అన్పించేది.

మళ్ళీ ఇండియా రావడం ఇదే!

అమ్మమ్మ తాతయ్యలు కూడ కాలగర్భంలో కలిసిపోయారు. కమలాంబ అత్తయ్య తప్పితే తనకు దగ్గరి బంధువులు ఎవరూ లేరు.

పోర్టికోలో నిలబడింది కమలాంబ, వాళ్ళ రాకకోసం ఎదురుచూస్తూ.

"ఏమ్మా! ప్రయాణం బాగా జరి

గిందా? ” అంది, మేనకోడలి బుగ్గలు నిమిరి భుజంమీద చెయ్యివేసి నిమురుతూ.

వంటమనిషి వొచ్చి ఎర్రనీళ్ళతో దిష్టితీసి హారతి ఇచ్చి ఇంట్లోకి అడుగుపెట్టమని చెప్పింది.

హాల్లో అడుగుపెట్టగానే లైఫ్ సైజులో వున్న బుచ్చి నాయుడు దర్జాగా కుర్చీలో కూర్చుని ఉంటే, ఆయన పక్కన నిలబడ్డ వసుధ నాయనమ్మ తైలవర్ణ చిత్రం కన్పించింది.

అప్రయత్నంగా వాళ్ళిద్దరికీ నమస్కరించింది.

## కొత్తగాలి...

**డబ్బు**
**పబ్బు**
**జబ్బు**
**గబ్బు!!**

– గుడిమెట్ల గోపాలకృష్ణ,
అరసవిల్లి

చెమర్చిన కళ్ళతో తాత, నాయనమ్మలనే చూస్తూ వుండిపోయింది.

...నయనిక ఉత్త సెంటిమెంటల్ ఫూల్‌లా వుందే! ఎప్పుడో చనిపోయిన ముసలాళ్ళ ఫొటో చూసి కనురెప్పలు కదిలించకుండా నిలబడటమేమిటి?

ఈ పిచ్చి అమ్మాయిని తేలిగ్గానే బుట్టలో వేసుకోవచ్చు!...

“లగేజీ మేడపైన గదిలో చేర్చండి.. అమ్మగారికి ఏం కావాలో కనుక్కోండి” ఇంట్లో వంటమనిషికి, నౌకర్లను పురమాయిస్తూ అనుకున్నాడు ఆకాష్.

“ప్రయాణం చేసి అలసిపోయినట్లున్నావ్.. ముందు స్నానం చేసి వొచ్చేస్తే భోజనం చేద్దాం, మాట్లాడుకుంటూ!” అంది కమలాంబ.

మేడ పైభాగంలోకి వెళ్ళింది నయనిక.

విశాలంగా వున్న పెద్ద హాలు చిన్న కాన్ఫరెన్స్ హాలులాగానే వుంది. అటువైపు ఇటువైపు సోఫాలు, కుర్చీలు వేసి వున్నాయి. సోఫాల ముందు టీపాయ్‌లు వున్నాయి. హాలు రెండు వైపులా పెద్ద రూములు వున్నాయి.

తన లగేజ్ పెట్టిన రూములోకి వెళ్ళింది.

పనమ్మాయి ఆమెను అనుసరించింది. యాభై ఏళ్ళకు పైగా వుంటాయి ఆమెకు.

“పద్దెనిమిదేళ్ళ వయస్సు నుంచి ఈ ఇంట్లో పనిచేస్తున్నానమ్మా! మీ తాతగారే నన్ను పనిలోకి పెట్టుకుంది. నాకు చిన్న ఇల్లు కొనిపెట్టారు. నా పిల్లల చదువులకు సాయపడ్డారు. మీ తాతగారు దొడ్డ మనిషమ్మా! అన్నీ తెలిసినవారాయన. పర్వతంలా గట్టిగా వుండే మనిషి, మీ నాన్న దూరం అవడంతో పేలపిండి గుట్టలా గట్టిగా ఊదితే చెదిరి పోయేటట్లు అయ్యారు.. మీ నాన్నగారు ఈ గదే వాడుకునేవారు. నేను పని అమ్మాయినని భావించకుండా సొంత అక్కలా చూస్తూ నాతో ఆడేవారు. సినిమా పాటలు విన్పించేవారు. తాను గీసిన బొమ్మలు చూపించేవారు. కమలాంబగారు కూడా మంచివారేనమ్మా!” చెప్పుకుపోయింది, ఆకాష్ గూర్చి మాత్రం చెప్పకుండా.

“నీ పేరేమిటే? ” అడిగింది నయనిక

“శేషమ్మ”

“శేషమ్మ! ఇక నుంచి నాకు కావల్సినవన్నీ నువ్వే అమర్చిపెడుతూ వుండాలి. నా గదిలోకి ఎవరూ రాకూడదు. పక్కగది ఎవరు ఉపయోగించుకుంటున్నారు? ”

“కమలాంబ గారికి కీళ్ళనొప్పులు.. మెట్లు ఎక్కలేరు.. మేడపైకి రారు. ఇక

అబ్బాయిగారు అప్పుడప్పుడు స్నేహితులను తీసుకు వచ్చి రాత్రిళ్ళు మేడపైన వుంటారు. దగ్గర్లోనే వేరే ఇల్లు కూడా వుంది. ఎక్కువగా ఆ ఇంట్లోనే ఆకాష్ గారు వుంటారు" అన్ని వివరాలు చెప్పేసింది శేషమ్మ.

తాతగారు కట్టించిన ఇల్లు, పైగా తండ్రి యు.యస్ వొచ్చే ముందు ఇదే ఇంట్లో వున్నాడని శేషమ్మ చెప్పేసరికి కన్నతల్లి ఒడిలో వున్నంత నిశ్చింత వొచ్చేసింది. బాత్‌రూము ఆధునాతనంగానే వుంది. టబ్‌లో కూర్చుని బబుల్ బాత్ చేసింది. స్నానంచేసి పాలనురుగులాంటి తెల్లటి పైజామా, వొదులుగా వున్న తెల్లటి చొక్కా వేసుకొని కిందికి వొచ్చింది.

భోజనం టేబుల్ దగ్గర కూర్చున్నారు. నయనికకు ఎదురుగా కూర్చున్నాడు ఆకాష్. నయనిక పక్కన కూర్చుని తన తండ్రి బ్రిటిష్ వాళ్ళ హయాంలో చేసిన వ్యాపారాలు హైద్రాబాద్ వొచ్చి పెట్టిన కంపెనీల గూర్చి చెప్పింది కమలాంబ.

"మీ తాత గార్కి నేను సొంత కూతుర్ని కాదు. పెంపుడు కూతుర్ని. సొంత కూతురు కంటే ఎక్కువగానే చూసుకున్నారు. ఇరుగు పొరుగు వాళ్ళ ద్వారా తెలిసింది తప్పితే నేను పెంపుడు కూతుర్నని అమ్మానాన్నలు ఎప్పుడూ అనేవారు కాదు"

తల్లి చాదస్తం మాటలు ఆకాష్‌కు నచ్చలేదు. 'ఆ విషయం ఇప్పుడు ఎందుకు?' అని గొణుక్కున్నాడు. 'అనవసర ప్రసంగం ఎక్కువగా చేస్తుంది అమ్మ' అనుకున్నాడు మనస్సులో.

"మేడపైన గది మీరు ఉపయోగించుకుంటున్నారటగదా! పై ఫ్లోర్ అంతా నేనే ఉపయోగించుకుంటాను. మీ వస్తువులు ఏమన్నా వుంటే తీసి కింద పెట్టుకోండి!" అంది నయనిక ఆకాష్‌తో.

మొదటి షాక్ చవిచూశాడు. పై అంతస్తుకు వెళ్ళి తరచుగా ఆమె అందాలు వీక్షించవచ్చు, ఆమెతో చనువుగా మాట్లాడటానికి వీలుగా వుంటుందనుకున్నాడు. కొంచెం దూరంగా నెట్టేస్తున్నట్లు అన్పించింది.

"అమెరికా నుంచి వొచ్చిన అమ్మాయి కదా.. ప్రైవసీ కోరుకోవడంలో తప్పేముంది?" సర్ది చెప్పుకున్నాడు తనకు తాను.

"ఉదయం పూట జాగింగ్ చెయ్యడం నాకు ఇష్టం. ఫైవ్‌థర్టీకి రెడీగా వుండు.. జాగింగ్ చేద్దాం!" అందామె భోజనం అయ్యేక.

అప్పుడే తనకు ఆర్డర్ వేస్తున్నదే! ఆమె లైనులో పడేసే వరకు తను ఓపిక పట్టాలి... జాగింగ్ చేసేటప్పుడు భుజం భుజం రాసుకుని తిరగొచ్చు. బోలెడన్ని విషయాలు మాట్లాడుకోవడానికి అవకాశం దొరుకుతుంది. వీలు చిక్కినప్పుడల్లా ఆమె అందాన్ని పొగడాలి. తప్పకుండా తనకు దగ్గరవుతుంది.

జాగింగ్‌కు తోడు రమ్మన్నందుకు సంతోష పడ్డాడు.

ఆ సంతోషం ఎక్కువ సేపు నిలువ లేదు.

"మేడమెట్లు ఎక్కబోతూ రేపు పదిగంటలకు మనహెడ్ ఆఫీసుకు వెళ్దాం! డాక్యుమెంట్స్ ఓసారి చూడాలి... మనకు ఎన్ని కంపెనీలు వున్నాయో, ఎక్కడెక్కడ ఆస్తి పాస్తులు వున్నాయో.. మనసొంత కంపెనీలు, జాయింట్ వెంచర్స్ ఏవో అన్నీ నేను తెలుసుకోవాలి గదా!" అంది నయనిక.

రెండో షాక్ తగిలింది గట్టిగా.

ఆలోచనలలో పడిపోయాడు ఆకాష్.

తను ఊహించిన దానికి విరుద్ధంగా వుంది.. అమెరికా నుంచి వచ్చే అమ్మాయి

అందంగా వుంటుంది. 'బావా! బావా!' అంటూ తన చుట్టూ తిరుగుతుంది అనుకున్నాడు తను ఊహించినదానికంటే వందరెట్లు ఎక్కువగా వొంపుసొంపులు వున్నాయి. ఆ విషయంలో రెండో అభిప్రాయం లేదు. కానీ తన పట్ల ఎక్కడా ఆసక్తి చూపించడం లేదు.

ఒక్క రోజులోనే కన్‌క్లూజన్‌కు వస్తే ఎలా? వారం రోజులపాటు వేచి చూడాలి!

ఆఫీసు వ్యవహారాల్లో తలదూర్చదనుకున్నాడు. 'బావా! ఆ విషయాలన్నీ నాకు తలనొప్పి! మంచి పబ్ ఎక్కడుంది? అక్కడకు రాత్రి చేరుకుందాం' అంటుందేమోననుకున్నాడు.

ఈ జాగింగ్‌లు, వాకింగ్‌లు ఏమిటి? వయస్సు మీద పడ్డవాళ్ళకి గాని..

తను ఎక్కడ సంతకం పెట్టమంటే అక్కడ పెడుతుంది. ఆఫీసుకు రాదనుకున్నాడు. 'ఆఫీసు ఫైల్స్, చెక్ బుక్కులు, ఇంటికే తెచ్చేయి. ఇంటి దగ్గరే సంతకాలు పెడతాను' అంటుందేమోననుకున్నాడు.

'మొండిఘటం లాగే వుంది. చూద్దాం ఈవిడ స్టైయిల్ ఆఫ్ ఫంక్షనింగ్!' అనుకున్నాడు ఆకాష్.

★ ★ ★

'వసుధ కంపెనీస్' మెయిన్ ఆఫీసుకు వెళ్ళి ఛైర్మన్ సీట్లో కూర్చుంది నయనిక.

వసుధ గ్రూప్ ఆఫ్ కంపెనీస్ సి.ఇ.వోలు, ఛార్టర్డ్ ఎకౌంటెంట్, ఇంజనీర్లు, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు, హెచ్.ఆర్ వింగ్ వాళ్ళు వరుసగా వచ్చి పూల బొకేలు ఆమెకు అందించి నమస్కరించారు.

రెండు చిన్న పవర్‌ప్లాంటులు, వో సిమెంటు ఫ్యాక్టరీ, సాఫ్ట్‌వేర్ కంపెనీ, రియల్‌ఎస్టేట్ కంపెనీల వాళ్ళు తమ కంపెనీల లాభనష్టాల పట్టికను ఆమెకు చూపించి అన్ని విషయాలు బ్రీఫ్ చేశారు. వాళ్ళంతా ఎక్కువగా ఆమె ఛాంబరులో వో పక్కన కూర్చున్న ఆకాష్‌తో మాట్లాడుతున్నారు గాని నయనికను సీరియస్‌గా తీసుకోలేదు.

ఆడపిల్ల ఇన్ని కంపెనీ వ్యవహారాలు ఏం చూస్తుంది? వారం రోజులు వొచ్చి ఏ విషయాలు అర్థంకాక మళ్ళీ ఆకాష్‌నే కంపెనీ వ్యవహారాలు చూడమని అంటుందనుకున్నారు. వాళ్ళ మైండ్ సెట్ అలాగే వుంది. అలా ట్యూన్ చేశాడు ఆకాష్

కార్పొరేట్ ఎగ్జిక్యూటివ్స్, ఛార్టర్డ్ ఎకౌంటెంట్స్‌ను ఏది అడిగినా పూర్తి వివరాలు చెప్పకుండా బ్రీఫ్ నోట్ ఇవ్వడమో, అకౌంట్స్ బుక్స్ ఆమె ముందు పెట్టేయడమో చేస్తున్నారు.

నెలరోజులు రోజూ ఆఫీసుకు వెళ్తున్నా ఏ విషయంలోనూ పట్టురాలేదు

'ఓడిపోతున్నానా?' అని ప్రశ్నించుకుంది.

తను స్థిరంగా నిలబడాలి. అన్నీ క్షుణ్ణంగా పరిశీలించి.. అన్నీ అవగతం కావడానికి కొన్ని నెలలు పట్టవొచ్చు.

తన ఎదురుగా ఆకాష్ కూర్చుని ప్రతి విషయానికి నవ్వడం నచ్చలేదు. అతన్ని వేరే ఛాంబరులో కూర్చోమంది. ఛైర్మన్ రూములో కూర్చోవడం అలవాటయిన అతనికి మరోగదిలో కూర్చోమనడం చిన్నతనంగా అన్పించింది. 'ఆమెను తన వశం చేసుకోవడానికి మరికొంత సమయం వేచి చూడక తప్పదు' అనుకున్నాడు.

ఫ్యామిలీ లాయరు విశ్వనాథం గారిని ఆయన ఆఫీసుకు వెళ్ళి కలిసింది. ఆయన్ని చదివించింది నయనిక తాతగారే! బుచ్చినాయుడు కుటుంబ సభ్యులంటే ఎంతో గౌరవించి మాట్లాడుతాడు.

"నువ్వొచ్చావేమిటమ్మా! ఫోన్ చేస్తే నేనే వొచ్చేవాడిని గదా!" అన్నాడాయన.

తన ఇబ్బందులన్నీ ఆయన ముందు ఏకరువు పెట్టింది.

"నాకు తెలిసినంత వరకు మీ కంపెనీలన్నీ ఆర్థికంగా పటిష్టంగానే వున్నాయి. అయితే దొంగ లెక్కలు చూపించి కొన్నిటికి నష్టాలు వొస్తున్నట్లు చూపిస్తున్నారు. మీ కంపెనీల్లో పనిచేసే కొందరు ఛార్టర్డ్ అకౌంటెంట్స్ ఆకాష్‌కు అనుకూలురు. వీలైనంత త్వరలో వాళ్ళకు నువ్వు ఉద్వాసన పలకాలి. అన్నీ నీ గ్రిప్‌లోకి తెచ్చుకోవాలి! మీ రియల్ ఎస్టేట్ కంపెనీ వ్యవహారమే దారుణంగా ఉంది. వాటి గురించి పేపర్లలో కథనాలు చూస్తున్నాను. విశాఖపట్నంలో వున్న మీ కంపెనీ ప్రభుత్వం నుంచి భూములు పొంది వాటిని తాకట్టు పెట్టి బ్యాంక్ రుణాలు పొందింది... ఆ డబ్బు మీ కంపెనీ ఎకౌంట్‌లో కాకుండా ఆకాష్ పర్సనల్ ఎకౌంట్‌లో జమచేసుకున్నాడు... కొన్ని అవకతవకలున్నాయి... అవన్నీ సరిదిద్దుకోవాలి! నువ్వు మాత్రం ధైర్యంగా ముందడుగు వెయ్యి... నా సహకారం నీకు ఎప్పుడూ ఉంటుంది... నాకు తెలిసిన ఓ చార్టర్డ్ ఎకౌంటెంట్ ఉన్నాడు... హి ఈజ్ వెరీ షార్ప్... అతన్ని నువ్వు మీ హెడ్ ఆఫీసులో పెట్టుకుని ఎకౌంట్స్ స్క్రూటినీ చేయించు. అతను నీకు ఉపయోగపడతాడు" అన్నాడు విశ్వనాథం.

గంటసేపు మాట్లాడాక ఆయన దగ్గర సెలవు తీసుకుని వొచ్చేసింది నయనిక.

★ ★ ★

నాలుగైదు రోజులు నయనికతోపాటు జాగింగ్‌కు వెళ్ళాడు ఆకాష్

ఆమెకు దగ్గరవ్వాలనే ప్రయత్నం చేస్తున్నాడు గాని వర్కవుట్ అవుతున్నట్లు అనిపించలేదు.

"నిన్న సినిమాకు వస్తానని చెప్పాక... నువ్వొస్తావని ఎదురు చూస్తూ ఆ థియేటర్‌కు సెక్యూరిటీ గార్డులా ఎంట్రెన్స్‌లో నిలబడ్డా... నీ కారే కన్పించలేదు" అన్నాడతను.

## ఆ కాస్త ఉండకూడదనా?

ఒకసారి గాంధీజీ కొబ్బరి తాడుతో నేసిన మంచంమీద పడుకోవటానికి ఉద్యుక్తుడవుతున్నాడు. పటేల్‌కు ఆ పని నచ్చక 'ఈ మంచంలో నల్లులుంటాయి! వాటితో మీరు వేగలేరు. మీరేమీ అనుకోపోతే నవారుమంచం



ఏర్పాటు చేస్తాను' అన్నాడట.

గాంధీగారు నవారు మంచం వద్దని మొండికేశారు. సెక్రటరీ మహదేవ దేశాయి కూడా గాంధీజీ నిర్ణయాన్నే బలపరిచారు.

'అసలే గాంధీజీ ఎముకలగూడు కదా! ఆ కొబ్బరితాటి మంచంలోని నల్లులు ఆ ఎముకలగూటి మీదున్న కాస్త చర్మం కూడా తినేయాలనా మీఉద్దేశం?' అన్నాడు పటేల్ చలోక్తిగా.

గాంధీజీ వల్లభాయ్ హాస్యానికి గలగలా నవ్వారట కాస్త దిగివస్తూ.

"నేను రాకపోవడం మీకేమన్నా ఇబ్బందిగా అన్పించిందా? సినిమాకు వెళ్ళాలని ఉందని అన్నాను గాని మీతో వస్తానని చెప్పలేదే? ఆఫీసు పనిలో పడి సినిమా సంగతే మర్చిపోయాను"

ఎత్తుగా ఉన్న ప్రదేశం చూపించి "ఈ ఎలివేటెడ్ ప్లేస్‌లో మల్టీ స్టోరేయ్డ్ బిల్డింగ్ కట్టిస్తే మంచి లుక్ వస్తుంది" అన్నాడు.

"ఒకప్పుడు హైదరాబాద్ ఉద్యానవనాల నిలయంగా వుండేదట... ఎక్కడ చూసినా చెరువులు వుండేవట... పచ్చదనంతో అలరారుతూ ఉండేదట... ఇప్పుడు కాంక్రీట్ జంగిల్‌లా తయారయ్యింది"

ఏవేవో మాట్లాడుతుందామె. అదంతా ట్రాష్‌లా అన్పిస్తుంది అతనికి.

"ఆకాశంలో స్వేచ్ఛగా పక్షిలా విహరించాలని ఉంది... మంచి పుస్తకాలు చదివితే చక్కటి ఊహలు వస్తాయి. మనస్సుకు రెక్కలు కట్టుకుని హిమాలయాలు, దండకారణ్యం, భారతీయులకు ఆత్మ అయిన గంగానదిని చూసి రావచ్చు!" అందామె

'అమెరికాలోనే ఉండిపోయి మనస్సుకు రెక్కలు కట్టుకుని ఇండియా, చైనా, జపాన్ తిరిగొస్తే సరిపోయేది కదా!' అనుకున్నాడ తను మనస్సులో.

"నేను ఇండియా రావడం నీకు నచ్చలేదు కదూ!" సూటిగా అడిగింది.

ఆకాష్ తత్తరపడ్డాడు. తన మనస్సులోని ఆలోచన ఆమెకెలా తెలిసింది?

అమ్మో ఘటికురాలే! ఆవులిస్తే పేగు లెక్క పెట్టేటట్లు ఉంది... ఈ పంచ కల్యాణిని లొంగదీసుకోవడం ఎలా? ఆలోచనలలో పడిపోయాడు.

★ ★ ★

నయనిక బాత్‌రూములోకి ఆమె గమనించకుండా దూరేడు ఆకాష్.

బాత్‌రూము తలుపులకు ఉన్న బోల్టు పెట్టుకోకుండా వొంటి మీద బట్టలు విప్పి స్నానం చెయ్యడం మొదలు పెట్టాడు.

ఏదో ఒక సమయంలో నయనిక తలుపు నెట్టుకుని లోపలికి వస్తుంది. నగ్నంగా వున్న తనను చూసి ఆమె చలించిపోతుంది...

కండలు తిరిగిన తన శరీరం తలపుకు వొచ్చి ఆమెలో ఉద్రేకం కట్టలు తెంచుకుంటుంది. తన దగ్గరకు వొచ్చి వాటేసుకుంటుంది.

నగ్నంగా తనను చూసిందంటే ఆ దృశ్యం నిప్పుల వర్షమై నిలువెల్లా ఆమెను దహించివేయదూ!

నవ్వుకుంటూ వొంటికి సబ్బు రుద్దుకుంటున్నాడు తీరిగ్గా.

తలుపు నెడుతున్న శబ్దం విన్పించింది.

లోపలికి వొచ్చిన శేషమ్మను చూసి సిగ్గుతో చచ్చిపోయాడు. టక్కున టవల్ అందుకుని ఒంటికి చుట్టుకున్నాడు.

అతన్ని చూసి ఆమె బయటకు వెళ్లిపోలేదు. లోపలికి వచ్చి నయనిక విడిచిన బట్టలు తీసుకుంది.

"నువ్వెందుకొచ్చావ్? " చిరాగ్గా అడిగేడు.

"ఇది మరీ సోద్యంగా ఉందండీ, అమ్మగారి బాత్‌రూమ్‌లో ఆమె అనుమతి లేకుండా మీరు దూరిపోయి నన్ను ప్రశ్నిస్తున్నారు. విడిచిన బట్టలు వాషింగ్ మెషిన్‌లో వేద్దామని వచ్చాను" అంది శేషమ్మ.

రాజీకి వచ్చాడు.

"సర్లే! నా బాత్‌రూమ్‌లో షవర్ చెడిపోయింది. అందుకని అమ్మగారి బాత్‌రూమ్‌కు వచ్చాను. నయనికకు ఈ విషయం చెప్పకు" అంటూ అక్కడినుంచి బయటకు వెళ్లిపోయాడు.

శేషమ్మ చెప్పకుండా ఉంటుందా?

నయనికకు ఆకాష్ పిచ్చిపనులు చేరవేసింది.

"ఈ బిల్డింగ్‌లో మీరు ఉండొద్దు... పెళ్లి గాని వాళ్లం ఒకే ఇంట్లో ఉండటం ఇబ్బందికరంగా ఉంటుంది ఇద్దరికి... బావమరదళ్ళ వరస మనది... నలుగురు నాలుగు రకాలుగా అనుకుంటారు... మీరు మరో బిల్డింగ్‌లో ఉండండి... అత్తయ్యగారు నాతోపాటే ఉంటారు" స్పష్టంగా చెప్పేసింది.

డిప్లొమేటిక్‌గా తనను ఆ ఇంట్లోంచి బయటకు పంపించేస్తున్నట్లు అర్థమయ్యిందతనికి

ఆకాష్ ఖాళీ చేశాక అతని గదిని లైబ్రరీగా మార్చేసింది నయనిక.





తనకు ఇష్టమైన తెలుగు, ఇంగ్లీషు సాహిత్యానికి సంబంధించిన పుస్తకాలన్నీ కొని, రాక్స్ నింపేసింది.

పర్సనల్ కంప్యూటర్ ఆ గదిలో పెట్టుకుంది. స్కూల్ డేస్‌లోనే కంప్యూటర్ వాడేది. బేసిక్స్ నేర్చుకోవడానికి, గేమ్స్ ఆడుకోవడానికి ఆ రోజుల్లో కంప్యూటర్ ఉపయోగించేది. ఫేస్ బుక్ ద్వారా అమెరికాలో తనతోపాటు చదువుకున్న అమ్మాయిలు, అబ్బాయిలు ఇప్పుడేం చేస్తున్నారు, వాళ్ళ హాబీలు ఏమిటి? అన్నీ తెలుసుకోగలుగుతుంది కూర్చున్న ఛైర్‌లోనుంచి కదలకుండానే!

తాత, నాయనమ్మలైన బుచ్చినాయుడు, వసుధల ఫొటోలు, తల్లిదండ్రుల ఫొటోలు అన్నీ ఫోల్డర్స్‌లో ఉంచి పెన్‌డ్రైవ్‌లో భద్రపరచింది. తల్లిదండ్రులతో కలసి సమ్మర్ వెకేషన్‌లో హవాయి ఐలెండ్స్ వెళ్ళినప్పటి దృశ్యాలు కూడా పెన్‌డ్రైవ్‌లో ఉన్నాయి.

ఐఫోన్‌లో నచ్చిన పాటలు వింటూ పని చేసుకుంటూ ఉంది. ఆ ఐఫోన్ ఫోర్త్ వెర్షన్. అమెరికాలో యాపిల్ స్టోర్స్‌లో కొన్నదది.

శేషమ్మ వచ్చింది గదిలోకి. ఐఫోన్ టేబిల్ మీద పెట్టింది నయనిక.

"కమలాంబ గారు రమ్మంటున్నారమ్మా"

"ఎక్కడవున్నారు? "

"హాల్లోనే వున్నారమ్మా... ఉయ్యూరు నుంచి ఆ అబ్బాయి వచ్చారమ్మా! ఆయన పేరేమిటో నోరు తిరగదు... మీ పొలాలు, తోటలు అ అబ్బాయే చూస్తూ ఉంటారు. సంవత్సరానికోసారి హైదరాబాద్ వస్తూ ఉంటారు" తనకు తెలిసిన విషయాలు చెప్పింది శేషమ్మ.

హాల్లోకి వొచ్చింది నయనిక

హంసలా నడిచి వస్తున్న ఆమె నడకలోని హొయలు చూసి ముగ్ధుడయ్యాడు ఆ వచ్చిన వ్యక్తి. చీరకట్టులో మెరిసిపోతూ కన్పించింది ఆమె అతనికి.

అమెరికాలో పుట్టి పెరిగిన అమ్మాయంటే డ్రెస్సులు తప్పితే చీరకట్టుకోదేమో ననుకున్నాడు. ఆహ్లాదాన్ని కల్గించే ఆకుపచ్చరంగు చీరకట్టుకుంది ఆ రోజు.

"వీరిది ఉయ్యూరు దగ్గర గరికపర్రు... మనకు ఆ వూళ్ళో పాతిక ఎకరాల పొలం- చెరకు, అరటి తోట వేస్తుంటారు... కౌలు డబ్బు తెచ్చారు... వీళ్ల నాన్నగారు మీ తాతగారికి ఆప్తులు... తాతగారికి నమ్మిన బంటు..." అంటూ ఆ అబ్బాయిని పరిచయం చేసింది.

"తాతగారికి ఆప్తులంటే మాకూ ఆత్మీయులే!" అంది నయనిక

చక్కటి తెలుగు మాట్లాడుతుంటే ఆనందపడ్డాడు.

"మీ పేరు? " అని అడిగింది అతని పంచెకట్టువైపు తదేకంగా చూస్తూ.

"రుత్విక్" అన్నాడతను.

పేరు మోడ్రన్‌గా ఉంది... హైదరాబాద్ వస్తూ కూడా చక్కగా పంచెకట్టుకుని, మల్లెపువ్వులాంటి చొక్కా, జరీ అంచు ఉత్తరీయం భుజం మీద వేసుకుని వొచ్చాడు. నుదుటన ఎర్రటి తిలకం బొట్టు వుంది.

"ఎంతవరకు చదువుకున్నారు? "

కొత్తపాత లేకుండా ఎటువంటి బెరుకూ లేకుండా తనతో మాట్లాడుతున్న ఆ అమ్మాయి తీరు నచ్చిందతనికి.

"యం.ఎ. తెలుగు లిటరేచర్" అన్నాడతను.

"తెలుగు లెక్చరర్ పని చెయ్యకుండా వ్యవసాయం చేస్తున్నారే? " అనుమానం వ్యక్తపర్చింది.

"మొక్కలు-చెట్లు నా శిష్యులు... వాటికి తెలుగు పద్యాలు, పాటలు విన్పిస్తుంటాను. మా నాన్నగారు నన్ను 'విద్యాదాత' ను చెయ్యాలనుకున్నారు.. నేను 'అన్నదా

తను అయ్యాను" అన్నాడతను నవ్వుతూ.

లెక్చరర్, ఫార్మర్ అనే పదాలు ఉపయోగించవొచ్చుగదా! విద్యాదాత, అన్నదాత అనే పదాలు అతను ఉపయోగించడం ఆమెక్కూడా నవ్వు తెప్పించింది.

ఎంత పొలం మగతాకి తీసుకున్నది, కౌలు డబ్బు వివరాలు వున్న కాగితం నయనికకు ఇచ్చాడు.

'ఆ కాగితం మీద అక్షరాలు కూడ అతనిలాగే తెల్లటిముత్యాల్లా మెరిసిపోతున్నాయి' అనుకుంది.

కాగితం మీద లెఖ్ఖలు చూడకుండానే టీపాయ్‌మీద పెట్టింది. ఆ పేపరు మీద నోట్ల కట్టలు చేతి సంచిలోనుంచి తీసి వుంచాడతను.

"డబ్బు లెక్క పెట్టుకోండి" అన్నాడతను.

"అవసరం లేదులెండి... నమ్మకస్తులు దొరకడం మా అదృష్టం" అందామె.

శేషమ్మ గాజుగ్లాసులో మజ్జిగ తెచ్చి ఇచ్చింది.

"కాఫీనో- కూల్‌డ్రింకో తీసుకురావొచ్చుగదా!" అంది శేషమ్మతో నయనిక.

"కాఫీకి ఎప్పుడూ నో.. మజ్జిగ, కొబ్బరి నీళ్లకు ఎప్పుడూ యస్. ఎన్నిసార్లు ఇచ్చినా తాగుతాను.. నా సంగతి తెలిసే శేషమ్మగారు మజ్జిగ తెచ్చారు" అని గ్లాసుడు మజ్జిగ రెండు గుటకల్లో తాగేశాడు.

"భోజనం చేసి వెళ్ళబ్బాయ్" అంది కమలాంబ.

"రెండుమూడు రోజులు మీ ఇంట్లో ఉందామనుకున్నానే! మీరేమో భోజనం చేసి వెళ్ళిపొమ్మంటున్నారు" అన్నాడు.

అతను సరదాగా మాట్లాడటం నయనికకు నచ్చింది.

అతను లేచి నిలబడ్డాడు. అప్పుడు చూసింది అతని ఆరడుగుల విగ్రహాన్ని. విశాలంగా వున్న ఛాతీ, నొక్కుల జుట్టు, పెదాలమీద చెదిరిపోని చిరునవ్వు.

'ఆరడుగుల అందగాడు' అనుకుంది.

అతని రూపం నయనిక గుండెను తాకింది.

"ఈరోజు ఇక్కడ వుండిపోండి.. రేపు వెళ్దురుగాని" అంది నయనిక.

"అతనంతేనమ్మా! చెప్పుల్లో కాళ్ళు పెట్టుకుని వొస్తాడు" అంది కమలాంబ.

"మీరు తీరిక చేసుకుని మా ఊరు రండి... మీ పొలాలు, తోటలు చూద్దురుగాని" గుమ్మందాకా వెళ్ళినవాడు వెనక్కు తిరిగివొచ్చి అన్నాడు.

"తప్పకుండా!" అంది నయనిక.

★ ★ ★

"అమ్మా! అడిగి చూశావా? " కమలాంబతో అన్నాడు ఆకాష్.

"ఏమిట్రా? " చదువుతున్న భగవద్గీతను పక్కనపెట్టి అడిగిందామె.

"అదే! నయనిక పెళ్ళి విషయం" నసిగాడు.

"ఆ అమ్మాయి వొచ్చి రెండు నెలలు కూడా కాలేదు... అప్పుడే ఆ ప్రస్తావన ఆ అమ్మాయి ముందు తేవడం ఎందుకు? వయస్సులో వున్నవాళ్ళు మీరిద్దరు.. ఒకరినొకరు సంప్రదించుకుని వో నిర్ణయానికి రండి. మీ ఇద్దరికీ పెళ్ళయితే నాకంటే సంతోషించేవాళ్ళు ఎవరుంటారు? " కళ్ళజోడు తీసి చీరకొంగుతో తుడుచుకుంది.

టెన్షన్‌లో వున్నాడతను.

నయనిక సొంతంగా ఓ ఛార్టర్డ్ ఎకౌంటెంటును నియమించుకుని కంపెనీ ఆర్థిక వ్యవహారాలను ఆకళింపు చేసుకునే ప్రయత్నం నచ్చలేదతనికి.

లొసుగులన్నీ బయటపడతాయి.

తనకు బాగా తెలిసిన మంత్రిగారి దగ్గర ఎన్నో రాయితీలు పొందాడు. దానికి ప్రతిఫలంగా ఆయన కొడుకు కంపెనీల్లో పెట్టుబడులు పెట్టాడు. పది రూపాయిలున్న షేర్‌ను రెండొందలకు కొన్నాడు. ఆ కంపె

నీలన్నీ నష్టాల్లో నడుస్తున్నాయి. పెట్టిన పెట్టుబడి పైసా తిరిగి రాదు.

విదేశాలు చుట్టిరావడం అవసరంవున్నా లేకపోయినా కంపెనీ ఖర్చుమీద, స్నేహితులకు పెద్ద ఎత్తున స్టార్ హోటల్లో పార్టీలు ఇవ్వడం, అమ్మాయిలతో పబ్బుల్లో తిరగడం- తన సొంత ఖర్చులు భారీగానే వున్నాయి. అవన్నీ నయనిక దృష్టిలో పడతాయి.

తనంటే బ్యాడ్ ఇంప్రెషన్ ఏర్పడక ముందే ఆమెను పెళ్ళి చేసుకోవాలి! అప్పుడు తను ఎంత ఖర్చు పెట్టుకున్నా అడిగే నాథుడే వుండడు. అమ్మ పేరు మీద కొన్ని ఆస్తులు తాత రాశాడుగాని అవి అమ్మడానికి అమ్మ ఒప్పుకోదు.

వసుధ నిలయం ముందు ఆటో ఆగింది.

ఆటో అతనికి మీటరు ఛార్జీ చెల్లించి ఎయిర్‌బ్యాగ్ భుజానికి తగిలించుకుని సరాసరి లోపలికి వొస్తున్న అమ్మాయి ఎవరానని శేషమ్మ ఆశ్చర్యపోయి చూస్తూ వుంది.

తల్లి గదిలోనుంచి బయటకు వొచ్చిన ఆకాష్ ఆ అమ్మాయిని చూసి అవాక్కయ్యాడు.




అనన్యకు ఈ ఇంటి అడ్రెస్ ఎలా తెలుసు? విశాఖపట్నం ఆఫీసులో తన పర్సనల్ ఫైలులో వుండే అడ్రెస్ చూసి వెతుక్కుంటూ వొచ్చిందేమో!

నయనిక కంటపడకుండా ఏవో మాయ మాటలు చెప్పి పంపించి వెయ్యాలి. తను వుండే ఇంటికి తీసుకు వెళ్ళితే సరిపోతుంది... పెళ్ళి చేసుకుంటానని మభ్యపెట్టి లోబర్చుకుంటే ఆ తర్వాత చచ్చినట్లు తనకాళ్ళ దగ్గర పడి వుంటుంది.

"హాయ్ అనన్యా! వెరీ సర్‌ప్రైజింగ్ టు సీ యూ హియర్... హు టోల్డ్ మై హవుస్ అడ్రెస్?" అన్నాడు ఆకాష్, ఆమె దగ్గరికి వెళ్ళి చనువుగా చేతిలోని బ్యాగ్ తీసుకోబోతూ.

ఆమెక్కూడా ఆశ్చర్యంగానే వుంది.

ఇతనెందుకు నయనిక ఇంట్లో వున్నాడు? నయనికకు ఏమవుతాడు? చుట్టమా? స్నేహితుడా?

నయనిక చెప్పిన విషయాలు గుర్తుకు వొచ్చాయి.

...ఇంతకాలం ఆమె ఆస్తుల్ని గుప్పెట్లో పెట్టుకుంది ఆకాషేనా? విశాఖపట్నంలోని వసుధా హోల్డింగ్స్ కూడా నయనికకు చెందినదేమో! అయినా అతని సంగతి తనకు అనవసరం... అతనికి దూరంగా వుండాలని తానెప్పుడో నిశ్చయించుకుంది.

"నాకు వేరే పెద్ద ఇల్లు వుంది. ఆ ఇంట్లోనే వుంటున్నాను. బాగా స్పేషియస్‌గా వుంటుంది. ఆ ఇంటికెళ్దాం పద!" అన్నాడతను.

"నేను వొచ్చింది నయనిక కోసం... ఆమె నా ఫ్రెండ్... ఆమె రమ్మంటేనే వొచ్చాను... ఎక్కడున్నారు ఆమె?" అందామె.

అతను ఊహించని సమాధానం ఆమె నుంచి వచ్చేసరికి బిత్తరపోయాడు.

"నయనిక నీకెలా తెలుసు?" అని అడగబోయేడు. మేడమెట్లు దిగుతూ నయనిక హాల్లోకి రావడం చూసి మౌనంగా వుండి

పోయాడు.

"హలో.. నయనికా! నేను అనన్యను... ఫేస్‌బుక్ ఫ్రెండ్‌షిప్ మనది" అంది అనన్య.

నయనిక వొచ్చి అనన్య భుజం చుట్టూ చెయ్యి వేసి ఆప్యాయంగా నిమిరింది.

"వెల్‌కమ్ టు మై హవుస్" అంది నయనిక. నౌకరుకు అనన్య చేతిలోని బ్యాగ్ తీసుకొమ్మని సైగ చేసింది. కమలాంబ గార్కి తన స్నేహితురాల్ని పరిచయం చేసింది.

ఆకాష్‌ను పట్టించుకోకుండా ఇద్దరూ నవ్వుకుంటూ మేడమీదికి వెళ్ళారు.

"హైద్రాబాద్ రీచ్ అయ్యేక మెసేజ్ ఇమ్మన్నాను గదా! స్టేషన్‌కు కారు పంపించేదాన్ని" అంది నయనిక.

"సెల్‌ఫోన్‌లో ఛార్జి అయిపోయింది.. 'అడ్రెస్ వుందిగా చేతిలో' అనుకుంటూ ఆటో పట్టుకుని వొచ్చేశాను" అంది చీర కొంగుతో మొహం అద్దుకుంటూ.

కాటన్ చీరలో ముద్దమందారంలా వున్న అనన్యను చూసి "యూ ఆర్ మోడెస్ట్ అండ్ వెరీ సింపుల్... ఐ లైక్ సింప్లిసిటీ" అంది నయనిక.

"ఆకాష్ తెలుసా నీకు..? నీతో మాట్లాడుతున్నాడు.."

"విశాఖపట్నంలో మీ కంపెనీ వుంది... ఆ కంపెనీలో ఐదు నెలలు పని చేశాను.. అప్పుడు పరిచయమయ్యారు" చెప్పింది అనన్య.

"మా అత్తయ్యగారి అబ్బాయి... నాకు మైనార్టీ తీరకముందు వాళ్ళమ్మగారే నాకు గార్డియన్... నా ప్రాపర్టీకి ఎగ్జిక్యూటర్... ఆమె తరఫున ఆకాష్ ఆఫీసు వ్యవహారాలు చూస్తూవుండేవాడు.. నేను ఇండియా వొచ్చినప్పటి నుండి నా చుట్టూ తిరుగుతున్నాడు... నన్ను పెళ్ళి చేసుకోవాలనే ఆలోచనేదో అతనికి వున్నట్లు వుంది"

నయనిక మాటలకు అడ్డుపడి "మీకు అతను నచ్చాడా? పెళ్ళి చేసుకుంటారా?" ఆత్రుతగా అడిగింది అనన్య.

"అతనిమీద నాకెందుకో సదభిప్రాయం ఏర్పడలేదు.. ఐ షుడ్ బి వెరీ కేర్‌ఫుల్ అండ్ వాచ్‌ఫుల్ ఇన్ టేకింగ్ ఎ డెసిషన్ రిగార్డింగ్ మై మ్యారేజ్... నేను తొందర పడను" అంది నయనిక తాపీగా.

నిట్టూర్పు విడిచింది అనన్య.

గట్టిదే! ధీర వనితే! తొందరపడి ఏ నిర్ణయం తీసుకోదు...

...అతను వంచనాశిల్పంలో ఆరితేరిన వాడని త్వరలోనే తెలుసుకుంటుంది.. ప్రత్యేకంగా తను అతని గూర్చి ఆమెకు చెప్పాల్సిన అవసరం లేదు...

★ ★ ★

అనన్య స్నానం చేసి గదిలో డ్రస్సింగ్ టేబుల్ ఎదురుగా కూర్చుంది, జుట్టు చిక్కు తీసుకుంటూ.

ఆమె పక్కన నయనిక లేకుండా వుండటం చూసి గదిలోకి వొచ్చాడు ఆకాష్.

"నా గురించి చెడుగా చెప్పావా?" అడిగేడు.

"మీరు చెడ్డవారా?"

"నా గురించి పాజిటివ్‌గా చెప్పు! మా ఇద్దరి మధ్య బావమరదళ్ళ వరుస వుంది.. మా అమ్మకి నయనికను కోడలిగా చేసుకోవాలని వుంది. అమ్మ అడిగితే ఆమె కాదనదు. మా పెళ్ళి అయ్యేక ఆమె ఆస్తికంతటికీ నేనే అధిపతినవుతాను.. నిన్నో కంపెనీకి సీఈఓ చేస్తాను.."

నయనిక వొస్తే బాగుండుననుకుంది అతని మాటలు భరించలేక.

"నేను నిన్నేం మర్చిపోలేదు... కోర్టులో కేసుపోవడం నాకు పెద్ద షాక్... ఆ షాక్‌లో వుండి నీకు రెస్పాన్సు ఇవ్వలేకపోయాను... నిన్నెప్పటికీ మర్చిపోను...

నయనికను పెళ్ళి చేసుకున్నా నా మనస్సెప్పుడూ నీమీదే వుంటుంది... యు ఆర్ మై గాడెస్ ఆఫ్ లవ్" అంటూ ఆమె భుజం మీద చెయ్యివేసి దగ్గరకు తీసుకునే ప్రయత్నం చేయబోయాడు.

"ఇడియట్! గెటవుట్!" కోపంతో గట్టిగా అరిచింది అనన్య.

నయనిక వొస్తే అక్కడో సీన్ క్రియేట్ అవుతుందని భయపడి వెంటనే జారుకున్నాడు ఆకాష్.

★ ★ ★

"అమెరికా నుంచి వొచ్చేక షిర్డీ వెళ్దామనుకుంటున్నాను... పని ఒత్తిడిలో వీలుపడలేదు. నువ్వొచ్చావ్... ఇద్దరం మా కార్లో షిర్డీ, ఎల్లోరా చూసి వొద్దాం!" అంది నయనిక అనన్యతో.

ఆడీ కారులో బయల్దేరేరు.. అంత ఖరీదైన కారులో ప్రయాణం చెయ్యటం అనన్యకు అదే మొదటిసారి.

షిర్డీ చేరుకునేసరికి రాత్రి ఎనిమిదయింది. హోటల్లో దిగారు.

ఉదయాన్నే లేచి సాయిబాబా దర్శనం చేసుకోవడానికి టెంపుల్ కు వెళ్ళారిద్దరు.

క్యూలో తనముందు నిలబడ్డ వ్యక్తి పరిచయం వున్నట్లుగా అన్పించింది.

పట్టుపంచె, సిల్క్‌లాల్చీ వేసుకున్నాడతను. ఆరడుగులున్నాడు. అతని మొహం కన్పిస్తుందేమోనని అతని వైపే చూస్తూ వుండిపోయింది. సాయి స్మరణ చేస్తూ వొక్కసారి వెనక్కు తిరిగి చూశాడతను.

"రుత్విక్ గారూ! మిమ్మల్ని ఇక్కడ కలవడం ఆశ్చర్యంగా వుంది" అంది నయనిక.

"సాయి నాథుడే మిమ్మల్ని మళ్ళీ చూసే అవకాశం కల్పించాడు" అన్నాడతను క్యూలో కొంచెం ముందుకు కదులుతూ.

సాయి దర్శనం అయ్యేక ఆవరణలోనే వున్న ఓ మండపం దగ్గర కూర్చున్నారు. గరికపర్రు నుంచి ఒక పదిమంది టూరిస్టు బస్సులో వొచ్చేరట!

## చింతపండు రసం

గాంధీజీ ఎప్పుడూ నిమ్మకాయ రసాన్ని వాడేవారు. నిమ్మకాయలు బాగా లభించని రోజుల్లో చింతపండు వాడతానని గాంధీజీ అన్నారు. అక్కడే ఉన్న పటేల్ కు ఇది బాగనిపించలేదు. 'చింతపండు శరీరానికి మంచిది కాదు' అన్నారు.



'ఏం..ఎందుకు?' అన్నారు గాంధీజీ.

'ఎముకలు కుళ్లిపోతాయి' అన్నాడు పటేల్.

'మరి జమునాలాల్ వాడతారు కదా?' అన్నారు గాంధీజీ.

జమునాలాల్ అతి లావుగా ఉండేవాడు. అతడూ ఆ సమయంలో అక్కడే ఉన్నాడు.

సర్దార్జీ వెంటనే ఇలా అన్నారు 'ఆ రసం ఎముకలవరకు అతనికి పోతేకదా?'

దాంతో అక్కడ నవ్వులు విరిసాయి.

"గరికపర్రులో మా పొలాలు వున్నాయి... వీరే ఆ పొలం పనులు చూస్తూ వుంటారు.. పేరు రుత్విక్... ఈమె నా స్నేహితురాలు అనన్య... విశాఖపట్నంలో వుంటుంది... నన్ను చూడాలనిపించి వొచ్చింది" అనన్యను రుత్విక్‌కు పరిచయం చేసింది.

"యాత్రలో కలుసుకున్నాం. జీవితం కూడా ఓ యాత్రేనండి.. తల్లిగర్భం నుంచి మొదలయ్యి చివరికి ప్రకృతిలో మట్టిరూపంలోనో, బూడిదగానో కలిసిపోతుంది... కొద్ది జీవితంలోనే ఎన్నో అనుబంధాలు ఏర్పడతాయి.. చివరకు అన్నిబంధాలు



తెంచుకుని యాత్ర ముగిస్తాం" అన్నాడు రుత్విక్.

"మీరు మాతో కార్లో వొచ్చెయ్యండి... ఎల్లోరా గుహలు, దౌలతాబాద్ ఫోర్టు చూసి హైద్రాబాద్ చేరుకుందాం... మీ తాత్విక తను మాతో పంచుకోండి. హైద్రాబాద్ చేరుకున్నాక కార్లో మళ్ళీ మిమ్మల్ని మీ ఊర్లో దింపే బాధ్యత మాది. మీ ఊరి వాళ్ళకు చెప్పేసి వొచ్చేయ్యండి! మాకు మీతోడు వుంటే బాగా కాలక్షేపం అవుతుంది" అంది నయనిక.

కాదనలేకపోయాడు. స్నేహితులకు చెప్పేసి వొచ్చేడు.

ఎల్లోరా గుహల్లోని శిల్ప వైభవం చూసి ఆశ్చర్యపోయారు.

కరెంటు, సాంకేతిక పరిజ్ఞానం లేని కాలంలో వెయ్యి సంవత్సరాలకు పూర్వం పెద్దపెద్ద విగ్రహాలు చెక్కారంటే మామూలు విషయం కాదు.

గైడ్ వెనుకే అన్ని గుహలు తిరిగేరు.

"ఎల్లోరా గుహలు మొత్తం 34. కొన్ని బౌద్ధ, కొన్ని బ్రాహ్మణ, మరికొన్ని జైన గుహలు... బౌద్ధ గుహల్లో చైత్య మందిరాలు, విహారాలు మనల్ని మంత్రముగ్ధుల్ని చేస్తాయి. చైత్యాలు ప్రార్థనామందిరాలుగా, విహారాలను నివాస స్థలాలుగా బౌద్ధ బిక్షువులు ఉపయోగించుకునేవారు. ఎల్లోరా గుహల్లో అత్యంత అద్భుతమైనది కైలాస నాథ మందిరం... వంద అడుగుల ఎత్తు వుంది. గుహల్లో కొన్నిటిలో రెండు, మూడు అంతస్తుల మందిరాలున్నాయి" గైడ్ చెప్పుకుపోయాడు.

అందరూ ముందుకు వెళ్ళిపోతే నయనిక, రుత్విక్ కొంచెం వెనుకబడ్డారు.

గుహలో మొదటి అంతస్తు నుండి రెండో అంతస్తు మెట్లు ఎక్కబోతూ నయ



నిక కాలుజారి తూలి పడబోయింది. ఆమె వెనుకే నడుస్తున్న రుత్విక్ ఆమెను పొదివి పట్టుకున్నాడు.

"మీ నడకలో ఓ సొగసు వుంది... లయబద్ధంగా నడుస్తారు. మీ నడక చూసి ముచ్చటపడి మీ వెనుక నడుస్తుంటే మీరు నా మీద పడ్డారు" అన్నాడతను నవ్వుతూ.

వెచ్చగా ఆమె ఊపిరి అతని మొహానికి తగిలింది.

"జాగ్రత్తగా నడవండి" అన్నాడతను నడుం చుట్టూ చేతులు బిగిస్తూ.

ఉలిక్కిపడి అతని చేతులను తొలగించుకుంది.

ముత్యాలు విరజిమ్మినట్లు మురిపెంగా నవ్విందామె.

అపురూప శిల్పసంపదను గుండెల్లో పదిలపరచుకుని గుహల్లో నుంచి బయటకు వొచ్చారు.

అనన్య వాళ్ళకోసం ఎదురు చూస్తూ నిలబడింది.

"వేల సంవత్సరాల చరిత్ర కలిగినది మన భారతదేశం... ఈజిప్టు, గ్రీసు, మెసపుటోమియా, రోమన్ నాగరికతలు మరుగునపడ్డా మన నాగరికత, సంస్కృతి చెక్కు చెదరకుండానే వున్నాయి" అన్నాడు రుత్విక్.

తిరిగి వస్తూ దారిలో దౌలతాబాద్ కోట చూశారు.

శత్రు దుర్భేద్యమైన కోట అది. ఆరు వందల అడుగుల ఎత్తులో కొండంతా విస్తరించి వుంది. కోట చుట్టూ కందకం. ఎత్తైన ప్రహరీ గోడలు. ఒకప్పటి దేవగిరి కోట అది... దేవగిరి కోటను చూసి ముచ్చటపడి మహమ్మద్ బిన్ తుగ్లక్ రాజధానిని ఢిల్లీ నుంచి దేవగిరికి మార్చాడు.

వారు దౌలతాబాద్ కోట చూసేక హైద్రాబాద్ తిరిగి వచ్చేశారు.

★ ★ ★

"మా పవర్ ప్లాంటు ఛత్తీస్‌ఘడ్‌లో వుంది... ఆ ప్లాంటుకు సంబంధించిన ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు హైద్రాబాద్‌లో వుంది. ఆ ఆఫీసును ఇంతవరకు నేనెప్పుడూ చూడ్లేదు. వెళ్ళి చూసొద్దాం పద" అంది నయనిక స్నేహితురాలితో.

కార్లో ఇద్దరూ లిబర్టీ దగ్గరవున్న స్టాంజా బిల్డింగ్ దగ్గరకు వెళ్ళారు.

ఆ బిల్డింగ్‌లో మూడు ఫ్లోర్లలో పవర్ ప్లాంటుకు సంబంధించిన ఆఫీసు వుంది. ఒక్కో అధికారికి, అతని కింద పన్జేసే స్టాఫ్‌కు ఓ ఫ్లోర్... ఇంత హంగామా అవసరమా?

'...చిన్న పవర్ ప్లాంటుకు అంత పెద్ద ఆఫీసు అవసరమా? పవర్‌ప్లాంటుకు దగ్గర ఓ చిన్న ఆఫీసు వుంది- మూడు ఫ్లోర్స్‌కు ఎంత అద్దె కడుతున్నారో... ఓవర్‌హెడ్స్ మాసివ్‌గా వున్నాయి.. ఖర్చు తగ్గించాలి!' అనుకుంది నయనిక మనస్సులో.

రిసెప్షన్ కౌంటర్ దగ్గరకు వెళ్ళింది నయనిక అనన్యతో కలసి.

కౌంటర్‌లో జీన్స్ వేసుకున్న అమ్మాయి చిరునవ్వు నవ్వి "హాయ్... కెన్ ఐ హెల్ప్ యూ? " అడిగింది.

"యా... ఐయామ్ నయనిక" అంది తనపేరు వినగానే తనెవరో ఆ అమ్మాయికి తెలుస్తుందని.

"ఎవరిని కలవాలనుకుంటున్నారు మేడమ్? "

"ఇక్కడున్న అధికారులందరినీ కలవాలనుకుంటున్నాను" ఇంగ్లీషులో అంది.

"అపాయింట్‌మెంట్ వుందా మీకు... ముందు అపాయింట్‌మెంట్ ఫోన్లో తీసుకుని రావాలి! ఆఫీసర్లు మీటింగులతో హడావుడిగా వుంటారు... మీతో ముచ్చటించడానికి టైం వుండదు" అంది రిసెప్షనిస్టు.

...తనెవరో గుర్తుపట్టలేదన్నమాట... కంపెనీ యజమానురాలు ఎవరో కూడా తెలుసుకోకుండా పన్జేస్తున్నారన్నమాట!

"ఈ కంపెనీకి నేనే యజమానురాలిని.. నాక్కూడా అపాయింట్‌మెంట్ కావాలా? " కొంచెం కోపంగా అడిగింది నయనిక.

...సిటీలో రకరకాల వాళ్ళు వుంటారు... తామె కంపెనీ యజమానురాలినని పోజులు పెడుతూవుంటారు... కంపెనీ ఓనర్ ఆకాష్‌గారిని తను ఎన్నిసార్లు చూడ్లేదూ! ఏదో మాయమాటలు చెప్పి లోపలికి వెళ్ళి ఏవన్నా తస్కరించాలనుకుంటున్నదేమో! ఇంతకు ముందెప్పుడు ఈమెను చూడలేదు...

సెక్యూరిటీ గార్డు కోసం అటూ ఇటూ చూసింది రిసెప్షనిస్టు.

ఆ అమ్మాయి తనకు సమాధానం చెప్పకుండా అటూఇటూ చూడటం నచ్చలేదు నయనికకు... తనును ఇన్‌సల్ట్ చేస్తున్నట్లు భావించింది.

"జస్ట్ ఇన్‌ఫార్మ్ టు ద ఎకౌంటెంట్ అబౌట్ మై ఎరైవల్... నేను వొచ్చానని రామానుజాచార్యులగారితో చెప్పండి" అంది అధికార స్వరంతో.

రెండుమూడుసార్లు ఆకాష్‌తోపాటు వొచ్చాడాయన అకౌంట్స్‌బుక్స్, చెక్‌బుక్‌లు పట్టుకుని... సడెన్‌గా ఆయన పేరు గుర్తుకు వొచ్చి చెప్పిందామె.

"ఒక్క నిమిషం మేడమ్..." అంటూ రిసీవర్ అందుకుని డయల్ చేసింది. నయనికవైపు చూస్తూనే... రెండు నిమిషాలు మాట్లాడింది. అవతలివైపు నుంచి ఏం చెప్పారో కంగారుపడుతూ రిసెప్షన్ కౌంటరు నుంచి బయటకు వొచ్చింది.

"రండి మేడమ్... అకౌంటెంట్‌గారి దగ్గ

రకు తీసుకువెళ్తాను.. సారీ మేడమ్ ఏమనుకోకండి.. మిమ్మల్ని ఇంతకు ముందు చూడ్లేదు... మీరెవరో తెలీక నిలబెట్టి మాట్లాడేను" తత్తరపడుతూ అంది రిసెప్షనిస్టు.

రామానుజాచార్యులి రూము చూపించింది.

రెండు నిముషాల్లో కూల్‌డ్రింక్స్ లోపలికి పంపించింది.

నయనిక, అనన్యలకు సీటు చూపించి రామానుజాచార్యులు నిలబడే వున్నారు.

"ముందు మీరు కూర్చుని మాట్లాడండి... మీరు పెద్దవారు... నిలబడి మాట్లాడితే నా మనస్సు నొచ్చుకుంటుంది" అంది నయనిక.

ఆయన కూర్చుంటూ "మీరు ఇక్కడకు రావడం ఆశ్చర్యాన్ని కల్గిస్తోంది... కాల్ చేస్తే నేనే పరుగెత్తుకుంటూ వొచ్చేవాడిని మేడమ్" అన్నాడు.

"కంపెనీ ఎకౌంట్స్ చూసేటప్పుడు మీ పేరు కన్పిస్తుంది... మీ పేరొక్కటే ఫెమిలియర్.. మిగతావాళ్ళ గూర్చి తెలియదు."

"కంపెనీలో నేను చిన్న అధికారిని.. పర్సనల్ ఆఫీసర్, సి.ఇ.వో. వున్నారు పిలవమంటారా?" అన్నాడతను.

"అవసరం లేదులెండి..." అందామె.

"ఇక్కడ అందరూ ఆకాష్‌గారే యజమాని అని అనుకుంటూవున్నారు... ఐదు మినిషాల్లో స్టాఫ్ మీటింగ్ ఏర్పాటు చెయ్యమని పర్సనల్ మేనేజర్‌గార్కి చెబుతాను అందరినీ అడ్రెస్ చేస్తూ వొక్కసారి మాట్లాడండి"

ఆ సలహా నచ్చింది నయనికకు.

"ఓ పది నిముషాలు మీతో మాట్లాడేక వాళ్ళందరినీ పిలిచి మీటింగు ఏర్పాటు చేద్దురుగాని... కంపెనీ ఆర్థిక పరిస్థితి ఎలావుంది?"

"లాభాల్లోనే నడుస్తోంది మేడమ్...

## పాదాలతో వచ్చావా?

పటేల్ ఆరవ తరగతిలో చదువుతున్నప్పుడు బరోడాలోని ఆ స్కూలులో చోటాలాల్ అనే గుజరాతీ టీచర్ ఉండేవాడు. ఆయనకు సంస్కృతం అంటే వల్లమాలిన అభిమానం! ఎవరైనా సంస్కృతం క్లాసు వద్దని గుజరాతీకి



మారితే ఆ విద్యార్థుల్ని వ్యంగ్యంగా ఆటలు పట్టించేవాడట. తన అలవాటు ప్రకారం ఆ టీచర్ పటేల్‌ని కూడా ఓసారి 'ఏమోయ్! సంస్కృతం రానిదే గుజరాతీ కూడా రాదని తెలియదా? మరి నువ్వు సంస్కృతం నుండి గుజరాతీ క్లాసుకు ఎందుకు మారావు?' అన్నాడట.

వెంటనే పటేల్ 'మేమంతా సంస్కృతం తీసుకుంటే మీ గుజరాతీ క్లాసులో ఎవరూ మిగలం. మీ ఉద్యోగం ఊడే ప్రమాదం ఉంది కదండీ! అందుకని' అన్నాడట.

ఆ దెబ్బతో దిమ్మతిరిగిన పంతులుగారు మండిపడి పటేల్‌ను బెంచీ ఎక్కించడమే కాకుండా 'రేపు పదివరకు పాదాలు (ఎక్కాలు) రాసుకుని రావాలి' అన్నాడు.

పటేల్ ఆ శిక్షను లెక్కచేయలేదు.

దాంతో మర్నాడు 'నీ రోగం కుదరాలంటే రెండువందల వరకూ పాదాలు రాసుకుని రా' అంటూ శిక్ష పెంచాడట.

ఆ తర్వాతిరోజు పటేల్ స్కూలుకు రాగానే 'ఏరా! పాదాలు ఏవి?' అంటూ గద్దించాడు పంతులు.

గుజరాతీలో పాదా అంటే ఎక్కాలు అనీ, దున్నపిల్ల అనీ రెండర్థాలున్నాయి. అందుకని, పటేల్ 'నేను ఇందాక రెండు వందల పాదాల్ని మన స్కూలు తలుపు వరకు తోలుకొచ్చానండి. అవి మీ పాఠం విని కాబోలు పారిపోయాయి' అన్నాడట.

దాంతో అందరూ నవ్వుకున్నారు.

# చతుర ప్రవేశిక

## మార్చి చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. అనన్యకు బహుమతి పంపిన ఎండీ?
జ.
2. నయనిక తాత ఎవరు?
జ.
3. ఆకాష్ తల్లి పేరు?
జ.
4. అనన్య తండ్రి ఎవరు?
జ.
5. అనన్యకు చాటింగ్ స్నేహితురాలు?
జ.
6. రవళిని హత్య చేసింది?
జ.
7. నయనిక ఎవరిని పెళ్లి చేసుకుంది?
జ.
8. వసంత చెల్లెలు ఎవరు?
జ.
9. శ్రీలాల్ శుక్లాకు జ్ఞానపీఠం వచ్చిన ఏడాది?
జ.
10. 'మంచి మనీషి'లో పాల్గొన్న రచయిత?
జ.

---

పంపినవారి పేరు: ----------------

------------------వయసు (   )

చిరునామా: ------------------

--------------------------

--------------------------

పిన్‌కోడ్:                ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

---

మనకు వొస్తున్న లాభాలు ఎకౌంట్స్‌లో రిఫ్లెక్ట్ కావడం లేదు..” అన్నాడతను నసుగుతూ.

“ఎందుకని? ”

“ఇన్‌కమ్‌టాక్స్ ఎక్కువ కట్టాల్సి వొస్తున్నది... అలా లాభాలను దాచి పెట్టాల్సిన అవసరం లేదని... నిజాయితీగా ఎకౌంట్స్ మెయిన్‌టైన్ చేయబోయి ఆకాష్ గారిచేత చివాట్లు తిన్నాను... కానీ అవకతవకల్ని ఇన్‌కంటాక్స్‌వాళ్ళు పసిగడితే మన కంపెనీ అప్రదిష్ట మూటగట్టుకోవాల్సి వస్తుంది”

ఆయన మాటలకు అడ్డొచ్చి “లేదు.. లేదు.. మీరు కరెక్టుగా అకౌంట్స్ రాయండి... తేడాలు వుండకూడదు” అంది నయనిక.

“అయినా నాకెందుకులెండి... రెండు నెలల్లో బయటకు వెళ్ళేవాడిని”

“అదేమిటి? మీకు ఇంకా సర్వీసు వుంది కదా? ”

“ఇంకా ఐదేళ్ళ సర్వీసు వుంది మేడమ్... తీసెయ్యబోతున్నట్లు నోటీసు ఇచ్చారు... నా పద్ధతులు ఆకాష్‌గార్కి నచ్చడంలేదు.”

“మీకు టెర్మినేషన్ నోటీసు ఎవరిచ్చారు? నాకా విషయం తెలియదే? ”

“ఆకాష్‌గారు ఇచ్చారు మేడమ్”

“ఆయనెవరు ఇవ్వడానికి.. ఆయనకేం అధికారం వుంది? ” గొంతు పెంచి అడిగింది.

“పవర్ ఆఫ్ అటార్నీ ఆయనకు ఇచ్చినట్లు చెప్పారు మేడమ్... మీకు కాబోయే భర్తగారని ప్రచారం చేసుకుంటున్నారు ఆఫీసులో” అన్నాడు రామానుజాచార్యులు.

వొళ్ళు మండిపోయింది నయనికకు.

“నేను ఎటువంటి పవర్ ఆఫ్ అటార్నీ ఎవరికీ ఇవ్వలేదు... నా పవర్స్ ఎవరికీ డెలిగేట్ చెయ్యలేదు” అంది స్పష్టంగా.

ఆయన అకౌంట్స్ విషయాలు కూడ

చెప్పారామెకు.

పబ్లిక్ రిలేషన్స్ పద్దుకింద ఖర్చు పెరిగిపోతూవుంది. అధికారుల వేతనాలు విపరీతంగా పెరిగిపోతున్నాయి. కింది ఉద్యోగుల జీతాలు పెరగడంలేదు, కంపెనీకి లాభాలు వొస్తున్నా.

అన్ని విషయాలు వివరంగా చెప్పాడాయన.

నయనిక వొచ్చినట్లు తెలిసి అధికార్లు అందరూ పరుగెత్తుకుని వొచ్చారు అకౌంటెంట్ రూముకు. తమ దగ్గరకు ఆమెను తీసుకురాకుండా రామానుజాచార్యుల దగ్గరకు రిసెప్షనిస్టు తీసుకు వెళ్ళిందని ఆమె మీద మండిపడ్డారు.

మీటింగ్ హాలులో అందరూ సమావేశమయ్యారు.

చక్కటి ఇంగ్లీషులో అందరినీ ఆకట్టుకుంటూ మాట్లాడింది నయనిక. ఆమె వాగ్ధాటిని మెచ్చుకుంది అనన్య.

అందరూ చప్పట్లు కొట్టారు మీటింగ్ అయ్యేక.

రామానుజాచార్యులికి ఇచ్చిన ఊస్టింగ్ ఆర్డర్ కాన్సిల్ చేసింది నయనిక. ఆయనకు ప్రమోషన్ ఇస్తూ ఉత్తర్వులు జారీ చేసింది నెలరోజుల తరువాత.

★ ★ ★

అనన్య తిరుగు ప్రయాణానికి సిద్ధమైంది.

ఆమె బ్యాగ్ సర్దుకుంటుంటే నయనిక కళ్ళు చెమర్చాయి.

స్నేహితురాలు మూడీగా వుండటం గమనించింది అనన్య.

"అప్పుడప్పుడు వొచ్చి వెళ్తుంటానులే! సృష్టిలో తియ్యనిది స్నేహమని నీ దగ్గరే నేర్చుకున్నాను.. ఎన్ని అవాంతరాలు వొచ్చినా జీవితం చివరిదశ వరకూ మన స్నేహం కొనసాగాలి! భగవంతుడు ప్రసాదించిన వరం నీతో స్నేహం ఏర్పడటం! రియల్లీ అయామ్ వెరీ లక్కీ!" అంది అనన్య స్నేహితురాలి భుజం మీద వాలిపోయి.

"ఎందుకో నువ్వు తిరిగి విశాఖపట్నం వెళ్లిపోతుంటే దుఃఖం పొర్లుకు వస్తోంది... కిందటి జన్మలో మనిద్దరం అక్కాచెల్లెళ్లు అయి ఉంటాం!"

నయనిక మాటలకు నవ్వుకుంది.

"నీకు పెళ్లయ్యేవరకు నన్ను తలచుకుంటావ్... పెళ్ళయ్యాక మీ శ్రీవారిని చుట్టుకుపోయి నన్ను మర్చిపోతావేమో!"

"అదేం జరగదుగానీ.. పద, ట్రైన్ టైమవుతోంది" అంది నయనిక.

కార్లో సికింద్రాబాద్ స్టేషనుకు చేరుకున్నారు.

"నీ మనస్సుకు నచ్చిన వ్యక్తిని పెళ్లి చేసుకోగానీ ఆకాష్‌ను మాత్రం పెళ్ళి చేసుకోకు! అతను నీకు సరిజోడు కాదు... నీకు తగడు" అంది అనన్య ట్రైన్ ఎక్కబోతూ.

గోదావరి ఎక్స్‌ప్రెస్ ముందుకు కదిలింది.

★ ★ ★

ఆకాష్‌కు పిచ్చెక్కినట్లుగా ఉంది.

ఏదీ తననుకున్నట్లు జరగడంలేదు.

అమెరికా నుంచి వచ్చినప్పుడు అమాయకురాలిగా కన్పిస్తే తన రొట్టె విరిగి నేతిలో పడిందనుకున్నాడు. పేరుకే ఆమె వసుధ గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్‌కు యజమానిగాని తానే అసలైన యజమానినని, ఆమెకు కంపెనీ వ్యవహారాలు అర్థం కావని, అన్ని విషయాలు తనకే వదిలేస్తుందని అనుకున్నాడు. కానీ ఆమె తన గుండెల్లో ఆటంబాంబుగా కూర్చుంది.

ఆమె ఇచ్చిన పేపరు ప్రకటన అతన్ని మరింత వెర్రివాడిని చేసింది. వసుధ గ్రూప్ ఆఫ్ కంపెనీస్ అన్నిటికీ తానే యజమానురాలినని, ఎవరికీ పవర్స్ డెలిగేట్ చెయ్యలేదని, ఎవరన్నా తమకు

పవర్ ఆఫ్ అటార్నీ ఇచ్చినట్లు లావాదే వీలు జరిపితే చట్టరీత్యా తగిన క్రిమినల్ చర్య చేపడతానని లాయర్ ద్వారా పేప ర్‌లో పబ్లిక్ నోటీసు ఇచ్చింది.

ఆ పబ్లిక్ నోటీసు తననుద్దేశించి ఇచ్చిన ట్లుగానే అర్థం అయ్యింది ఆకాష్‌కు.

కమలాంబ పక్కన సోఫాలో కూర్చు న్నాడు.

"పెళ్ళి విషయంలో ఓ నిర్ణయానికి వచ్చానమ్మా! నయనికకు మగదిక్కు లేదు... నేను ఆ అమ్మాయిని పెళ్లి చేసు కుంటాను. మనం తప్పితే ఆ అమ్మాయికి దగ్గరి బంధువులు ఎవరున్నారు? "

"నయనికకు మగదిక్కు అవసరం

## కొత్తగాలి...

**మంచుగడ్డది**
**బతుకు ఘనమైనా**
**నిత్యం కన్నీరే!**

– రఘుశ్రీ,
హైదరాబాద్

లేదురా! ఎంతోమంది మగాళ్ళకే పెద్దది క్కుగా ఉంటుంది. కంపెనీ వ్యవహారాలు సవ్యంగా నడుపుతున్నదని అందరూ అను కుంటున్నారు. బుచ్చినాయుడిగారి మనవ రాలనిపించుకుంది. తాతగారి వ్యాపారద క్షత మనవరాలికి వొచ్చింది" తన ధోర ణిలో చెప్పుకుపోయింది.

"అది కాదమ్మా! పెళ్ళి విషయం చెప్పి చూడు" అన్నాడు విసుగ్గా.

"పెళ్ళంటే నూరేళ్ళ పంట... తొందర పడి నిర్ణయాలు తీసుకోగూడదు... అమెరి కాలో పుట్టి పెరిగిన పిల్లకు ఫలానా అబ్బా యిని చేసుకొమ్మని చెప్పడం ఏం బాగుం టుంది? " అంది పుస్తకంలో తలదూర్చి.

"మొన్న మన పొలం వ్యవహారాలు చూసే రుత్విక్‌తో షిర్డీ వెళ్లి వచ్చింది కార్లో! షిర్డీ వెళుతున్నట్లు నాకు మాట మాత్రం చెప్పలేదు... పల్లెటూరు బైతుతో తిరిగితే మన వంశ ప్రతిష్టలు దెబ్బతినవూ!" అక్క సును వెళ్ళగక్కాడు.

"భగవంతుని సన్నిధిలో కలిసాడట... తోడు వుంటాడులే అని కార్లో వచ్చేటప్పుడు కలిసివచ్చారు. అందులో తప్పేముంది... ఆ అబ్బాయి వినయసంపన్నుడు, మంచి మనస్సున్నవాడు..."

"నీతో మాట్లాడటం నాదే బుద్ధి తక్కువ. నీకు అందరూ మంచి మన స్సున్న వాళ్లలాగే కనబడతారు" విసురుగా అక్కడనుంచి వచ్చేశాడు.

★ ★ ★

కమలాంబది మొదట్నుంచి మెతక స్వభావం.

ఎదుటివారిలో ఎన్ని తప్పులున్నా ఆ తప్పుల్ని ఎత్తిచూపే మనస్తత్వం కాదు. తామరాకు మీది నీటిబొట్టులా ఏదీ పట్టన ట్లుంటుంది.

జీవితంలో పెద్దగా సుఖపడిందీ లేదు.

తల్లిదండ్రులు ఎవరో తెలియదు. అనా థాశ్రమం నుంచి సంపన్నుల కుటుం బంలో పడింది. భోగభాగ్యాల మధ్య పెరి గినా వాటిమీద ఆసక్తి లేదు. పెంచిన తల్లి ఏది చెబితే అది పాటించేది. పెద్దలు ఏది చెప్పినా తన హితం కోరి చెబుతారని ఆమె గట్టి నమ్మకం.

పోలీసు ఆఫీసర్ కొడుకు రత్నాకరంతో ఆమె పెళ్ళయ్యింది. ఆ పోలీసు ఆఫీసరుకు కాస్తో కూస్తో ఆస్తి వుంది, అతను వియ్యం కుడైతే తనకు ఉపయోగపడతాడని కమ లాంబను ఆ ఇంటి కోడలుగా పంపారు ఆమెను పెంచినవారు.

రత్నాకరం ఒక్కడే కొడుకు.

అతనికో విచిత్రమైన అలవాటుంది.

అవసరం ఉన్నా లేకపోయినా ఇతరుల వస్తువులు వాళ్ళను ఏమార్చి ఇంటికి తీసుకువచ్చేవాడు. స్కూల్లో స్నేహితుల పుస్తకాలు, పెన్నులు తెచ్చుకుని ఇంట్లో దాచేవాడు.

పెట్టె నిండా పుస్తకాలు, పెన్నులు, పెన్సిల్స్ వాళ్ళమ్మ కంటబడ్డాయి.

"ఇవన్నీ నీవి కాదుగా... ఎందుకు తెచ్చావ్? వాళ్ళకు ఇచ్చేయి! ఇతరుల వస్తువులు తీసుకురాకూడదు!" అని తల్లి గట్టిగా మందలించితే అతనిలో మార్పు వచ్చేదేమో!

కన్నప్రేమ ఆమె కళ్ళు కప్పేసింది. కొడుకును మందలించలేదు.

తండ్రి కూడా కొడుకు దొంగిలించిన కళ్ళజోడు, పర్సు చూశాడు. పర్సు తీసి చూస్తే అందులో డబ్బులేవ్.

పెద్దగా నవ్వుతూ "ఈ కళ్ళజోడు ఎవరిదో పెద్దవాళ్ళది... ముసలోళ్ళ కళ్ళజోడు తెచ్చుకుని ఏం చేస్తావురా? " కొడుకును అడిగాడు.

"నేను ముసలాడినయ్యేక ఉపయోగపడుతుందిగా"

"డబ్బులేని పర్సు ఎక్కడో కొట్టేసావ్... చిన్న పిల్లాడివి నీకు పర్సు ఎందుకు? " అంటూ ఆ పర్సు ఆయన తన ప్యాంటు జేబులో పెట్టుకున్నాడు.

"మన అబ్బాయి పెద్దయ్యాక రాజకీయ నాయకుడో, పోలీసు ఆఫీసరో అవుతాడు" అన్నాడాయన భార్యతో.

కాలేజీకి వెళ్తున్నా ఆ బుద్ధులు పోలేదు.

పక్కింటి లాయరు భార్యతో ప్రేమసరాగాలు మొదలుపెట్టాడు. పడకగదిలో రత్నాకరం కౌగిలిలో ఒదిగిపోతూ మెళ్ళో మంగళసూత్రం ఉన్నప్పుడు అపవిత్రమైన పనులు చేయగూడదని మంగళసూత్రాన్ని దిండు గలీబులో పెట్టి అతన్ని గట్టిగా వాటేసుకుందామె.

ఆమె సోలిపోయి పడుకున్నప్పుడు ఆ మంగళసూత్రాన్ని నొక్కేశాడు. అతనే కాజేశాడని తెలిసినా పైకి చెప్పుకోలేక పగటి పూట దొంగ ఇంట్లోకి దూరి బెదిరించి మంగళసూత్రం లాక్కెళ్ళాడని మొగుడి దగ్గర బొంకింది.

పెళ్ళయ్యాక కూడా తన పద్ధతి మార్చుకోలేదు. భార్య నగలు కాజేసి అమ్ముకోవడం మొదలుపెట్టాడు.

"మీకేం ఖర్మ దొంగతనంగా నగలు తీసుకువెళ్ళడానికి... కోట్ల ఆస్తి ఉంది మనకు" అంది కమలాంబ భర్తతో.

నవ్వేసి "ఏదోకటి దొంగతనం చెయ్యకపోతే చేతులు దురద పెడతాయే" అన్నాడతను.

అన్ని వ్యసనాలు అలవడ్డాయి. తండ్రి ఇచ్చిన ఆస్తి, బుచ్చినాయుడు ఇచ్చిన ఆస్తి తగలెయ్యడం మొదలుపెట్టాడు. ఇంటిపట్టున ఉండేవాడు కాదు.

రైలు ప్రయాణం చేస్తూ తోటి ప్రయాణికుల బ్యాగుల్లోని వస్తువులు తీయబోతుంటే రెడ్‌హేండెడ్‌గా పట్టుకున్నారు. వాళ్ళను విదిలించుకుని కదులుతున్న రైల్లోనుంచి దూకేశాడు. తల సిమెంటు దిమ్మెకు కొట్టుకుని చనిపోయాడు.

కమలాంబ భర్త కథ అలా ముగిసింది.

తర్వాత ఇప్పుడు తన కొడుకు ఆకాష్ ప్రయోజకుడయ్యాడని సంతోషపడిందిగాని అతని పిడికెడు గుండెలో కొండంత ఆశ ఉండటం గమనించి హతాశురాలయింది. 'ఉన్నదానితో తృప్తిపడాలి!' అని నచ్చచెప్పబోయినా కొడుకు వినేవాడు కాదు.

...సముద్రంలో పుట్టిన చంద్రుడు 'ఇక్కడ చల్లగా బాగానేవుంది కదా!' అని సంతృప్తిపడడు. తుపాను బీభత్సం ఉంటుందని శివుడి తలమీద చేరతాడు... అక్కడ వాసుకి విషజ్వాలలకు భయపడి

అక్కడినుంచి స్వర్గం చేరుకుంటాడు... అక్కడ రాహువు నోట్లో పడతాడు...

'ఉన్నదానితో తృప్తిపడకపోతే జీవితం అలాగే ఉంటుంది' అనుకుంది కమలాంబ.




మధ్యాహ్నం రెండయ్యింది.

ఏం చెయ్యాలో తోచడం లేదు ఆకాష్‌కు. మనస్సంతా చికాగ్గా ఉంది... అన్నీ నిరుత్సాహాన్ని కలిగించే సంఘటనలు జరుగుతున్నాయి...

నయనిక అమెరికా నుంచి రాదు, వ్యాపార సామ్రాజ్యానికి తానే అధిపతినని కలలుగన్నాడు. ఆమె వచ్చేసింది. ఎంతో మంది అమ్మాయిలను ఆకర్షించిన తను ఆ అమ్మాయిని తన వల్లో వేసుకోవడం పెద్ద కష్టం కాదనుకున్నాడు. తనపట్ల ఆమె ఎటువంటి అనురక్తి చూపించకపోవడం అతన్ని హతాశుడ్ని చేసింది.

అమెరికాలో ఎవరినన్నా ప్రేమించిందా? ప్రేమించే లక్షణాలు ఆ అమ్మాయిలో కన్పించలేదు... చిన్న వయస్సులో వ్యాపారం గొడవలు ఎందుకు? ఆనందంగా పబ్‌లలో తిరక్క!

గ్రాండ్ కాకతీయలో రాకింగ్ వీక్‌ఎండ్ పార్టీ ఉంది.

చీకటి పడితేగాని పబ్‌లో సందడి మొదలవ్వదు... అప్పటిదాకా ఏం చెయ్యాలి? సినిమా హాల్లో కూర్చుంటే టైంపాస్ అవుతుంది.

ప్రసాద్ ఐమాక్స్‌వైపు కారు మళ్ళించాడు.

కారు పార్కింగ్ చేస్తుంటే పార్కింగ్ స్లాట్‌లో నిలబడ్డ అమ్మాయిపై దృష్టి పడింది.

ఆ అమ్మాయికి ఇరవై ఎనిమిదేళ్లుంటాయి. సల్వార్ కమీజ్‌లో స్టయిలిష్ అందాలతో విరబోస్తూ కనిపించింది.

ఆ అమ్మాయిని ఎక్కడో చూసినట్లు గుర్తుకు వచ్చింది. ఎక్కడా? ...

ఆ... గుర్తుకు వచ్చింది! పబ్‌లో ఆమె భర్తతోపాటు కనిపించింది ఓసారి... భర్త డాక్టర్.

ఆమె దగ్గరకు వెళ్ళి "మీపేరు రవళి కదూ! పబ్‌లో కలిసాం. మీవారు రాలేదా? " అడిగాడు.

"ఆయన కోసమే ఎదురుచూస్తున్నాను... టిక్కెట్స్ కూడ తీసుకున్నాను... చెప్పిన టైమ్‌కు ఎప్పుడూ రారు" అంది విసుక్కుంటూ.

"డాక్టరుగారు కదా! హాస్పిటల్లో బిజీగా ఉండి ఉంటారు" అన్నాడు ఆకాష్ ఆమె మొహంలో ఉన్న అసహనాన్ని గమనించి.

ఆమె సెల్‌ఫోన్‌కు కాల్ వచ్చింది. ఆమె మాట్లాడిన మాటలుబట్టి అతను రావడంలేదని అర్థం అయ్యింది ఆకాష్‌కు.

"ఆపరేషన్ థియేటర్‌లోకి వెళ్తున్నాడట... రావడానికి కుదరదట"

"పోన్లెండి! మీకు కంపెనీ నేను ఇస్తాను అభ్యంతరం లేకపోతే!" అన్నాడతను చొరవదీసుకుని.

మాన్లీగా వున్న అతనివైపు ఓసారి చూసి "నో అబ్జెక్షన్ ఎట్ ఆల్... విత్ ప్లెజర్... వెళ్దాం పదండి!" అందామె నవ్వుతూ.

ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

రెస్టారెంట్‌లో కాఫీ తాగి థియేటర్‌లోకి

వెళ్ళి కూర్చున్నారు.

ఆమె మనస్సులోని భావాలను చదివే శాడు ఐదు నిముషాల్లో.

సినిమా మొదలవ్వకముందు ఆమెను రెచ్చగొట్టే ప్రయత్నం చేశాడు.

"మగవాళ్ళింతేనండి! ఆడదాని మనస్సు తెలుసుకోరు. డబ్బు సంపాదనే ముఖ్యమనుకుంటారుగాని పెళ్ళి చేసుకున్న అమ్మాయిని సుఖపెట్టాలని ఉండదు... మీకంటే పదేళ్లు పెద్దవాడిలా కన్పించాడే!" అన్నాడు ఆకాష్.

"పదేళ్లు కాదండీ... పదిహేనేళ్ళ తేడా వుంది... సరదాలేదూ పాడూ లేదు... ఎప్పుడూ హాస్పిటల్‌కు అతుక్కుని వుంటారు" అందామె.

తన దారిలోకి వస్తున్నందుకు సంబరపడ్డాడు.

"మీరు నవ్వుతుంటే మొహంలో వెన్నెల వాన కురుస్తున్నట్లుంటుంది. మెరుపుతీగలా మీరు కనిపిస్తారు. మీవారేమో సుమోయోధుడిలా కన్పిస్తాడు... రాత్రిళ్ళు ఎలా గడుస్తున్నాయండీ? "

తన భర్తను 'సుమో' అంటే కోపం రాలేదామెకు. కిసుక్కున నవ్వింది.

"ఆయనేమో హాయిగా నిద్రపోతారు. రాత్రిళ్ళు నాకు నిద్రపట్టదు!"

సినిమా మొదలయ్యింది.

ఇంగ్లీషు సినిమా. ముద్దుల సీన్లు ఎక్కువగానే ఉన్నాయి. సినిమా కథలో లీనమైపోయింది. ఎవరూ ఊహించని సమయంలో మర్డర్ జరుగుతుంది. ఆ సన్నివేశం రాగానే భయపడిపోయి ఆకాష్‌వైపు ఒదిగిపోయింది రవళి.

ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుని నిమిరాడు.

ఇంటర్వెల్‌లో బయటకు వచ్చి కూల్ డ్రింక్స్ తీసుకున్నారు.

సెకండ్ హాఫ్‌లో కూడా రొమాంటిక్ సన్నివేశాలు వచ్చాయి. అతని వైపు చూడకుండా ఏకాగ్రతతో ఆ సీన్స్ చూస్తూ ఉండిపోయింది.

తన పనిలో తానున్నాడు ఆకాష్. ఆమె చెంపకు తన చెంపను ఆన్చాడు. చేతులు ఆమె వక్షోజాలను సుతారంగా తాకేయి.

ఉద్రేకం ఆపుకోలేక అతని మొహాన్ని దగ్గరకు లాక్కుని తియ్యటి ముద్దు ఇచ్చిందామె.

ఆమెను తీసుకుని మధ్యలోనే బయటకు వచ్చేద్దామనుకున్నాడు. సినిమా పూర్తయ్యే వరకూ అతన్ని కదలనివ్వలేదు.

బయటకు వచ్చేక "దగ్గర్లో మా ఇల్లు ఉంది. ఇంట్లో నేను, సర్వెంట్స్ తప్పితే ఎవరూ ఉండరు" అన్నాడతను.

అతని ఉద్దేశ్యం ఏమిటో అర్థం అయ్యిందామెకు.

అభ్యంతరం చెప్పలేదు.

మాదకద్రవ్యాలు కూడా రవళి ఆకాష్‌కు అలవాటు చేసింది. ఆ మత్తులో పడిపోయాడు.




అదృష్టం బాగుండి అనురాగ్ పూర్తిగా కోలుకున్నాడు, మానసికంగా, శారీరకంగా.

హైదరాబాద్ నుంచి అనన్య వచ్చేక ఆమెతో కలిసి మహర్షి ఆశ్రమానికి వెళ్ళాడు. ఆయన దగ్గర కొన్ని గంటలు గడిపితే మరింత ప్రశాంతంగా ఉంటుంది

మనస్సుకు.

"చుట్టూ ఉన్న అద్భుతమైన ప్రపంచాన్ని తన్మయత్వంతో చూడటం చేతగాక చీకట్లో మగ్గిపోయి ఆత్మహత్య ప్రయత్నం చేశాక... ఇప్పుడు చీకట్లోనుంచి వెలుగులోకి వచ్చావు. ఇది నిజంగా నీకు పునర్జన్మ. అందమైన జీవితాన్ని మరోసారి అందుకునేటట్లు భగవంతుడు చేశాడు. ఏదోక సత్కార్యం చేసి భగవంతుడు నీకు ఇచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకో!" అన్నాడు మహర్షి.

"మీ ఆశ్రమం పేరు మీద ఓ యాభై లక్షలు డిపాజిట్ చేస్తాను. ఏదన్నా సత్కార్యం తలపెట్టండి!" అన్నాడు అనురాగ్.

నవ్వాడు మహర్షి.

"నేను సామాన్యుడిని, ఆర్థిక వ్యవహారాలు తెలియవు.. సంపన్న కుటుంబంలో పుట్టాను... అన్నీ వదులుకొని సత్యాన్వేషణ చేస్తూ బతుకుతున్నాను. ఆ బరువు బాధ్యతలు వద్దు! మీరిద్దరూ బాగా చదువుకున్నవాళ్ళు, తెలివితేటలు ఉన్నాయి. వాటిని ఉపయోగించి ఏదో ఒక సత్కార్యం మొదలుపెట్టండి!" అన్నాడాయన.

"కాలేజి పెట్టి విద్యాదానం చెయ్యమంటారా? " అనేశాడు అనురాగ్.

ఆలోచనలో పడిపోయాడు మహర్షి.

"భగవంతుడే నీచేత ఆ మాటలు పలికించాడేమో! కాలేజీ అంటే ఉదయం ఎనిమిది గంటల నుండి రాత్రి పదింటిదాకా విద్యార్థులను బాగా చదివించి ర్యాంకుల కోసం పోటీపడే కాలేజీ కాదు... చదువుతో పాటు మానవతావాదం నేర్పే కాలేజీ 'మానవుడే మహనీయుడ'నే విషయం విద్యార్థులకు బోధించే కాలేజి... విద్యతో పాటు సామాజిక బాధ్యతలను నేర్పే కాలేజీ మీరు స్థాపించాలి... మీరు పెట్టబోయే కాలేజీ విలక్షణంగా, ఆదర్శవంతంగా ఉండాలి" అన్నాడాయన.

ఆయన చెప్పేది మౌనంగా వింటూ ఉండిపోయారు.

మామూలుగా కాలేజీలు డబ్బు సంపాదనా మార్గాలుగా వెలుస్తూ ఉంటాయి. చిన్నగదిలో ఓ యాభై మందినో, అరవై మందినో తోసేసి తోమేస్తూ ఉంటారు. పుట్టినప్పటి నుండి మానవుడి ఎదుట రెండు మార్గాలు కనిపిస్తాయి. తన స్వార్థం కోసం నడిచే దారి, మరోదారి పరోపకారం కోసం నడిచేది. రెండో దారిలో నడవడానికి ఎవరూ ఇష్టపడరు... కాలేజీ యాజమాన్యం విద్యార్థుల సంఖ్య పెరగాలని చూస్తూ ఉంటుంది. విద్యార్థి తాను డాక్టరో, ఇంజినీరో కావాలనుకుంటాడు.

"ఈ ధోరణికి విభిన్నంగా ఉండే కాలేజీ మీరు పెట్టాలి"

మహర్షిగారు చెబుతున్న విషయాలు ఆసక్తిగా వింటూవుంది అనన్య.

"కాలేజీ ఎలా వుండాలో చెప్పండి ఆ విధంగా తీర్చిదిద్దటానికి ప్రయత్నిస్తాం!"

"విద్య నేర్చుకుంటూ పనులు నేర్చుకోవడం... బాధ్యతలు తెలుకోవడం! లెర్నింగ్ వైల్ వర్కింగ్... ఇదీ గైడింగ్ ప్రిన్సిపుల్... మీరు మరో విషయం గుర్తుంచుకోవాలి. ఈ కాలేజీ స్థాపనలో కోటిరూపాయలు పెట్టుబడి పెడితే మీకు తగిన లాభాలు రాకపోవచ్చు. మొదట్లో నష్టాలు వొచ్చినా భరించడానికి సిద్ధంగా వుండాలి! మర్రి చెట్టుకు ఎన్నో కాయలు కాస్తాయి... వాటిలో కొన్నే పండుతాయి. వాటిలోని విత్తులు నేలమీద పడతాయి... కింద పడిన విత్తుల్లో కొన్నే మొలకలు ఎత్తుతాయి. ఆ మొలకల్లో ఏవొక్కటో, రెండో మహావృక్షాలుగా ఎదిగి నీడను ఇస్తాయి.. ఆ వటవృక్షం చూసి చిన్న విత్తనం ఇంత పెద్ద వృక్షంగా ఎలా ఎదిగిందా? అనుకుంటూ అందరూ ఆశ్చర్యపో

తారు. మీ కాలేజీ ఉన్నతంగా ఎదగడం చూసి భవిష్యత్తులో అందరూ ఆశ్చర్యపో వాలి!" అన్నారాయన.

కాలేజీ ఎలా వుండాలో వివరంగా చెప్పారు.

"మీ ఆశీస్సులు మాకువుంటే మీరు కోరు కున్న విధంగా కాలేజీని నిర్వహిస్తాం!" అన్నాడు అనురాగ్.

★ ★ ★

విద్యాశాఖ అనుమతి తీసుకుని 'మహర్షి కాలేజీ' స్థాపించారు పదిఎకరాల స్థలంలో. ఓ ఎకరంలో కాలేజీ బిల్డింగ్ ఏర్పడింది. మరో ఎకరం స్థలం ప్లేగ్రౌండ్‌గా వుంచారు. హాస్టల్ బిల్డింగ్ కూడా కట్టిం చారు.

విశాఖపట్నానికి యాభై కిలోమీటర్ల దూరం. పచ్చని పొలాల మధ్య వున్న మహర్షి కాలేజీలో ఇంటర్మీడియేట్ వరకే వుంది ప్రస్తుతానికి. రెండు మూడేళ్ళలో డిగ్రీ కూడా మొదలు పెట్టాలని అనుకు న్నారు. మామూలు కాలేజీలకు మహర్షి కాలేజికి ఓ తేడా ఉంది. విద్యార్థులంతా కాలేజీ ఆవరణలో ఉన్న హాస్టల్‌లోనే వుండాలి.

ఉదయాన్నే ఐదింటికి విద్యార్థులంతా నిద్ర లేచి కాలకృత్యాలు తీర్చుకుంటారు. స్నానాలు అయ్యేక బారులుగా నిలబడి ప్రార్థనా గీతాలు పాడుకుంటూ కాలేజీ ఆవ రణలో తిరుగుతారు. ప్రార్థనా గీతాలు, లలితగీతాలు నేర్పడానికి సంగీతం టీచరు ఉంది.

ప్రభాతవేళ ప్రార్థన చేస్తూ కాలేజీ ఆవ రణలో తిరుగుతూ వుంటే ఆహ్లాదంగా వుంటాయి అందరి మనస్సులు. ప్రార్థనా గీతాలతో ఆ ప్రాంతమంతా మార్మోగి పోతూ ఉంటుంది.

ఆ తరువాత ఓ అరగంట సేపు యోగా సనాలు వేయిస్తారు.

ఉదయంపూట ఫలహారం కార్యక్రమం అయ్యేక కొంతమంది కూరగాయల తోటల లోకి మరికొంత మంది పొలాల్లోకి వెళ్ళి వ్యవసాయ పనులు చేస్తారు.

చుట్టుపక్కల గ్రామాల్లో వ్యవసాయం పట్ల మక్కువ వున్న వ్యవసాయదారుల్ని పిలిపించి కాలేజీలో మీటింగ్ ఏర్పాటుచే సింది అనన్య.

"మా కాలేజీలో చదువులతోపాటు వ్యవ సాయం, కూరగాయల పెంపకం నేర్పిస్తాం.. మీరు మా విద్యార్థులకు సహ కరించి వ్యవసాయంలోని మెళకువలు నేర్పాలి... వ్యవసాయ పంటలు, కూరగా యల మీద వచ్చిన ఆదాయం విద్యార్థులకే చెందుతుంది. కాలేజీ ఫీజులు తల్లిదం డ్రులు కట్టే ఇబ్బంది వుండదు. కాలేజీ నుంచి చదువు పూర్తి అయ్యేక బయటకు వెళ్ళేటప్పుడు పెద్ద మొత్తంలో డబ్బు వాళ్ళకు ఇచ్చేస్తాం! ఎనిమిది ఎకరాల మీద వచ్చే ఫలసాయం వాళ్ళదే! ఆడపిల్లలకు పూలతోటల పెంపకం, ఎంబ్రాయిడరీ, కంప్యూటర్స్‌లో శిక్షణ ఇస్తాం! మీరంతా సహకరించాలి! అంటూ కాలేజీ ఎందుకు ఏర్పాటు చేసింది? లక్ష్యాల గూర్చి చెప్పుకు పోయింది.

గ్రామంలోని వ్యవసాయదారులు స్వచ్ఛందంగా వొచ్చి విద్యార్థులకు తోడ్పడ

### కొత్తగాలి...

**ఫలితం ఆశించని**
**చెట్టూచేమ**
**పశుపక్ష్యాదులు**
**భగవద్గీత భక్తులే!**

– మాదవరపు కృష్ణ,
కాకినాడ

టానికి ఒప్పుకున్నారు. పండిన పంటలు అమ్మగా వొచ్చిన డబ్బు విద్యార్థుల ఫండ్‌లో జమ చేస్తారు.

మధ్యాహ్నం భోజనాలయ్యేక ఒంటిగం టకు కాలేజీ మొదలవుతుంది. సాయంత్రం ఐదింటిదాకా కాలేజీలో ఇంటర్మీడియట్ తరగతుల బోధన ఉంటుంది. ఐదింటి నుంచి ఆరింటి దాకా ఆటపాటలు. రాత్రి పూట ఓ రెండు గంటలు చదువుకుం టారు.

అప్పుడప్పుడు రాత్రిపూట సాంస్కృతిక కార్యక్రమాలు వుంటాయి.

“ఈ తరహా కాలేజీలకు ఆదరణ తక్కు వగా ఉంటుంది. ఇంజనీరింగ్, మెడికల్ కోర్సులు తీసుకోవాలనుకున్నవాళ్ళు ఇం దులో చేరరు. కాలేజీ యాజమాన్యానికి ఆర్థిక భారం ఎక్కువగా ఉంటుంది. కూర గాయలు అమ్ముకునే కాలేజీ అవుతుంది గాని చదువుల కాలేజీ కాదు” అంటూ చాలమంది పెదవి విరిచారు.

అనన్య, అనురాగ్‌లను నిరుత్సాహపరి చారు.

ఫోన్లో కాలేజీ గూర్చిన అన్ని వివరాలు నయనికకు చెబుతూనే వుంది అనన్య.

“గో ఎహెడ్! ఆర్థిక సహాయం నేను చేస్తాను. వందలకోట్ల డబ్బు మా దగ్గర మూలుగుతోంది.. యన్.ఆర్.ఐ ఫండ్స్ మీ కాలేజీకీ అందే ఏర్పాట్లు కూడా చేస్తాను.. మీ ప్రయత్నం విజయవంతం కావాలి! వీలున్నప్పుడు నేనుకూడా వచ్చి మీ కాలేజీ చూస్తాను” అంటూ ప్రోత్సాహ పర్చింది నయనిక.

రుత్విక్ కూడ వొచ్చి కాలేజీని చూసి మెచ్చుకున్నాడు.

కాలేజీ పిల్లలందరిని సమావేశపరిచి రుత్విక్ చేత ఉపన్యాసమిప్పించింది.

“వ్యవసాయం అంటే చిన్న చూపు త గదు.. ఆర్థికమాంద్యంతో ప్రపంచంలోని అగ్రరాజ్యాలు కునారిల్లినా మన దేశం తట్టుకుందంటే కారణం వ్యవసాయ ప్రధాన దేశం కావడంవల్లే! చదువులయ్యేక వ్యవసాయం చేసినా, చెయ్యకపోయినా ప్రతి విద్యార్థి వ్యవసాయ పద్ధతులు నేర్చు కోవాలి. ఖరీఫ్, రబీ, ఏరువాక లాంటి పదాలకు అర్థం తెలిసి వుండాలి! ఏరువాక అంటే ఏమిటో తెలుసా? ” విద్యార్థులను అడిగాడు.

ఎవరూ చెప్పలేకపోయారు.

“ఏరు అంటే నాగలి కర్ర... మృగశిర కార్తె మొదటి రోజున ఎద్దుల్ని అలంక రించి మెడమీద భూమిని దున్నే నాగలిక ర్రను ఉంచి మూడు చాళ్ళను దున్నిస్తారు ఆ ముచ్చటే ‘ఏరువాక’... బతుకుతెరువుకు పాడిపంటలు అవసరం.. మీరు గేదెల పాలు తీయడం కూడ నేర్చుకోవాలి! అప్పుడే జీవితంలో నెగ్గుకు వస్తారు... దేనికీ భయపడకుండా ముందడుగు వెయ్యాలి!” అంటూ ఉపన్యాసం ముగిం చాడు.

★ ★ ★

శివరావు భోజనం చేసి ఇంటి ముందు ఆవరణలో వున్న పూల మొక్కల మధ్య ఈజీఛైర్‌లో కూర్చుని పున్నమి వెన్నెల్లో తడిసిపోతున్న మొక్కల్ని చూస్తూ ఉండి పోయాడు. వరండాలోని లైటుకూడా తీసే శాడు, వెన్నెలను ఆస్వాదించడానికి.

అందరూ ఇంట్లో కూర్చుని టీవీలకు అ తుక్కుపోతే ఆయనకు ఆరు బయట గంట లతరబడి కూర్చోవడం అలవాటు.

వెండి మబ్బులు అందాల జాబిలికి అప్పడప్పుడు పరదాలు వేసి పక్కకు తప్పుకుంటున్నాయి. చెట్లకొమ్మల్లో గూడు కట్టుకున్న పిట్టలు ఆదమరిచి నిద్రపోతూ ఎక్కడ ఏదో శబ్దానికి ఉలిక్కిపడి లేచి గొంతు సవరించుకుని కువకువలాడి మళ్లీ గూళ్ళలో ఒదిగిపోయి పడుకున్నాయి.





గండుపిల్లి చెట్టు ఎక్కే ప్రయత్నం చేసి పైకొమ్మల మీదకు వెళ్ళలేక నిరాశతో కిందకు దిగివొచ్చింది.

తను కూడా భోజనం చేసి తండ్రి పక్కన సిమెంటు గట్టు మీద కూర్చుంది అనన్య.

"ఎలా నడుస్తున్నదమ్మా మీ మహర్షి కాలేజీ? నువ్విప్పుడు ఆ కాలేజీకి కరస్పాం డెంటువటగదా? " అడిగాడు శివరావు.

"ఇదో కాన్సెప్ట్ కాలేజీ నాన్నా! లాభాపే క్ష లేకుండా విద్యార్థులకు పాడిపంటల మీద పూర్తి అవగాహన కల్గించడానికి ఏర్పాటు చేశాం. కాలేజీకి ఎటాచ్డ్‌గా హాస్టల్ ఉంది. స్టూడెంట్స్‌కు కావాల్సిన పాలు బయటి వ్యక్తుల దగ్గర పోయించు కుంటున్నాం! వాళ్ళేమో నీళ్ళపాలు పోస్తు న్నారు. అలా లాభం లేదనుకుని డైరీఫా రమ్ పెట్టాం.. ఒక్కోగేదెకు ముప్పయి వేలు పెట్టి పంజాబు గేదెలను తెచ్చాం! స్టూడెంట్స్ పశువుల సావిడి శుభ్రం చెయ్యడం, పాలు పితకడం కూడా నేర్చుకు న్నారు. మొన్న వొకాయిన వొచ్చి మాతో పోట్లాడేడు. వాళ్ళ అబ్బాయి చేత పేడ కళ్ళు తీయించడం ఆయనకు నామర్దాగా వుందట. 'రైతులు కష్టపడి పశువుల్ని మేపి, పాలు పితికి అమ్ముతుంటేనే గదా నువ్వు ఇంట్లో కూర్చుని హాయిగా పాలు, పెరుగు రుచి చూస్తున్నది. ఆ శ్రమ ఏమిటో మీ అబ్బాయికి అనుభవంలోకి రావాలిగా! మీకు ఇష్టం లేకపోతే మీ అబ్బాయి టి.సి. ఇచ్చేస్తాం! వేరే కాలేజీలో చేర్పించుకోండి' అనేశాను. ఆయన మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. ఈ కాలేజీ నిలదొక్కుకోవాలని మా ప్రయత్నాలు మేం చేస్తున్నాం! అనురాగ్ గారు, వాళ్ళమ్మ గారూ నాకు పూర్తి సహకారం అందిస్తు న్నారు... అలాంటి మంచి మనుషులతో పరిచయం కావడం నిజంగా అదృష్టం" అందామె.

"ఎప్పుడు మాట్లాడినా అనురాగ్ గురించి చెప్పకుండా ఉండవ్... అతనూ నువ్వు చాలా సన్నిహితంగా తిరుగుతూ ఉన్నారు. అంతకుముందు ఆకాష్‌తో కూడా సన్నిహితంగా తిరిగావ్. నిన్ను అతను అభిమానిస్తున్నాడని చెప్పేదానివి. ఇప్పుడతను కన్పించడం లేదు. అనురాగ్ మంచివాడని అంటున్నావ్. నీ ప్రయాణం ఎటు సాగుతుందోనమ్మా! నాకు అప్పుడ ప్పుడు ఆందోళన కల్గిస్తూ ఉంటుంది" అన్నాడు శివరావు మనస్సులోని ఆందోళ నను బయటకు వ్యక్తపరుస్తూ.

"చీకట్లో పాము, తాడు ఒకే రకంగా కన్పిస్తాయి. దగ్గరకు వెళ్ళి చూస్తేనే ఏది పామో, ఏది తాడో తెలుస్తుంది. దూరంగా ఉన్న కొండలు నునుపుగా, నీలం రంగులో కన్పిస్తాయి. దగ్గరకు వెళ్తే రాళ్ళూరప్పలు కన్పిస్తాయి. కొద్ది పరిచయంతో మనిషిని అంచనా వేయగూడదని ఇప్పుడు అర్థం అయ్యింది నాన్నా! ఆకాష్ ఉత్తముడని భావించి అతని వెంట తిరిగిన మాట వాస్తవమే! కానీ నా పరిధి దాటలేదు. ఇప్పుడతనికి ఐశ్వర్యం మీద వ్యామోహం తప్పితే వేరే విషయాలు తెలియవని తెలు సుకున్నాను. అతనికి దూరంగా జరిగాను. ఫోన్లో కూడా మాట్లాడే ప్రయత్నం చేయడం లేదు" చెప్పుకుపోయింది.

రాత్రిపూట తండ్రీకూతుళ్ళు మనస్సు విప్పి మాట్లాడుకోవటం అలవాటు. ఎటు వంటి అరమరికలు లేకుండా ఏదీ దాచుకో కుండా తండ్రికి అన్ని విషయాలు చెప్పే స్తుంది అనన్య.

"మీ కాలేజీలోనే కార్తీక్‌కు ఏదొక ఉద్యోగం చూడకపోయావా? హోటల్లో పని చేస్తూ ఎన్ని అవస్థలు పడుతు న్నాడో? " కొడుకు ప్రస్తావన తీసుకువ చ్చాడు శివరావు.

"తమ్ముడికి ఇప్పుడిప్పుడే వాడి బాధ్యతలు తెలుస్తున్నాయి. కష్టపడుతున్నాడు. వాడికి నచ్చిన దార్లో వాడిని నడవనివ్వండి!" అందామె.

వాళ్ళిద్దరి సంభాషణల్లో చెల్లెలి విషయం కూడ వచ్చింది.

"సుప్రజ బి.టెక్. పూర్తి చేసింది. క్యాంపస్ సెలెక్షన్ కూడా వచ్చింది. పక్కింటి శ్రీనివాస్‌క్కూడ సాఫ్ట్‌వేర్ ఇంజినీర్‌గా ఉద్యోగం వచ్చింది. ఇద్దరి జీతాలు కలిపితే యాభైవేలు దాటతాయి. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోవాలని అనుకుంటున్నారు. శ్రీనివాస్ తండ్రి కూడా ఆ విషయం గుర్చి నాతో మాట్లాడాడు తల్లీ! నువ్వేమంటావ్? ముహూర్తాలు పెట్టిద్దామా? " కూతుర్ని అడిగాడు.

"మీ ఇష్టం నాన్నగారూ!" అంది అనన్య.

పిల్లుల అరుపులు వినిపించాయి.

ఆడపిల్లి వెంటబడి మగపిల్లి తరుముతోంది. ఆ ఆడపిల్లికి ఓ చిన్న కూన ఉంది. ఆ పిల్లికూనను రక్షించుకోవడానికి, మగపిల్లిని దూరంగా తరమడానికి విశ్వప్రయత్నం చేస్తూ పెద్దగా అరుస్తూంది ఆడపిల్లి. మగపిల్లి దౌష్ట్యం కొనసాగుతూనే ఉంది.

"పొద్దుపోయింది... లోపలికి వెళ్ళి పడుకోమ్మా!" అన్నాడు శివరావు వరండాలో ఉన్న మంచం వాల్చుకుంటూ.

రోజూ వరండాలో పడుకోవడం అలవాటాయనకు.

★ ★ ★

'మహర్షి కాలేజీ' ఆఫీసులో కూర్చుని పేపర్స్ చూస్తూ కూర్చుని ఉంది అనన్య.

గేటు దగ్గర గూర్ఖా ఎవరినో గద్దిస్తున్నాడు.

అటువైపు చూసింది అనన్య.

చిరిగిన బట్టలతో రేగిన జుట్టుతో ఓ ముప్పయ్యేళ్ళ అమ్మాయి నిలబడి లోపలికి పోనిమ్మని ప్రాధేయపడుతూ ఉంది.

## ఫిబ్రవరి - 2013
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **యు.ఎం.ఎస్. శర్మ** - ట్రంక్‌రోడ్, ఒంగోలు
2. **అవధానం రేవతి** - జె.పి. నగర్, బెంగళూరు
3. **నల్లమోతు సుబ్బారావు** - సాయిబాబారోడ్, గుంటూరు
4. **చల్లపల్లి మాధురి** - రేవేంద్రపాడు, గుంటూరు జిల్లా
5. **వెంకటరమణ** - హౌసింగ్‌బోర్డు కాలనీ, హన్మకొండ

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. చక్రవర్తి | 6. శారద |
| 2. శాంతకుమారి | 7. ఆనంద్ |
| 3. జయంత్ | 8. 2009 |
| 4. కిరణ్ | 9. మార్కొని/ఎడిసన్ |
| 5. కూర్మావతారం | 10. చెక్ రిపబ్లిక్ |

"ఆమెను లోపలికి పంపు బహదూర్" అంది అనన్య గట్టిగా.

ఆ అమ్మాయి లోపలికి వచ్చింది. వణికిపోతూ ఉంది.

పులినోట్లో నుంచి బయటపడ్డ గోవులా కన్పించింది.

"నిలబడ్డావెందుకు? కూర్చో!" అంది అనన్య.

కూర్చుంది గాని మాట్లాడటానికి్కూడ ఓపిక లేనట్లుగా కన్పించింది.

"మీ పేరేమిటి? ఇక్కడకు ఎందుకొచ్చారు? " అంది అనాథాశ్రమమని పొరపాటున వచ్చిందేమోననుకుని.

ఆమె ఎందుకొచ్చినా ఆమెకు వచ్చిన కష్టమేమిటో తెలుసుకోవాలి!

"నాపేరు వసంత... ఆకలిగా ఉంది... వారం రోజులయ్యింది అన్నం తిని" అందామె నీరసంగా.

అటెండరు దుర్గమ్మను పిలిచింది.

"ఈ అమ్మాయిని హాస్టల్ బిల్డింగ్ దగ్గరకు తీసుకెళ్ళి ముందు కడుపు నిండా అన్నం పెట్టు! కట్టుకోవడానికి బట్టలు ఉంటే ఇవ్వు! లేకపోతే సెంటరుకు వెళ్ళి కొత్త బట్టలు కొనుక్కొచ్చి ఇవ్వు! ఈమె కొంచెం కుదుటబడ్డాక సాయంత్రం నా గదికి తీసుకురా!" దుర్గమ్మకు చెప్పింది.

వసంతను తీసుకువెళ్ళింది.

సాయంత్రం అనన్య గదిలోకి వచ్చింది వసంత.

ఆమెను చూసి ఆశ్చర్యపోయింది. ఉదయం శోకదేవతలా కన్పించిన ఆమె శుభ్రంగా స్నానం చేసి తెల్లబట్టల్లో మంచులో తడిసిన మల్లెపువ్వులా మెరిసిపోతూ కన్పించింది. జడ అల్లుకున్న తీరు, కట్టూబొట్టూ తీరు చూసి పేదరికంలో మగ్గిపోయి ఆకలిబాధ తట్టుకోలేక వచ్చిన అమ్మాయిలా కన్పించలేదు. మిడిల్ క్లాసమ్మాయి ఏవో ఇబ్బందులతో ఇల్లు వదిలి వచ్చినట్లుగా అన్పించింది. చదువుకున్న అమ్మాయిలా కన్పించింది.

"తెల్లటి బట్టల్లో మీరు అందంగా కన్పిస్తున్నారు" అంది అనన్య ఆమెను మాటల్లోకి దింపి, ఆమె గురించి వివరాలు తెలుసుకోవాలన్న ఉద్దేశ్యంతో.

"బతుకు చీకటిమయం అయ్యింది. అలముకున్న చీకటిలో అలమటిస్తూ ఉన్నాను. తెల్లటి బట్టలు మనస్సులోని చీకటిని పోగొట్టి వెలుగును తీసుకురాలేవు" అంది ఉద్వేగంగా. మాటలు తడబడుతున్నాయి.

ఆమె దృష్టి గోడకు తగిలించిన మదర్ థెరిస్సా ఫొటో మీద నిలిచింది.

"కష్టాలకు కలత చెందకుండా ఆనందంగా ఉండటం అంతులేని సంపద కలిగి ఉన్నట్లే! విలువైన జీవితాన్ని కన్నీటి ధారలతో బలి చేయకూడదు. ధైర్యంగా ఉండాలి మీరు. మీకు అభ్యంతరం లేకపోతే మీకు వచ్చిన కష్టమేమిటో చెప్పండి. మీకు అండగా ఉండటానికి ప్రయత్నిస్తాం!" అంది అనన్య ఆమెకు ధైర్యం చెబుతూ.

వసంత తన జీవిత పుటలు అనన్యకు చూపించింది. అక్షరాలు ముత్యాల సరాల్లా లేవు. గొలుసుకట్టు రాతతో గందరగోళంగా ఉన్నాయి. ఎక్కడ చూసినా కొట్టివేతలు. కొన్ని పేజీలు చింపేసి ఉన్నాయి, మరొకరి కంటబడకుండా.

పూసగుచ్చినట్లు తన గురించి చెప్పింది వసంత.

... వసంత తండ్రి బడిపంతులు ...

... నర్సయ్య ముక్కుసూటిగా పోయే మనిషి. జిల్లా పరిషత్ స్కూళ్ళలో పనిచేశాడు. ప్రతి మూడేళ్ళకు బదిలీ చేసేవాళ్ళు. పెద్దవాళ్ళ అండతో అన్ని సదుపాయాలు ఉన్న ప్రాంతాలలో ఉద్యోగం వేయించుకోమని భార్య చెబుతూనే ఉండేది. ఎవరినీ లెక్క చేసేవాడు కాదు. ప్రాధేయపడేవాడు కాదు. ఎక్కడ పోస్టింగ్ వస్తే ఆ ఊరికి భార్యాపిల్లలు, సామానుతో చేరుకునేవాడు.

కొన్ని ఊళ్ళలో మంచినీళ్ళు దొరికేవి కావు. మూడు నాలుగు కిలోమీటర్లు దూరం నడిచివెళ్ళి నీళ్ళు తెచ్చుకోవాల్సి వచ్చేది. మరికొన్ని ఊళ్ళకు చేరుకోవాలంటే బస్సులు, రైళ్ళ సదుపాయం ఉండేది కాదు. రేపల్లె, తెనాలి, పొన్నూరు ప్రాంతాల్లో అతనికి పోస్టింగు వచ్చేది కాదు. రావెల, మండెపూడి, పెదకొదమ

గుండ్ల - పలనాడులోని మారుమూల ప్రాంతాల్లో పోస్టింగు వచ్చేది. ఎవరినీ నిందించేవాడు కాదు నర్సయ్య.

ఎదుగుతున్న ఆడ పిల్లలతో కనీస సౌకర్యాలు లేని ఊళ్ళలో ఉద్యోగం చెయ్యటం కష్టంగానే ఉండేది. విశాఖపట్నంలో వసంత, సావేరిని హాస్టల్‌లో ఉంచి ఎమ్మెసీ వరకూ చదివించాడు. కూతుళ్ళు ఇద్దరికీ ఉద్యోగాలు వచ్చాయి ఒకే కాలేజీలో లెక్చరర్స్‌గా.

... ఆమెకు అందంగా ఉండే ఓ బిజినెస్ మాన్‌తో పరిచయం ఏర్పడింది. పరిచయం ప్రేమగా రూపుదిద్దుకోవడానికి నెలరోజులు కూడా పట్టలేదు.

"పెళ్ళి చేసుకుందాం" అడిగింది వసంత రేవంత్‌ని.

"బిజినెస్‌లో ఇప్పుడిప్పుడే ఎదుగుతున్న వాడిని.. పెళ్ళి చేసుకుని ఇక్కడ స్థిరపడితే నా వ్యాపారాలు దెబ్బతింటాయి. రెండేళ్ళు ఆగి చేసుకుందాం!" అన్నాడతను.

అతనితో కలిసి హోటళ్ళల్లో తిరిగింది. పబ్బుల్లో తిప్పాడు. రిసార్టులకు తీసుకువెళ్ళాడు. హద్దులు దాటితే గర్భం రాకుండా ఉంటుందా? పెళ్ళి చేసుకొమ్మని మళ్ళీ అతని మీద ఒత్తిడి తెచ్చింది. గర్భం తీయించుకుంటే పెళ్ళి చేసుకుంటానన్నాడు. అతను చెప్పినట్లే ఎబార్షన్ చేయించుకుంది.

సింహాచలం తీసుకువెళ్ళి పెళ్ళి చేసుకున్నాడు వసంతను. గాజువాకలో పెద్ద

భవంతి కొనేసి అందులో కాపురం పెట్టాడు. వసంత చెల్లెలు సావేరిక్కూడా పెళ్ళయ్యింది.

"వ్యాపారం గొడవల్లో హైద్రాబాద్, బెంగళూరు, ఢిల్లీ తరచుగా తిరుగుతూ ఉంటాను... నువ్వు ఒక్కదానివే ఇంత పెద్ద భవంతిలో ఎలా ఉంటావ్? మీ చెల్లెల్ని మన ఇంట్లోనే ఉండమను. నీకు కాలక్షేపం అవుతుంది" అన్నాడు రేవంత్.

సావేరి, ఆమె భర్త నాగరాజు వచ్చి వాళ్ళింట్లో ఉండిపోయారు. నాగరాజుది పిష్‌యార్డ్‌లో చిన్న ఉద్యోగం.

వసంతకు కాలక్షేపం మాటేమోగాని, సావేరి వచ్చి తమ ఇంట్లో ఉండటం రేవంత్‌కి బాగా కాలక్షేపం అవుతూ ఉంది. పెద్ద భవంతిలో ఉండటం, బావగారి కార్లో తిరగడం, అందంగా ఉండే బావగారు తనతో సరదాగా మాట్లాడటంతో సావేరికి సరదాగా గడిచిపోతున్నాయి రోజులు.

ఇంట్లో వసంత లేదు. నాగరాజు డ్యూటీకి వెళ్ళాడు.

మంచి అవకాశం దొరికింది రేవంత్‌కు.

స్నానంచేసి బెడ్ రూములోకి వచ్చి ఒంటికి చీర చుట్టుకుంటూ ఉంది సావేరి. ఆ గదిలో దూరి ఆమెను చీర కట్టుకోకుండా అల్లరి చేశాడు.

ఆ అల్లరి అద్భుతంగా అన్పించింది.

గుండెలో గిలిగింతలు పెట్టింది.

"మీరు ఇంట్లో లేనప్పుడు మీవారు మీ చెల్లెలితో పాటు కులుకుతూ ఇంటికి వస్తున్నాడు. చుట్టుపక్కల అందరూ చూస్తున్నా పట్టించుకోకుండా సావేరి నడుం చుట్టూ చెయ్యివేసి లోపలికి తీసుకువెళ్తున్నాడు. నీ జాగ్రత్తలో నువ్వుండమ్మాయ్. నీ చెల్లెల్ని హద్దుల్లో పెట్టుకో. లేకపోతే తరువాత చింతిస్తావ్!" అంది పక్కింటావిడ.

తనతో పాటు కాలేజీకి వచ్చాక సావేరికి ఫోన్ రావడం, చెల్లెలు సెలవు పెట్టేసి ఇంటికి వెళ్ళడం నాలుగైదుసార్లు జరిగింది. ఎందుకు సెలవు పెట్టావని చెల్లెల్ని అడిగితే తలనొప్పిగా ఉందని చెప్పేది. 'పీరియడ్స్ ప్రాబ్లమ్... కడుపులో నొప్పిగా ఉంది' అంది మరోసారి.

... చెల్లెల్ని అబ్జర్వ్ చెయ్యాలని ఆమె సెలవు పెట్టిన రోజు తనూ సెలవు పెట్టి ఇంటికి వెళ్ళింది. ఇంటి ముందు రేవంత్ కారు కన్పించింది.

ఏమిటీ మోసం?

తనను తప్పించుకుని భర్త తిరగడం ఏమిటి? వాళ్ళిద్దరూ తన కళ్ళుగప్పి కలుసుకోవడమేమిటి? తన కాపురం కూలిపోతుందన్న ఇంగితజ్ఞానం లేకుండా చెల్లెలు బరితెగించడమేమిటి?

ఇంట్లోకి వెళ్ళి సావేరి బెడ్ రూమ్ తలుపు కొట్టింది.

చెల్లెలే వచ్చి తలుపు తీసింది, చెదిరిన బట్టల్ని సరిదిద్దుకుంటూ. సావేరిని నెట్టుకుని బెడ్‌రూమ్‌లోకి వెళ్ళింది.

మంచం మీద పడుకుని మత్తుగా జోగుతున్న రేవంత్ కన్పించాడు. ముసి ముసి నవ్వులు నవ్వుతూ నిలబడ్డ చెల్లెల్ని చూసి ఏం మాట్లాడాలో అర్థం కాలేదు.

అక్కడ ఉండలేకపోయింది వసంత.

బ్యాగ్‌లో బట్టలు సర్దుకుని, రేవంత్‌తో తను దిగిన ఓ ఫోటో బ్యాగ్‌లో పెట్టుకుని ఇంట్లో నుంచి వచ్చింది. తండ్రి దగ్గరకు వచ్చి నెల రోజులు ఉంది. మనస్సు స్థిమితపడలేదు. తనకు జరిగిన అన్యాయాన్ని తండ్రికి చెప్పాలనిపించలేదు.

మౌనంగా రోదించింది.

కాలేజీకి వెళ్ళడం మానేసింది.

మానసికంగా దెబ్బతింది.

ఆమె అనుకోకుండా మహర్షి కాలేజి పరిసరాల్లోకి వచ్చింది. అక్కడి ప్రశాంత వాతావరణం కల్లోల కడలిగా ఉన్న మనస్సును శాంతపర్చింది.

"మీరు ఇక్కడే ఉండిపోండి. మీ చెల్లెలు, మీ భర్త తాము చేస్తున్న తప్పును తెలుసుకుని పశ్చాత్తాపడితే వాళ్ళ దగ్గరకు వెళ్ళండి! మీకు తిరిగి మీ ఇంటికి వెళ్ళాలని అన్పించకపోతే ఇక్కడే ఉండండి. మా కాలేజీలో లెక్చరర్‌గా చేరండి. ఏదో ఒక వ్యాపకంలో పడితే మీ మనస్సు కుదుటపడుతుంది. ఇంతకూ మీవారి ఫొటో ఏదన్నా ఉందా మీ దగ్గర? జస్ట్ క్యూరియాసిటీతో అడిగాను. మీకు అభ్యంతరం లేకపోతే చూపించండి!" అంది అనన్య.

బ్యాగ్‌లో నుంచి ఫొటో తీసి చూపించింది.

ఫొటోలో వసంత భుజం మీద చెయ్యి వేసుకుని, నవ్వుతూ నిలబడ్డ ఆకాష్ కన్పించేడు. "ఆకాష్! నువ్వా?" ఆశ్చర్యపోయింది అనన్య. 'రేవంత్ అని పేరు మార్చుకున్నాడన్న మాట...' అనుకుంది.




గేటు దాటి పోర్టికో వైపు వస్తూ లాన్‌లో కూర్చున్న అనురాగ్‌ను చూసి అటువైపు హంసలా నడిచి వచ్చింది అనన్య.

ఆమెను చూడగానే అతని శరీరం పులకరించింది.

'ఏమిటో ఈ మాయ?' అనుకున్నాడు.

బతుకులో ఇంత తియ్యదనం ఉందా? రసబంధురంగా ఉండే జీవితాన్ని ఆస్వాదించడం తెలియక చనిపోదామనుకున్నాడు. అనన్య తనకు బతుకులోని రుచి చూపించింది. మరోజన్మను ఇచ్చిందామె.

ఆమె మొహంలోని చిరునవ్వు చూపులలోని సోయగం, మాటలలోని తియ్యదనం అతన్ని కట్టిపడేశాయి. ఆమె ఎక్స్‌ట్రావర్ట్! తనను గూర్చి ఆలోచించక, ఇతరుల గూర్చి ఆలోచిస్తూ ఉంటుంది. బయట జరిగే విషయాల మీదే మనస్సు నిమగ్నం చేస్తుంది. అందుకే ఆమె ఎప్పుడూ ఆనందంగా, ఉల్లాసంగా కన్పిస్తుంది.

అతను ఇంట్రావర్ట్. బయట ప్రపంచం పట్టదు. నత్తలాగా లోపలికి ముడుచుకుపోయి ఉంటాడు.

"రండి... రండి... మీ గురించే ఆలోచిస్తున్నాను. మీరు ఎర్రగులాబీలా ఆకర్షణీయంగా ఉండి అందరికి చేరువవుతారు... నేనేమో విత్తనంలా ముడుచుకుపోయి ఉంటాను" అన్నాడతను.

అతనికి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుందామె.

"విత్తనాన్ని తడి మట్టిలో ఉంచితే మొలకెత్తి మహావృక్షమై ఎందరినో తన నీడలో చేర్చుకుని సేద తీరుస్తుంది. చిన్న ఉద్యోగం కోసం వెతుకులాడుతున్న నన్ను చేరదీసి ఓ పెద్ద కాలేజీకి కరస్పాండెంట్‌గా చేశారు. మీ ఆస్తిపాస్తులకు నన్ను కేర్ టేకర్ని చేశారు. మీ నీడలో సేద తీరుతున్నాను" అందామె నవ్వుతూ.

"పొగిడి ములగ చెట్టు ఎక్కించకండి... పడిపోతాను"

"పడిపోనివ్వను లెండి... పట్టుకుంటాను"

పనిమనిషి ఇద్దరికీ కాఫీ తెచ్చి ఇచ్చింది.

"రేపు మనం గరికపర్రుకు కారులో వెళ్దాం. వారం రోజులు అక్కడ గడిపి వద్దాం! పల్లెటూళ్ళో వారం రోజులు గడపాలని ఉంది. పుట్టి పెరిగింది విశాఖపట్నం

లోనే. పట్నవాసమే గాని పల్లె జీవనం గూర్చి తెలియదు. రైతుల జీవన విధా నాన్ని దగ్గరగా పరిశీలించాలని ఉంది" అంది అనన్య.

"ఆ ఊరు ఎక్కడుంది? అక్కడ మనం ఎవరింట్లో ఉంటాం? " అడిగాడు.

"మా స్నేహితురాలు నయనికకు ఆ ఊళ్ళో భూములు, తోటలున్నాయి. ఆ పొలాలను రుత్విక్‌గారు చూస్తూ ఉంటారు... ఆయనే ఆహ్వానించారు... నయనిక కూడ అక్కడికి హైదరాబాద్ నుంచి వస్తున్నది"

"పల్లెల్లో తిరగడం నాక్కూడా ఇష్టమే! రిలాక్సింగ్‌గా ఉంటుంది. తప్పకుండా వెళ్దాం!" అన్నాడతను.

చల్లని జాబిలితో చెలిమి అతని మన స్సుకు ఆహ్లాదాన్ని కలిగిస్తూ ఉంది.

★ ★ ★

రుత్విక్ వాళ్ళది పెద్ద పెంకుటిల్లు. రోడ్డుకు ఒకవైపున వాళ్ళ ఇల్లు ఉంటే, మరోవైపు పెద్ద చెరువు ఉంది. ఊరి చుట్టూ పచ్చటి పొలాలు, అరటి తోటలు, చెరకు తోటలు! ఎటు చూసినా పచ్చదనం పల్లవించినట్లు కన్పిస్తుంది.

ఇంట్లో వయోవృద్ధులైన తాత, నాయ నమ్మ తప్పితే ఎవరూ లేరు. రుత్విక్ అన్నయ్య యు.యస్.లో ఉన్నాడు. ఓ గదిలో బీరువాల నిండా పుస్తకాలు ఉన్నాయి. పాతకాలం నాటి గ్రామఫోన్ పెట్టె ఉంది. దాన్ని రిపేర్ చేస్తూ వాడు తూనే ఉన్నాడు. మరో పక్క వీణ ఉంది. ఇల్లంతా కలయదిరిగిన నయనిక 'ఇతనికి మంచి అభిరుచులే ఉన్నాయి' అనుకుంది.

"అనన్య వాళ్ళు ఇంకా రాలేదు" అంది నయనిక రుత్విక్‌తో

"విజయవాడ దాకా వొచ్చారట... మరో గంటలో చేరుకుంటారు లెండి" అన్నాడ తను.

ఇంటికి ఓ పక్క ఉన్న పశువుల సావిడి దగ్గరకు వెళ్ళింది. జనుపకట్టలు మేస్తున్న బలిష్టంగా ఉన్న ఎద్దుల మీద ఆమె దృష్టి నిలిచింది.

"ఎద్దులు పుష్టిగా అందంగా ఉన్నాయి" అందామె.

పంటలకు పశువులే ముఖ్యం. రైతుకు పశువులకు అనుబంధం ఉంది. నాలుగు పాడిపశువులు ఎకరా పొలంతో సమానం. మా దగ్గర పన్నెండు పాడి గేదెలు ఉన్నాయి. నూట ఇరవై లీటర్ల పాలు ఇస్తాయి. పశువుల కోసం పశుగ్రాసం పెంచుతారు. పశువుల పేడతో గోబర్ గ్యాస్ తయారవుతుంది. గ్యాస్ ఖర్చు లేదు, పర్యావరణం ముప్పులేదు. రసాయ నిక ఎరువులు ఎక్కువగా పొలాలకు వాడం. వానపాములు, పశువుల పేడ, కలుపు మొక్కలు, మట్టితో కలిపి కంపోస్ట్ ఎరువు తయారవుతుంది. కంపోస్ట్ ఎరువు పొలాల్లో చల్లాక ఎరువులోని క్రిములు భూమిని గుల్ల చేస్తాయి. మొక్కలకు అవ సరమైన గాలి తగులుతుంది. పెద్దగా పెట్టుబడులు పెట్టకుండా 'సేంద్రీయ వ్యవ సాయంతో ఎకరానికి నలభై బస్తాల ధా న్యం పండించుకోవచ్చు. సేంద్రీయ వ్యవ సాయంలో అరటిగెలల బరువు కూడ ముప్పై నుంచి యాభై కిలోలకు పెరుగు తుంది"

వ్యవసాయం గూర్చి మక్కువతో అతను కబుర్లు చెబుతుంటే వింటూ ఉండిపో యింది.

ఇంటి ముందు చెరువు దగ్గరకు వచ్చారు. చెరువుగట్టు మీద ఉన్న రావి చెట్టు చల్లటి నీడలో చేరారు. సిమెంటు బెంచీ మీద కూర్చున్నారు.

"మీరు ఇంకా పెళ్ళి ఎందుకు చేసుకో లేదు? " అడిగిందామె.

"ఇంకా ఆ గౌరవం నాకు దక్కలేదు"

## ఎడమొహం.. పెడమొహం..




ఆస్ట్రియాలోని ఒక జంతుప్రదర్శనశాలలో ఆడ, మగ తాబేళ్లు ఉన్నాయి. వీటి వయసు 115 ఏళ్లు. ఇవి రెండూ క్లాజెన్‌ఫర్ట్ అనే ఊళ్లో గత ముప్పై ఆరేళ్లుగా కలిసి దాంపత్యం చేస్తున్నాయి. మగ తాబేలు కిపోల్డి. ఆడ తాబేలు పేరు బీబీ. వీటిని స్విట్జర్లాండ్‌లోని బసెల్ జూ నుంచి 1975లో తెప్పించారు. ఇవి చిన్నప్పటి నుంచి కలిసే జీవిస్తున్నాయి. ఆస్ట్రియన్ టైమ్స్ అనేక సార్లు వీటిని ప్రపంచంలో అతి వృద్ధ జంటగా పేర్కొంది. మనుషులు కూడా వాటిలా కలిసి దాంపత్య జీవనం సాగించాలని ఆస్ట్రియా, ఇంకా యూరప్‌లోని ఇతర చర్చీలలోని ఫాదర్లు తమ ప్రవచనంలో చెబుతుంటారు. కాని ఈ పరిస్థితి ఇప్పుడు మారింది. ఎందుకనో అకస్మాత్తుగా ఆడ తాబేలు బీబీకి తన జోడి అయిన మగ తాబేలంటే విరక్తి కలిగింది. ఈ రెండూ ఒకదాన్ని చూస్తే మరొకటి రెచ్చిపోయి పోట్లాటకు దిగుతున్నాయి. అనేకసార్లు బీబీ మగ తాబేలుని కొరకడం సిబ్బంది గమనించారు. అదృష్టవశాత్తు తాబేళ్లకి పళ్లుండవు. అయితే వాటికి చాలా గట్టి దవడలు ఉంటాయి. వాటి సాయంతో మరో తాబేలుని ఊపిరాడకుండా గొంతు పిసిగి చంపేయగలవు. ఆ భయంతో జూ సిబ్బంది వీటిని కొన్ని వారాలు వేరుగా ఉంచి మళ్లీ కలిపారు. ఆ విరహం వల్ల వాటి మధ్య తిరిగి సయోధ్య కుదురుతుందనుకున్నారు. కాని వాటి పోట్లాట ఆగలేదు. వాటికి రొమాంటిక్ భోజనాన్ని పెట్టడమేకాక రెండూ కలిసి ఆడేందుకు కొన్ని ఆటవస్తువుల్ని అందించారు. అయినా ఫలితం లేకపోవడంతో వాటిని వేరు చేశారు. తాబేలు ఆయుర్దాయం సగటున 150 ఏళ్లు. ఆ లెక్కన ఇంకా వాటికి చెరో ముప్పైఐదేళ్ల జీవితం ఉంది. భవిష్యత్తులో ఏదో ఒకరోజు అవి తిరిగి సఖ్యంగా ఉండవచ్చని అధికారులు ఆశిస్తున్నారు. అయితే బీబీకి ఈ ఒంటరి జీవితం ఆనందంగానే ఉందట.




అన్నాడతను నవ్వుతూ.

"ఎగతాళి చేస్తున్నారా పెళ్ళి చేసుకున్న వాళ్లని?"

"అదేంలేదు... పెళ్ళయిన వాళ్ళను చూసి ఎవరూ ఈర్ష్యపడరు... పెళ్ళి కాకుండా ఉన్న అందమైన అమ్మాయిల్నీ, అబ్బాయిల్ని చూసి అందరూ ఈర్ష్యపడతారు... 'ఈ అమ్మాయిని ఎవరు చేసుకుంటరోగాని అదృష్టవంతుడు' అని అనుకుంటారు... 'ఈ కుర్రాడు నా మొగుడైతే ఎంత బాగుండేది... పెళ్ళి కాకముందు ఇతన్ని చూసినట్లయితే ఇతన్ని వెంటబడి పెళ్ళి చేసుకుని ఉండేదాన్ని' అని అమ్మాయిలు అనుకుంటారు" అన్నాడతను.

"మనిద్దరికి ఇప్పుడా సమస్య ఉందంటారు"

అతని దృష్టి చెరువుపై ఎగురుతున్న తెల్లటి కొంగల మీద, నీలాకాశం మీద పడింది.. రావి ఆకుల గలగల చప్పుడు విన్నాడు... నీలి ఆకాశం తనలోకి చొచ్చుకుపోతున్నట్లు అన్పించింది.

ఐదు నిముషాల్లో బాహ్య ప్రపంచాన్నే మర్చిపోయాడు.

మౌనంగా కూర్చుని ప్రకృతితో మమేకం అయిపోతున్న అతన్ని తదేకంగా చూసింది నయనిక.

అతని మోహన రూపం కలవరపెడుతూఉంది. అతనికి దగ్గరగా జరిగి పెదాలను ముద్దు పెట్టుకోవాలనిపించింది.

"లైఫ్ ఈజ్ బ్యూటీఫుల్! ఇంతేనండీ!" అన్నాడతను ట్రాన్స్‌లో నుంచి బయట పడి.

"పచ్చని పొలాలు చూసినా, నిండుగా ప్రవహిస్తున్న నదిని చూసినా, పున్నమి వెన్నెలను చూసినా మనస్సు ఉప్పొంగిపో తుంది. చిన్నపిల్లాడినైపోతాను... సారీ! మీకేం ఇబ్బంది కల్గించలేదు కదా? " అన్నాడతను సర్దుకుని కూర్చుని.

గాలికి చెదిరిపోతున్న ముంగురులను ఎడంచేత్తో సర్దుకుంటూ అతనివైపు చూసింది మెరిసే కళ్ళతో.

తెల్ల తామరరేకుల్లాంటి ఆమె విశాలనే త్రాలకేసి తన్మయత్వంతో చూస్తూవుండిపో యాడు.

రోడ్డుమీద కారు ఆగింది.

అనన్య, అనురాగ్ కార్లో నుంచి దిగారు.

'హాయ్' అంటూ పలుకరిస్తూ అనన్య దగ్గరకు వెళ్ళింది నయనిక.

★ ★ ★

భోజనం చేస్తూ "మీ కాలేజీ ఎలా నడు స్తోంది? " అడిగింది నయనిక.

"మేము ఎంపిక చేసుకున్న రోడ్డు మీద తిన్నగా పోతున్నాం... విద్యార్థుల దగ్గర ఫీజులు వసూలు చెయ్యడంలేదు. కాలేజీని ఓ ఆదాయ మార్గంగా చూడటంలేదు. ఎటువంటి ప్రలోభాలకు లొంగకుండా మేం అనుకున్న లక్ష్యసాధన దిశగా వెళ్తున్నాం... ఐ హోప్ ఉయ్ విల్ నాట్ రీచ్ ఎ బాడ్ ఎండ్.. మనం నడుస్తున్న దారి సక్రమంగా ఉన్నప్పుడు గమ్యం తప్ప కుండా చేరుకుంటాం"

మాటల్లో ఆకాష్ ప్రస్తావన వచ్చింది.

"నాకో కొత్త విషయం తెలిసింది... ఓ అభాగ్యురాలు మా కాలేజీ ఆవరణలో పిచ్చిదానిలా తిరుగుతుంటే ఆదరించి దగ్గ రకు తీసుకున్నాం... ఆమె పేరు వసంత... ఆకాష్ ఆమెను పెళ్ళి చేసుకు న్నాడు. అతని కన్ను వసంత చెల్లెలి మీద కూడ పడింది.. భర్త చెల్లెలితో ప్రేమ సరాగాలు మొదలుపెట్టేసరికి తట్టుకోలేక రోడ్డున పడింది... ఇప్పుడు బాగానే ఉంది... మా కాలేజీలో లెక్చరర్ ఉద్యోగం ఇచ్చాం! ప్రశాంతంగా జీవితాన్ని గడుపు తోంది భర్త విషయం పట్టించుకోకుండా!" వసంత కథ వివరంగా చెప్పింది అనన్య.

"రేరాజులా ఆకాశంలో దర్జా వెలుగబెట్టే ఆకాష్ పతనం అయ్యాడన్న మాట... 'ఆకాశం నుండి శంభుని శిరం, అందుండి శీతాద్రి...' పద్యం గుర్తుకు వస్తోంది... ఈ మధ్య డ్రగ్స్ క్కూడా అలవాటు పడ్డా డని తెలిసింది" అంది నయనిక.

"అమెరికా అమ్మాయి గారికి తెలుగు పద్యాలు వొచ్చు, మేమేమో మర్చిపో తున్నాం!" అన్నాడు రుత్విక్.

"మీకు నేర్పుతాలేండి" అంది నయనిక

అందరూ నవ్వుకున్నారు.

"వంట ఎవరు చేశారు...? కూరలు అద్భుతంగా ఉన్నాయి" అన్నాడు అను రాగ్.

మధ్యాహ్నంపూట భద్రమ్మగారు సు న్నుండలు, బెల్లపప్పుచ్చులు చేస్తుంటే దగ్గ రుండి ఆమె ఎలా చేస్తుందో గమనించింది అనన్య.

★ ★ ★

"పట్నవాసుల పూర్వీకులు ఒకప్పుడు పల్లెల్లో పుట్టి పెరిగినవాళ్లే! చదువులకో సమో, ఉద్యోగంకోసమో పల్లెలు వొదిలి పట్నాలు చేరుకుంటున్నారు... పట్టణాన్ని మనిషి నిర్మిస్తే పల్లెటూరిని భగవంతుడు సృష్టించాడు" అన్నాడు రుత్విక్.

సాయంత్రం పూట పొలాలు, తోటలు చూడటానికి ఊళ్ళో నుంచి బయటపడి పొలం గట్లమీద నడుస్తూ చాల దూరం వచ్చారు.

ఎటు చూసినా పచ్చటి తివాచీ పరిచి నట్లు వరి పొలాలు కన్పించేయి. అక్కడ క్కడా చెరుకుతోటలు, అరటి తోటలు కన్పించేయి. పచ్చటి పొలాలను కాపలా

కాస్తున్నట్లు పొలం గట్లమీద, దిబ్బలమీద తుమ్మచెట్లు, చింతచెట్లు పచ్చటోపీలు పెట్టుకున్న పోలీసుల్లా కన్పించేయి.

"మీ పట్టణాల్లో సూర్యోదయాలు, సూర్యాస్తమయాలు కన్పించవ్... ఎత్తైన భవంతులు అడ్డొస్తాయి" అన్నాడతను.

అందరిదృష్టి పడమటి దిక్కున వాలిపో తున్న ఎర్రటి సూర్యబింబంమీద పడింది.

అందమైన ప్రకృతి దృశ్యాలను తన వీడియో కెమెరాలో బంధించింది నయ నిక. కాలువగట్లమీద గొడ్లను కాస్తున్న బుడ్డాళ్ళ ఫొటోలు కూడ తీసి వాళ్ళకు చూపించింది.

ఆనందంతో ఎగిరి గంతేశారు. వాళ్ళజే బుల్లో కుక్కుకున్న కందికాయలు, సీమతు మ్మకాయలు తీసి అనన్యకు, నయనికకు ఇచ్చారు.

సాంబయ్య ఎదురొచ్చాడు బాడవ పొలం దగ్గర.

ఆయన్ని పలుకరించాడు రుత్విక్ "ఏం మావా? ధాన్యం అమ్మేశావా? " అడిగాడు.

భుజం మీది తుండుగుడ్డతో మొహం తుడుచుకుని "తక్కువకే అమ్మేశాను. బస్తా ఆరొందలకు అమ్మాను... మనమేమో వ్యవసాయం అంటే మక్కువతో కష్టపడి పండించడం.. చివరికి కమీషన్ వ్యాపారు లకు తక్కువ ధరకు అమ్ముకోవడం... పొలం మీద పెట్టిన ఖర్చులు కూడా తిరిగి రాలేదు. వ్యవసాయం ఖర్చులు ఇబ్బడిము బ్బడిగా పెరిగిపోయాయి. విత్తనాలు, ఎరు వులు, పురుగు మందుల రేట్లు ప్రతి ఏడాదీ పెరుగుతూనే ఉన్నాయి... ఖర్చులు తడిసి మోపెడవుతున్నాయి... ఇలాగయితే వ్యవసాయం చెయ్యలేంరా అల్లుడూ!"

ఆయన చెప్పిన విషయాలు శ్రద్ధగా వింటున్నాడు అనురాగ్.

"మిమ్మల్ని నిలబెట్టి మాట్లాడుతు న్నాను... చుట్టాలు వచ్చినట్లు న్నారు...మనం తర్వాత మాట్లాడుకుం దాంలే!" అనేసి వెళ్ళిపోయాడు సాంబయ్య.

"సాంబయ్య మావకు పాతికెకరాల పొలం ఉండేది... ఇంటి ముందు ఎప్పుడూ పురుల్లో, పాతర్లలో ధాన్యం ఉండేది. మంచి ధరున్నప్పుడు అమ్ముకునే వాడు. ఇప్పుడు అప్పులు పెరిగిపోయి కల్లం దగ్గరే ధాన్యం అమ్ముకోవాల్సిన పరి స్థితి ఏర్పడుతోంది. ఇంట్లో ఏ కార్యక్రమం జరిగినా ఘనంగా జరగాలంటాడు... కూతుళ్ళ పెళ్ళిళ్ళు వైభవంగా అప్పులు చేసి చేశాడు. పాతిక ఎకరాల పొలంలో ఇప్పుడు ఆయనకు ఐదెకరాలు మిగిలింది. వ్యవసాయం మీద ఆదాయం తగ్గిపో

## కొత్తగాలి...

**రాజులపైన రాళ్లపాలు**
**నాటి నానుడి!**
**రాళ్లపైన రాజులపాలు**
**నేటి నిజమిది!**

**– వెల్మల రాంరెడ్డి,**
పూడూరు, కరీంనగర్ జిల్లా

యింది. ఖర్చులు పెరిగిపోయాయి... వెనుకటి రోజుల్లో రైతులు ఎంతో సంబ రంగా ఏరువాక పండుగ చేసుకునే వాళ్ళు... నాగలికి పూజలు చెయ్యడం, ఎడ్లను అలంకరించడం, పాలేళ్ళకు కొత్తబ ట్టలు కుట్టించడం చేస్తుండేవాళ్ళు... అవన్నీ ఇప్పుడు పాతముచ్చట అయిపో యింది. సొంతంగా వ్యవసాయం చేసు కుంటే గిట్టుబాటు కావడంలేదని పొలం కౌలుకు ఇస్తున్నారు. ఇంట్లో అరడజను మనుషులుండి నడుంవొంచి పనిచేస్తే వ్యవసాయం గిట్టుబాటవుతుంది" వివ



రంగా చెప్పాడు.

"సాంబయ్యగారిని 'మావా!' అని పిలుస్తున్నారు... ఆయనకు పెళ్ళిగాని ఇంకో అమ్మాయి ఉందేమిటి? " అంది నయనిక చిలిపిగా నవ్వుతూ.

ఊళ్ళోకి తిరిగి వచ్చేక సర్పంచ్ ఇంటికి తీసుకెళ్ళాడు.

పెద్ద మండువా లోగిలి ఇల్లు. ఇంటి ముందు పెద్ద ఆర్చీ ఉంది. ఇంటి చుట్టూ పచ్చని చెట్లు, ఆర్చీగేటుకు రాధామనో హరం అల్లుకుని ఉంది. ఇంట్లోకి వెళ్ళే దారికి రెండువైపుల రకరకాల పూలమొక్కలు తలలు ఊపుతూ స్వాగతం పలుకుతున్నాయి.

సర్పంచ్‌గారికి అందరినీ పరిచయం చేశాడు రుత్విక్.

ప్లేట్లలో మైసూర్‌పాక్ ముక్కలు, బొప్పాయి ముక్కలు అందరికీ ఇచ్చారు. ఫలహారం అయ్యేక తియ్యటి కొబ్బరినీళ్ళు తాగేరు వాళ్ళింట్లో.

"మొన్న కారంచేడు వెళ్ళానబ్బాయి. ఆ వూళ్ళో ఎడ్లపందాలు పెట్టారు... పుటకగల ఎద్దుల్ని చూస్తుంటే కడుపునిండి పోయింది. తిరునాళ్ళకు వచ్చినట్లు జనం పల్లెలనుంచి వచ్చారు. నాకైతే ఏదో ఆశ... రైతులకు మంచి రోజులు వస్తాయి... పశువుల్ని పెంచడం భారం అనుకునే రోజులు పోతాయి... ప్రతి ఇంటిదగ్గర పశువుల సావిడి ఉంటుంది. ప్రతి ఇంట్లో పాడి ఉంటుంది" అన్నాడాయన

సర్పంచ్ ఎక్కడ ఎడ్లపందాలు జరిగినా తను పెంచే మేలుజాతి ఎడ్లను తీసుకువెళతాడు. పందాలలో గెలిస్తే వాటిని చక్కగా అలంకరించి చుట్టు పక్కల గ్రామాలలో ఊరేగింపుగా తీసుకువెళ్తాడు. గూలాల్ కొట్టి అలంకరించిన ఎడ్లను అందరూ చూస్తుంటే ఆయన పొంగిపోతాడు.



"సొంత ఊరు వొదిలిపెట్టి పట్టణాలకు చేరుకుని బాగా చదువుకుని ప్రయోజకులైన వాళ్ళున్నారు... విదేశాలకు వెళ్ళి కోటీశ్వరులైనవాళ్ళున్నారు... వాళ్ళంతా సొంత వూరి గుండెసవ్వడి వినాలి! స్వగ్రామంలోని వీధి బడిని బాగుచేయడమో, పశువుల ఆసుపత్రి కట్టించడమో, రైతులు పండించిన పంటలు పాడయిపోకుండా దాచుకోవడానికి అవసరమైన శీతల గిడ్డంగులు కట్టించడమో చేయాలి. కన్నతల్లి పాల రుణం తీర్చుకోవాలి! అప్పుడే పల్లెల్లో పచ్చదనం వెల్లివిరుస్తుంది!"

అమెరికా నుంచి, ఢిల్లీ నుంచి, ఇతర దేశాలనుంచి ఎవరు వచ్చినా ఆ విషయం మళ్ళీమళ్ళీ చెబుతూనే ఉంటాడు. ఆయన కొడుకులిద్దరూ అమెరికాలో ఉన్నారు. వాళ్ళు ఎప్పుడు డబ్బు పంపించినా ఊళ్ళో సౌకర్యాలు మెరుగుపర్చడానికే ఉపయోగిస్తాడు.

ఇంటికి తిరిగివచ్చేక "ఆయనలో అంత తపన ఉంది కాబట్టే మావూరికి ఆయనే ఏకగ్రీవంగా సర్పంచ్‌గా పాతికేళ్ళ నుంచి ఎన్నుకోబడుతున్నాడు" అన్నాడు రుత్విక్ సర్పంచ్‌ను గూర్చి చెబుతూ.

★ ★ ★

హాల్లో పడుకున్న అనురాగ్‌కు నిద్రపట్టలేదు.

కిటికీలో నుంచి బయటకు చూస్తే పాల వెన్నెల అంతటా పరుచుకుని ఉంది. వెన్నెల జల్లులో తడసిపోవాలనిపించింది.

తలుపు తీసుకుని బయటకు వచ్చాడు.

ఇంటిముందున్న పున్నాగ చెట్టుకింద నిలబడ్డాడు.

పిల్లతెమ్మెర వీచినప్పుడల్లా పున్నాగ పూలు రాలిపడుతున్నాయి. వెండివెన్నెల్లో తెల్లటి పున్నాగ పూలు జలజల రాలిపడటం అద్భుతంగా కన్పించింది. కమ్మటి పున్నాగ పూల వాసన అంతకు ముందెప్పు

డూ అతను పీల్చలేదు.

అంతా కొత్తగా గమ్మత్తుగా వుంది.

గరికపర్రు వొచ్చినప్పటి నుంచి అతనికి కొత్త బంగారులోకంలో తిరుగుతున్న అనుభూతి కలుగుతుంది. పట్నవాసం తప్పితే మారుమూల పల్లెలో గడపడం అదే మొదటిసారి.

వందల సంఖ్యలో పున్నాగపూలు రాలిపడివున్నాయి. తెల్లటి తివాచీ పరిచినట్లుగా వుంది. ఆ మెత్తటి పూల తివాచీ మీద అడుగులు వేయడానికి మనస్సు ఒప్పుకోలేదు.

అంతా ప్రశాంతంగా వుంది. ఆ ప్రశాంతత మనస్సులోకి చొచ్చుకుపోవడానికి రెండు నిమిషాలు కళ్ళు మూసుకున్నాడు.

రాత్రిళ్ళు అన్నీ ప్రశాంతంగానే వుంటాయి.

పగలే గోలగోలగా వుంటుంది.

వెన్నెలమ్మ ఎంతో ప్రేమతో అందరిని హృదయానికి హత్తుకుంటుంది.

అప్పుడప్పుడు చెట్ల మీద పిట్టల కదలికల చప్పుడు.. పాముచెట్టు మీదకు పాకి పక్షిగూళ్ళలో ప్రవేశించి గుడ్లను, పసికూనలను మింగేస్తున్నట్లు పాడుపీడకల వచ్చిందేమో ఆ పక్షులకు.

వెన్నెలరాత్రి ఇంట్లో నుంచి బయటకు వొచ్చి ఎవరికీ తెలియకుండా అమృతం తాగేస్తున్నాడు అనురాగ్.

డాక్టర్ చిట్టిబాబు చెప్పిన మాటలు గుర్తుకు వొచ్చాయి. "శరీరంలోకి సగం జబ్బులు చొచ్చుకువొచ్చేది మనస్సు మూలంగానే! మనస్సు దృఢంగా వుంటే ఏ జబ్బులూ రావు... మనస్సుకు మంచి ట్రైనింగ్ ఇవ్వాలి... ఏ కష్టం కలిగినా బెదిరిపోకూడదు... సౌఖ్యానికి పొంగిపోకూడదు" అన్నాడాయన.

వెన్నెల వానలో తడిసి మనస్సు మధురిమలు నింపుకున్నాక ఇంట్లోకి వొచ్చేద్దామనుకున్నాడు.

తలుపు దగ్గర ఎవరో నిలబడి తూలిపోతున్నట్లు అన్పించింది. దగ్గరికి వెళ్ళి చూస్తే రుత్విక్ తాతగారు కన్పించారు.

ఆయనకు ఎనభై యేళ్ళుంటాయి. ఊడిపోతున్న లుంగీని నడుంచుట్టూ బిగించే ప్రయత్నం చేస్తుంటే తూలువొచ్చి తలుపు మీదకు వొరిగిపోతున్నాడు.

శేషయ్యగారి దగ్గరకు వెళ్ళాడు.

బాత్‌రూమ్‌కు వెళ్ళాలని లేచాడేమో! నిద్రమత్తులో తెలియక మెయిన్‌డోర్ దగ్గరకొచ్చి నిలబడ్డాడేమో!

"తాతగారూ బాత్‌రూమ్‌కు వెళ్తారా?" అడిగాడు అనురాగ్ ఆయనను.

తల అడ్డంగా ఊపాడాయన లోపలికి వెళ్ళడం ఇష్టంలేనట్లు.

బయటకు తీసుకువెళ్ళమన్నట్లు సైగలు చేశాడు.

ఊడిపోతున్న లుంగీని తాతగారి నడుంచుట్టూ బిగించాడు.

"బయటకు ఎందుకు మీరు... లోపలికి వెళ్దాం!" అన్నాడతను.

చేత్తో విసురుగా అనురాగ్ భుజం నెట్టాడు. బయటకు తీసుకువెళ్ళమని సైగ చేశాడు.

మెల్లగా నడిపించుకుంటూ ఆరు బయటకు తీసుకువొచ్చాడు ముసలాయన్ని. నక్షత్రాలను, ఆకాశాన్ని పరిశీలనగా చూసే ఎస్ట్రోనమర్‌లా రెండు చేతులు నడుంకు ఆనించి, తలపైకెత్తి చంద్రుడికేసి చూస్తూ వుండిపోయాడు శేషయ్య.

ఆకాశంలో పూర్వీకులు మాట్లాడుకుంటుంటే వింటున్నట్లు 'ఊ... ఊ... ఆ.. ఆ...' అంటున్నాడాయన. చందమామ తనసొంతం అన్నట్లు తదేకంగా చూస్తూ వుండిపోయాడు.

పది నిముషాల తరువాత లోపలికి తీసుకువెళ్ళమనట్లు మళ్ళీ సైగలు చేశాడు.

అమ్మ ఎత్తుకుంటే ఆకాశంలోని చంద మామను చూసి బోసి నవ్వులు విరజిమ్ము తుంది పసిపాప. మలిదశలో వున్న తాత గారికి చంద్రుడి మీద మమకారం పసి పాపకు లాగే.

శేషయ్య గారిని మంచం మీద పడుకో బెట్టి మళ్ళీ బయటకు వొచ్చి నిలబడ్డాడు అనురాగ్.

అరగంట గడిచేక అనన్య బయటకు వొచ్చింది.

అతన్ని చూసి "నిద్ర పట్టడం లేదా? " అడిగింది.

ఆమె తలలో తురుముకున్న సంపెంగె వాసన అతన్ని చుట్టుముట్టేసింది.

ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుని "నువ్వు ఎక్కడికి వెళ్ళితే అక్కడకు నన్ను తీసుకెళ్తున్నావ్! నీ మాట కాదనకుండా ను వ్వేది చెబితే అది చేస్తున్నాను. నీకు వీర విధేయుడ్ని అయ్యాను" అన్నాడతను.

"నా మనస్సును మీరు ప్రేమతో తాకారు. మిమ్మల్ని వదిలి వుండలేను" అందామె అతని భుజంపై తలవాల్చి.

"తొలిపొద్దులో నువ్వు తొంగిచూస్తావ్.. పాల వెన్నెల్లో నీ రూపం కన్పిస్తుంది. నీ చుట్టూ నిర్మలమైన సౌందర్యం ఆవరించు కుని వుంటుంది.. నేను ఎక్కడున్నానో ఇ ప్పుడు అర్థమైంది. నేను వున్నది నీలోనే!" అన్నాడు ఆమె నడుంచుట్టూ చెయ్యి బిగించి దగ్గరకు తీసుకున్నాడు.

అతని కౌగిలిలో గువ్వ పిట్టలా ఒదిగిపో యింది పంచదార చిలుక.

"ఇంత మోహాన్ని ఇన్నాళ్ళూ ఎందుకు దాచుకున్నావ్? " అడిగాడు ఆమె పెద వుల్ని ముద్దుపెట్టుకుని.

"ఈ శుభ సమయంలోనే హృదయంలో ప్రేమగీతం పలికింది. అందుకు మీకు దగ్గ రగా జరిగింది" అంది అతన్ని హత్తుకు పోతూ.

ఆడపిల్ల పంచదార బొమ్మ! ప్రేమిస్తే ఆ తియ్యదనం ఏమిటో తెలుస్తుంది!

వాళ్ళిద్దరిపై పున్నాగపూల జల్లు కురి సింది.




**ఘ**టికాచలం పెద్ద ప్లాన్‌లో వున్నాడు.

ఇబ్రహీం వొచ్చి కేజి కొకైన్ ఇచ్చివె ళ్ళాడు. అప్పుడప్పుడు అతను వొచ్చి బ్రౌన్ షుగర్, కొకైన్, హెరాయిన్ ఇచ్చి వెళ్తూ వుంటాడు. చిన్న చిన్న ప్యాకెట్లలో ప్యాక్ చేసిన డ్రగ్స్‌ను తను సంపన్నులకు అంద చెయ్యాలి. వాళ్ళిచ్చిన డబ్బు తీసుకుని తన కమీషన్ మినహాయించుకుని మిగతా పైకం ఇబ్రహీంకు ఇచ్చెయ్యాలి.

ఎక్కడా ఏ తేడా రాకూడదు.

ఇబ్రహీం డ్రగ్ తనకు సరఫరా చేస్తు న్నట్లు ఎక్కడా మాట దొర్లకూడదు, అంతా సీక్రెట్‌గా జరిగిపోవాలి! పోలీసులకు చిక్కినా ఎటువంటి పరిస్థితుల్లోను తనకు ఏ ముఠా సరఫరా చేస్తున్నది చెప్పకూ డదు.

చిల్లర మల్లర వ్యక్తులకు డబ్బుకు ఆశ పడి డ్రగ్స్ అమ్మకూడదు.

సంపన్నుల పిల్లలను, సినిమావాళ్ళను, బిజినెస్ చేసేవాళ్ళను టార్గెట్‌గా చేసుకో వాలి. రిస్క్‌తో కూడిన వ్యవహారమే! కష్ట పడితే లక్షల్లో ఆదాయం!

అతనికో ఆలోచన వొచ్చింది. ఆకాష్‌ను

పట్టుకుంటే తనపని సులువవుతుంది. అతనికి హై సర్కిల్‌లో కాంటాక్ట్స్ వున్నాయి.

స్నానం చేసి హాల్లోకి వొచ్చింది రవళి.

రవళి ద్వారానే ఆకాష్‌కు మాదక ద్రవ్యాలు అలవాటు చేశాడు. డ్రగ్స్ పిచ్చిలో పడిపోయాడు. రవళి ఏది చెబితే అది చేసే పరిస్థితిలో వున్నాడు ఆకాష్.

దీపం వుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి!

ఆకాష్ తన భార్య పిచ్చిలో వున్నప్పుడే తను అనుకున్న పని పూర్తి చేసుకోవాలి!

"హోటల్ వనప్రియకు వెళ్దాం!" అన్నాడు ఘటికాచలం.

"ఎందుకు? " అడిగిందామె.

"హోటల్‌కు వెళ్ళేక ఆకాష్‌తో సరదాగా గడుపు"

"నన్ను ఎరగా వేసి నీ పబ్బం గడుపుకుంటున్నావ్... నా ఖర్చులకు అడిగితే డబ్బు ఇవ్వవ్" అందామె కోపంగా..

ఆమెను అనునయించే ప్రయత్నం చేస్తూ "నేను కష్టపడి సంపాదించేది నీ కోసమే గదా! నువ్వు తప్పితే నాకు ఎవరున్నారు? భర్త చెప్పినట్లు భార్య నడుచుకోవాలి" అన్నాడు ఆమె బుగ్గలు సుతారంగా నిమురుతూ.

"భార్య! కట్టుకున్న భార్య!" గొణుక్కుంది రవళి.

ప్రేమించినవాడిని నమ్ముకుని హైద్రాబాద్ వొచ్చేసింది, అమ్మానాన్నలకు చెప్పకుండా.

మలక్‌పేటలో కాపురం పెట్టారు. పట్టుమని పది నెలలు సాగలేదు తమ కాపురం.

ఏదో షాపింగ్‌మాల్‌లో పనిచేస్తున్నానని చెప్పేవాడు. అతనికి వొచ్చే జీతం సరిపొయ్యేది కాదు సంసారం నడపడానికి. తాగుడు అలవాటయ్యింది. తాగొచ్చి ఇంట్లో అల్లరి చేసేవాడు. కొట్టడం మొదలుపెట్టాడు.

అతని ఆగడాలు భరించలేక ఇల్లువొదిలి పారిపోయి సికింద్రాబాద్ రైల్వేస్టేషన్‌కు చేరుకుంది.

అక్కడ కలిశాడు ఘటికాచలం.

"నేను డాక్టర్ని... ఇంకా పెళ్ళి కాలేదు... సొంత అపార్టుమెంటు వుంది. నీకు ఏ ఇబ్బంది లేకుండా చూసుకుంటాను... వెళ్దాం పదా! చీకటి పడుతుంది!" అన్నాడతను.

బతుకులో చీకట్లు ఎప్పుడో ముసురుకున్నాయి.

చీకటికి భయపడే మానసిక స్థితి లేదు.

అతన్ని అనుసరించింది. అతను డాక్టరు కాదు. పేషంట్లకు మందులివ్వడం ఎప్పుడూ చూడ్లేదు. మత్తుమందులు ఇస్తూ వుంటాడు. అతడు వుండే అపార్ట్‌మెంట్ కూడా సొంతం కాదు. అద్దెకు వుంటున్నాడు. ఐదారు నెలలకు ఇల్లు మార్చుతూ వుంటాడు.

"ఎందుకు ఇల్లు మార్చడం? " అడిగిందో సారి.

"పోలీసులతో గొడవ... మాటిమాటికీ ఇంటిమీద పడతారు" అనేవాడు.

కొత్త టెక్నిక్ నేర్చుకున్నాడు. సంపన్నులతో పరిచయం పెంచుకోమని ప్రోత్సహించేవాడు. వాళ్ళకు తన ద్వారా డ్రగ్స్ అలవాటు చేయించేవాడు. వాళ్ళతో విచ్చలవిడిగా తిరిగినా ఏమనేవాడు కాదు.

ఆకాష్ తనూ మొదటిసారి కలిసినప్పుడు అతని వివరాలు తెలుసుకుని ఎంతో సంతోషపడ్డాడు. "బంగారు పిచ్చుకను పట్టావ్! వొదలొద్దు" అని తమ పరిచయం పెరిగేటట్లు చేశాడు. తనతో పాటు ఆకాష్ అపార్టుమెంటులో వుండటం గమనించి అతన్ని బ్లాక్‌మెయిల్ చేసి డబ్బు కూడా గుంజాడు లక్షల్లో.

ఆకాష్‌తో మధురబంధం అపురూపంగా

అంతరంగాన నిలిచిపోయింది. అతనితో ఎక్కువ సమయం గడపడానికే ఇష్టపడు తుంది...

"ఏమిటి ఆలోచిస్తున్నావ్? ఫోన్ చెయ్యి" గట్టిగా అన్నాడు ఘటికాచలం ఆమె ఆలోచనలను చెదరగొడుతూ.

ఆకాష్‌కు ఫోన్‌చేసి హోటల్ అడ్రెస్ చెప్పింది.

గంటలో అక్కడ వాలిపోతానన్నాడ తను.

ఘటికాచలం భద్రంగా చిన్న బ్యాగ్ పట్టుకోవడం గమనించి "అందులో ఏముంది? " అడిగిందామె.

"కోటి రూపాయలున్నాయి" అన్నాడ తను.

"చేతిలో కోటి రూపాయలుంటే ఆ హోటల్ చుట్టూ, రిసార్టుల్లో తిరగడం ఎందుకు? ఇంట్లో వుండిపోవచ్చు గదా!" అడిగిందామె.

"కోటి రూపాయలు ఖరీదు చేసే కొకైన్ ఈ బ్యాగ్‌లో వుంది. ఒక్క డోసు కొకైన్ అంటే.. ఒక్క గ్రాము కొకైన్ ఖరీదు ఐదు వేలు వుంటుంది. మనం ఈ బ్యాగ్ ఆకాష్‌కు అందచేసి అతని దగ్గర నుంచి కోటి రూపాయలు వసూలు చెయ్యాలి!"

"అతను ఒప్పుకుంటాడా? "

"ఆకాష్ డ్రగ్ ఎడిక్ట్ అయ్యాడు. అతనికి రెగ్యులర్‌గా డ్రగ్స్ సప్లై చేస్తోంది మనమే! మన మాట వినకపోతే డ్రగ్స్ సప్లై చెయ్యం... ఒక్కసారి వీటికి అలవాటుపడ్డ వాడు అవి దొరక్కపోతే పిచ్చెక్కిన వాడిలా తిరుగుతాడు... వాటికోసం దేనికైనా తెగి స్తాడు" అన్నాడతను తనలోతాను నవ్వు కుంటూ.

మనిషి అసలే లావు. పైకి కన్పించ కుండా తనలో తాను నవ్వుకుంటూ వుంటే ఒళ్ళంతా కదిలిపోతుంది.

అంతరాంతరాల్లో ఆకాష్ అంటే ప్రేమ వుందామెకు. అతనీ పరిస్థితికి దిగజారడా నికి కారణం తానే! తనే అతనికి డ్రగ్స్ అలవాటు చేసింది.

వ్యాపారాల్లో నుంచి నయనిక తనను పక్కకు తప్పించేసిందని బాధ పడ్డాడు. ఆమె తనను పెళ్ళి చేసుకుంటుందని ఆశ పడ్డాడు. అదీ జరగకపోవడంతో డిప్రెష న్‌లో వుంటే తను అతనికి డ్రగ్స్ అల వాటు చేసింది.

అన్నీ మర్చిపోయి ఆనందలోకంలో విహరించే మార్గం చూపించింది.

సినిమా హాలు దగ్గర పరిచయం అయిన ఆమెను చాకచక్యంగా బుట్టలో

## కొత్తగాలి...



**ఎక్కడ నుండీ**
**పరిమళం!**
**గమనించలేదా**
**'కొత్తగాలి' వీస్తోంది**

– భానుమూర్తి,
హైదరాబాద్

వేసుకున్నానని అనుకున్నాడతను. ఆకాషే ఆమె విసిరిన వలలో చేపలా చిక్కుకు న్నాడు.

ఇప్పుడు ఆమె ధ్యాస తప్పితే మరొకరు గుర్తుండటం లేదు.

అతను వలలో చిక్కుకుని విలవిల్లాడు తుంటే ఆమెకు అతని పట్ల జాలి కలు గుతూ వుంది.

"అతన్ని వొదిలెయ్యి... మరొకరికి అమ్ముకో నీ దగ్గరున్న స్టఫ్‌ను" అందామె.

ఘటికాచలానికి కోపం వచ్చింది.

"పిచ్చిపిచ్చి వేషాలు వెయ్యకు... అత నంత సౌండ్ పార్టీ మరొకడు మనకు ఎక్కడ దొరుకుతాడు? చెప్పిన టైంకు

కొకైన్ అమ్మి డబ్బు ఇబ్రహిం చేతిలో పెట్ట కపోతే నా పీక పిసికేస్తాడు... నోరు మూసుకుని చెప్పినట్లు చెయ్యి! మరో విషయం... అతనికి నీ మీద మోజు వున్నప్పుడే ఒకటో రెండో కోట్ల ఆస్తి నీ పేరు మీద రాయించుకో! జీవితాంత నీకు ఏ ఇబ్బందులు లేకుండా రోజులు గడిచిపో తాయి... వొక్కసారి ఆస్తి మన చేతిలోకి వొచ్చేక నేను మాదక ద్రవ్యాల వ్యాపారం కూడా మానేస్తాను... నువ్వు చెప్పినట్లు వింటాను... నేను ఏ పని చేసినా నీ శ్రేయస్సు కోరే చేస్తాను... నువ్వు తప్పితే నాకెవ్వరూ లేరు!" అన్నాడతను ఆమె సమాధానం కోసం ఎదురు చూడకుండా బయటకు నడుస్తూ.

## 13



**సి**టీ అవుట్ స్కర్ట్స్‌లో వుంది హోటల్ వనప్రియ.

అడివిలా వుండే ప్రదేశంలో ఎత్తైన రాతి గుట్ట మీద కట్టిన నాలుగు అంతస్తుల భవనం అది. హోటల్‌కు ముందువైపు విశాలమైన పచ్చటి లాన్ వుంది. వరు సల్లో పూల మొక్కలు గాలికి కదులుతూ వున్నాయి. ఒక విధమైన హాయి గొలిపే వాసన ఆ ప్రాంతమంతా ఆవరించి వుంది. హోటల్‌కు వెనుక పక్క స్విమ్మింగ్‌పూల్ వుంది. పక్కనే మసాజ్ సెంటర్ వుంది.

మూడో అంతస్తులో హైప్రొఫైల్ గెస్ట్స్ కోసం మరో స్విమ్మింగ్‌పూల్ వుంది.

"ఈ రిసార్ట్ హోటల్‌కు పెద్ద పెద్ద వాళ్ళు వొస్తారు... పోలీసుల నిఘా వుండదు... అందుకే మన ఆపరేషన్‌కు ఈ హోటల్ సెలెక్ట్ చేశాను" అన్నాడు ఘటికాచలం రవళితో.

గ్రౌండ్‌ఫ్లోర్‌లో రిసెప్షన్‌కు ఎదురుగా వున్న ఎ.సి. లాంజ్‌లో కుర్చున్నారు వాళ్ళి ద్దరూ, ఆకాష్ కోసం ఎదురుచూస్తూ.

"ఇక్కడ కూర్చోవడం ఎందుకు? సూట్ తీసుకుని ఆకాష్ కోసం వెయిట్ చెయ్య వచ్చు గదా!" అంది రవళి.

"పిచ్చిదానా... మన పేరు మీద ఏ ట్రాన్సాక్షన్ జరుగకూడదు... అన్నీ ఆకాష్ పేరు మీదే జరగాలి.. మనం ఏ విష యంలో ఇన్వాల్వ్ అవకూడదు!" నవ్వుతూ అన్నాడతను.

ఆకాష్ వొచ్చాడు. "ఇక్కడ కూర్చున్నారే మిటి? సూట్ తీసుకోలేదా? " అడిగేడు.

"క్రెడిట్ కార్డ్ మర్చిపోయి వొచ్చాను... జేబులో పెద్దగా క్యాష్ కూడా లేదు" అన్నాడు ఘటికాచలం.

రిసెప్షన్ కౌంటర్ దగ్గరకు వెళ్ళాడు ఆకాష్.

"నేను చెప్పినట్లు చెయ్యాలి! అతన్ని ఎలా ఒప్పిస్తావో? క్యాష్ విషయం నేను మాట్లాడుతాను... ఏదో పని వుందని చెప్పి నేను వెళ్ళిపోతాను... సాయంత్రం వొస్తాను... జాగ్రత్తగా అతన్ని టాకిల్ చెయ్యి... మన పని పూర్తి అయ్యేంత వరకూ డ్రగ్స్ జోలికి పోకండి ఇద్దరూ! అతనితో అన్ని విషయాలూ తీరిగ్గా మాట్లాడాక నాకు ఫోన్ చెయ్యి... రెక్కలు కట్టుకుని వొచ్చి వాలిపోతాను" అన్నాడు ఘటికాచలం.

'అతను ఎంత తొందరగా తనను ఒదిలి వెళ్ళిపోతే అంత మంచిది' అనుకుంది

మనస్సులో. తన దగ్గరున్న చిన్న బ్యాగ్ ఆమెకు ఇచ్చాడు.

ఆకాష్ సూట్ బుక్ చేసి వొచ్చాడు వాళ్ళ దగ్గరకు.

"లాంజ్‌లో ఎందుకు? సూట్‌లోకి వెళ్ళి మాట్లాడుకుందాం పదండి" అన్నాడు ఆకాష్.

"నాకు అర్జెంటు పని వుంది. రవళి నీకు కంపెనీ ఇస్తుంది... నేను సాయంత్రం వొచ్చి కలుస్తాను" అనేసి హడావుడిగా వెళ్ళిపోయాడు ఘటికాచలం.

సూట్‌లోకి వెళ్ళారిద్దరూ. రిచ్ లుక్ వున్న ఆ సూట్ చూసి సంబరపడింది రవళి.

"సూట్‌కేస్‌లో బట్టలు తెచ్చుకున్నట్ల యితే బాగుండేది. ఈ రిసార్ట్ నాకు బాగా నచ్చింది. ఇక్కడే రెండు మూడు రోజులు వుండాలనిపిస్తోంది" అందామె.

"ఎన్ని రోజులు ఇక్కడ వుండాలను కుంటే అన్ని రోజులు వుండు. ఆ ఏర్పాట్లు చేస్తాను... దగ్గర్లో వున్న షాపింగ్‌మాల్‌కు వెళ్దాం... నీకు నచ్చిన చూడీదార్, డ్రెస్, జీన్స్, చీరలు కొనుక్కో! హేపీగా వుండు" అన్నాడతను ఆమె దగ్గరకు వొచ్చి నడుం చుట్టూ చెయ్యి బిగించి.

"కొత్త బంగారు లోకంలోకి తీసుకువెళ్ళే డ్రగ్ ఏమన్నా తెచ్చావా? " అడిగాడు.

"కావాల్సినంత వుంది స్టఫ్... కేజీ పట్టు కువొచ్చాను.. నీక్కావాలంటే మొత్తం నువ్వే తీసేసుకో!" అందామె.

వో గ్రాము కొకైన్ ప్యాకెట్ విప్పదీ శాడు. ప్యాకెట్ సీల్ తీయగానే డ్రగ్ ఆవి రైపోతూ వుంది పొగలు కక్కుతూ. ఆ పొగను సన్నటి గొట్టంతో ముక్కులోకి పీల్చుకున్నాడు. ఘాటుగా తగిలింది వాసన.

"అద్భుతం... స్వర్గంలో వున్నట్లుంది. రంభలా కన్పిస్తున్నావ్ నువ్వు" అన్నాడు మత్తుగా.

అతని కౌగిట్లో వొదిగిపోయింది.

ఆమె మెరుపు, నాజూకుతనం అతనికి ఇష్టం.

నడుం వొంపుసొంపులు, ఊరువుల సౌందర్యం అతన్ని మరింత పిచ్చివాడిని చేశాయి.

ఆమె శరీరం వరద గోదావరిలా పొంగింది. ఒళ్ళు సెగలు పొగలై కాలిపో యింది.

అతని చేతులు నడుం కిందిభాగంలో కదులుతుంటే పకపకానవ్వింది.

'ఈ జన్మలో తన అందాలు ఆకాష్‌కు అందించకపోతే వొచ్చే జన్మలో కురూపిన్నై పుడతానేమో!' అనుకుందామె.

అతన్ని కవ్వించింది, నవ్వించింది, ఉడి కించింది.

ఆ శృంగార రసాధిదేవత కౌగిట్లో కరిగి పోయాడు.

సాయంత్రం వరకూ గది తలుపులు తీయకుండా రసగంగలో మునిగిపోయారి ద్దరూ.

★ ★ ★

రూమ్ బాయ్‌కి రాత్రి ఎనిమిదింటికి గుర్తుకువొచ్చింది.

సూట్ నెంబరు తొమ్మిదికి మీల్స్‌ప్లేట్లు సూట్‌లోనే పెట్టివొచ్చాడు. భోజనం చేసేక ఖాళీప్లేట్లు తీసుకువెళ్లమని బజర్ నొక్క లేదు.

మీల్స్‌ప్లేట్లు తీసుకువొద్దామని డోర్ నాక్‌చేసి సూట్ లోపలికి వెళ్ళాడు.

లోపల కన్పించిన దృశ్యం చూసి నిర్ఘాం తపోయాడు.

రవళి బెడ్‌మీద అచేతనంగా పడుకుని వుంది. ఆకాష్ ఫ్లోర్‌మీద బోర్లాపడుకుని వున్నాడు.

"సార్... సార్... మేడమ్... మేడమ్" అంటూ నాలుగైదుసార్లు పిలిచేడు. వాళ్ళ

నుంచి సమాధానం లేదు. కదలికలు లేవు.

ఆకాష్ ఏదో మత్తులో జోగుతున్నట్లు.. కొంచెం కదిలినట్లు అన్పించింది. ఆమె అయితే చనిపోయి వుంటుందనుకున్నాడు, ఆ పడుకున్న తీరుచూసి. వొంటిమీద బట్టలు సవ్యంగా లేవు. ఆమె చేతిని తాకి చూశాడు. చల్లగా మంచుగడ్డలా అన్పించింది.

భయమేసి రూములోనుంచి బయటకు పరుగెత్తుకొచ్చి హోటల్ మేనేజర్‌కు చెప్పాడు. అతనుకూడ రూములోకి వొచ్చి ఆమె చనిపోయిందని రూఢీ చేసుకున్నాక రూరల్ డిసిపికి, హయత్‌నగర్ ఎస్సైకి ఫోన్ చేసి చెప్పాడు.

అరగంటలో పోలీసు జీప్‌లో డిసిపి, ఎస్సై, నలుగురు కానిస్టేబుల్స్ హోటల్‌కు చేరుకున్నారు.

"సహజంగా చనిపోయి వుంటుందా? హత్య చేయబడిందా సార్? " అడిగాడు హోటల్ మేనేజర్.

"ఇప్పుడిప్పుడే ఏం చెప్పలేం? ఆమె బాడీని పోస్ట్‌మార్టమ్ చేయాలి. రిపోర్టు వొచ్చేకగాని ఏ విషయం తెలియదు" అన్నాడు డిసీపి.

చిన్న బ్యాగ్‌లో కన్పించిన డ్రగ్స్ ప్యాకెట్ తెచ్చి డిసీపికి చూపించాడు కానిస్టేబుల్. ఆ టాబ్‌లెట్స్ ఏమిటో అర్థంకాలేదు డిసీపికి కొన్ని క్షణాలు.

"ఇవేవో మాదకద్రవ్యాల్లా వున్నాయి... శాంపిల్స్ ఫోరెన్సిక్ లాబ్‌కు పంపించండి పరీక్షలకోసం" అన్నాడతను యస్సైతో.

మరేవైనా ఆధారాలు దొరుకుతాయోనని సూట్ అంతా గాలించారు. డబుల్‌కాట్‌కు, పరుపుకు మధ్య వున్న గ్యాప్‌లో పడి వున్న టైటాన్ వాచిని సేకరించారు.

ఫొటోలు, వేలిముద్రలు తీసుకున్నాక హోటల్ మేనేజర్, రూమ్‌బాయ్ స్టేట్‌మెంట్స్ తీసుకున్నారు. పంచనామా జరిపించాక డెడ్‌బాడీని తీసుకువెళ్ళారు పోలీసులు. ఆకాష్‌ను కస్టడీలోకి తీసుకున్నారు.

★ ★ ★

మరుసటి రోజు ఉదయం పోలీస్‌స్టేషన్లో ఆకాష్‌ను ఎదురుగా కూర్చోబెట్టుకుని ప్రశ్నించడం మొదలుపెట్టాడు డీసిపి విశాల్.

"మీ పేరు, వివరాలు, మీ గురించి చెప్పండి? " అడిగాడు విశాల్.

"ఆకాష్... మొన్నీమధ్య వరకూ వసుధ గ్రూఫ్ ఆఫ్ కంపెనీస్‌కు యం.డి.ని. బిజినెస్‌మాన్... పారిశ్రామికవేత్తలలో నా పేరు ప్రముఖంగా విన్పిస్తుంది" అన్నాడు ఆకాష్ చక్కటి ఇంగ్లీషులో.

సొసైటీలో అతని స్టేటస్ ఏమిటో అర్థం అయిపోయింది డి.సి.పి.కి. అతన్నుంచి సమాచారం రాబట్టడానికి థర్డ్‌డిగ్రీ మెథడ్స్ ఉపయోగించకూడదనుకున్నాడు.

"హోటల్లో సూట్ మీ పేరు మీద బుక్ అయ్యింది... మీతోపాటు సూట్‌లో వున్న అమ్మాయి ఎవరు? ఆమెకు మీకు ఉన్న సంబంధం ఏమిటి? "

"ఆమె పేరు రవళి... నా గర్ల్‌ఫ్రెండ్" దాచుకోకుండా స్పష్టంగా చెప్పేశాడు.

"రవళిని ఎందుకు హత్య చేశారు? " అడిగాడు డి.సి.పి.

అప్పటికింకా పోస్ట్‌మార్టమ్ రిపోర్టు రాలేదు. ఇంటరాగేషన్‌లో అటువంటి ప్రశ్నలు వేసి అనుమానితుడి నుంచి వివరాలు రాబట్టడం పోలీసులకు అలవాటు.

బిత్తరపోయాడు ఆకాష్.

"రవళి చనిపోయిందా? " నమ్మశక్యం కావడం లేదతనికి.

"అసలేం జరిగిందో చెప్పండి. ఏదో ఆవేశంతో ఆమెను చంపేశాను అని మీరు ఒప్పుకుంటే యావజ్జీవ శిక్ష పడుతుంది. వాస్తవం చెప్పకుండా మీరు దాచేస్తే యువ





# జల'నిధి'ని వెలికితీసే కంపెనీ



బ్రిటన్‌లో ఒడిస్సా అనే కంపెనీ సముద్రంలో ఎన్నడో మునిగిపోయిన ఓడలను కనిపెట్టి, వాటిలోని విలువైన వస్తువులను వెలికి తీస్తుంది. సెప్టెంబర్ 2011లో ఆ కంపెనీ ఉత్తర అట్లాంటిక్ సముద్రంలో ఫిబ్రవరి 1941లో మునిగిపోయిన ఎస్ఎస్ గెయిర్‌సొప్పా అనే ఓడని వెదికి కనిపెట్టింది. అప్పట్లో జర్మన్లు ఆ ఓడను ముంచేసారు. 412 అడుగుల పొడవు గల ఆ ఓడ 48 టన్నుల వెండి ఇటుకల్ని తీసుకెళుతుండింది. ఆ కంపెనీకి చెందిన సిబ్బంది సముద్రంలో మూడుమైళ్ల లోతున మునిగిన ఓడ అవశేషాలను అనేక శాస్త్రీయ పరిశోధనలు చేసి కనిపెట్టారు. అంతేకాదు, 2703 ఇటులకను వారు వెలికి తీసారు. అయితే వారికి ఎక్కడా ఆ ఓడలోని సిబ్బంది కళేబరాలు కనపడలేదు. ఒకవేళ మృతదేహాలు కనిపిస్తే వాటిని అత్యంత గౌరవంగా వెలికి తీయాలనే నిబంధన కూడా ఉంది. ఆ ఓడను వార్ రిస్క్ ఇన్సూరెన్స్ ప్రోగ్రాం కింద బీమా చేయడంతో ఆ మొత్తాన్ని ఓడ యాజమాన్యానికి బీమా కంపెనీ అప్పుడే చెల్లించింది. దాంతో అందులోని సరకుకు ఆ కంపెనీ చట్టబద్ధమైన యజమాని అయింది. ఒడిస్సా మెరైన్ ఎక్స్‌ప్లొరేషన్‌కు వెండిని వెలికి తీసే పనిని ఆ ఇన్సూరెన్స్ కంపెనీనే అప్పగించింది. వెలికి తీసిన సరకులోని ఎనభై శాతం ఒడిస్సా కంపెనీకి, ఇరవై శాతం ఇన్సూరెన్స్ కంపెనీకి చెందాలని ముందే ఒప్పందం కుదిరింది. ఏప్రిల్ 2011లో ఒడిస్సా సిబ్బంది మునిగిపోయిన ఈ ఓడకోసం వేట ఆరంభించారు. చివరికి సెప్టెంబరులో దాన్ని కనుగొన్నారు. ఇప్పుడా ఒడిస్సా కంపెనీకి బ్రిటిష్ ప్రభుత్వం ఎస్ఎస్ మంటోలా అనే ఓడను కనుగొని, అందులోని ఆరులక్షల బస్తాల వెండిని వెలికి తీసే పని అప్పగించింది. ప్రభుత్వ వెండిని తీసుకెళ్లే ఆ ఓడ కూడా రెండువందల ఏళ్ల క్రితం మునిగిపోయింది.




తిని దారుణంగా చంపినందుకు మీకు ఉరిశిక్ష పడుతుంది" బెదిరిస్తూ అడిగాడు.

"రవళి అంటే నాకు ఇష్టం. అప్పుడప్పుడూ ఇద్దరం కలుస్తూవుంటాం"

"ఆమె భర్తకు ఈ విషయం తెలుసా? "

"ఆమె భర్త పేరు ఘటికాచలం... అతనే ఆమెను తీసుకువచ్చి హోటల్ దగ్గర వొదిలి వెళ్ళిపోయాడు... ఆమె నాతో గడుపుతున్నందుకు నా దగ్గర డబ్బు కూడ పెద్దమొత్తంలో వసూలు చేస్తుంటాడు"

ఆకాష్ చెబితే ఘటికాచలం ఇంటి అడ్రస్, ఫోన్ నెంబర్ నోటు చేసుకున్నాడు ఎస్సై.

"ఇప్పుడు చెప్పండి నిన్న ఏం జరిగిందో? " మళ్ళీ అడిగాడు.

"రవళి, నేనూ ఆనందంగా గడిపాం... నాకు బాగా నిద్రమత్తు వొచ్చింది... బెడ్ మీద పడుకున్నానో... ఫ్లోర్ మీద పడుకున్నానో గుర్తులేదు. ఎవరో నన్ను కొడుతున్నట్లు అన్పించింది. ఆ తర్వాత ఏం గుర్తులేదు"

డి.సి.పి. విశాల్ పరీక్షగా ఆకాష్‌కేసి చూశాడు. ఒంటిపై నల్లటి చారలు కదుములు కట్టినట్లుగా కన్పించింది.

'చిత్తుగా తాగి ఏ గోడకో, డబుల్ కాట్ కో గుద్దుకుని వుంటాడు అందుకే ఆ చారలు ఏర్పడ్డాయి... ఇప్పుడేదో స్టోరీ అల్లుతున్నాడు' అనుకున్నాడు మనస్సులో.

పోస్టుమార్టమ్ రిపోర్టు, ఫోరెన్సిక్ నిపు

ఖల రిపోర్టు రాకముందు ఎక్కువగా ఇంటరాగేషన్ చేసినా ప్రయోజనం వుండదని ఆకాష్‌ను తనగదిలో నుంచి తీసుకెళ్ళమని పోలీసులకు సైగ చేశాడు.

★ ★ ★

ఇన్‌స్పెక్టర్ రంగస్వామి రవళి భర్త ఘటికాచలాన్ని మార్చురీకి తీసుకువెళ్ళి ఆమె శవాన్ని ఐడెంటిఫై చెయ్యమన్నాడు.

చనిపోయిన స్త్రీ తన భార్యేనని నిర్ధారణ చేశాడు ఘటికాచలం. అతన్ని పోలీస్‌స్టేషన్‌కు తీసుకువొచ్చాడు ఇన్‌స్పెక్టర్.

"రవళి మీ భార్య కదూ!" అడిగాడు డి.సి.పి.

పెద్దగా ఏడ్చేశాడు ఘటికాచలం.

"ఏడిచే మగవాళ్ళని పోలీసులు నమ్మరు... ఏదీ దాచకుండా నిజం చెప్పు... చనిపోయిన రోజు నీ భార్యని నువ్వే హోటల్ దగ్గర వొదిలేసిపోయావట గదా! ఎందుకలా చేశావ్? " అడిగాడు విశాల్.

"రవళి ఆకాష్‌తో తిరుగుతోందని తెలిసి మందలించడానికి వెళ్ళాను సార్! మూర్ఖంగా నేను చెప్పేది వినకుండా అతనితోనే వుంటానని మొండికేస్తే తిరిగి వొచ్చేశాను. భార్య చనిపోయిందని తెలిసి బాధపడుతున్నాను. ఎవరికీ ఎటువంటి అపకారం చేసేది కాదు. అందరితో నవ్వుతూ మాట్లాడేది... చిన్న వయస్సులోనే నిండు నూరేళ్ళు నిండిపోయాయి" అన్నాడతను ఏడుపు గొంతుతో.

"నీ సెల్‌ఫోన్ వోసారి ఇవ్వు"

తన సెల్‌ఫోన్ ఎందుకు అడుగుతున్నాడో అర్థంకాలేదు ఘటికాచలానికి. తటపటాయిస్తూ జేబులోని ఫోన్ డి.సి.పి.కి ఇచ్చాడు.

కాల్‌లిస్ట్ వెతికాడు. రిసీవ్డ్ కాల్స్ లిస్ట్‌లో రవళి నుంచి కాల్ సాయంత్రం ఐదు గంటలకు రిసీవ్ చేసుకున్నట్లు వుంది.

"మీ ఆవిడ చనిపోయిన రోజు సాయంత్రం ఐదింటికి నీతో మాట్లాడిందా? ఏం మాట్లాడింది? "

నీళ్ళు నమిలాడు ఘటికాచలం.

"రాత్రికి ఆకాష్‌తోనే వుండిపోతానంది... నాకు కోపం వొచ్చి సెల్‌ఫోన్ ఆఫ్ చేశాను" అన్నాడతను.

కాల్ డ్యూరేషన్ పదినిముషాలకు పైగా వుంది. ఘటికాచలం చెప్పేది నమ్మలేదు డి.సి.పి. 'కేసులో ఇరికిస్తారని భయపడుతున్నాడులే' అనుకున్నాడు డి.సి.పి.

"సర్లే, నువ్వెళ్ళు. మళ్ళీ ఇన్వెస్టిగేషన్‌కు నువ్వు అవసరమైతే పిలిపిస్తాను"

"సార్... నా సెల్‌ఫోన్"

"మా దగ్గర వుండనీ... ఇన్వెస్టిగేషన్ పూర్తయ్యేక ఇచ్చేస్తాం!" అన్నాడు డి.సి.పి.

భయపడిపోయాడు ఘటికాచలం. అతను భయపడుతుంది కేసులో తనను ఇరికిస్తారని కాదు, అందులో డ్రగ్స్ అమ్మే ఇబ్రహిం ఫోన్ నెంబరు వుంది. 'పోలీసులు సామాన్యులు కాదు... ఆవులిస్తే పేగులు లెక్కపెడతారు' అనుకుంటూ పోలీస్‌స్టేషన్ నుంచి బయటకు వొచ్చేశాడు.

★ ★ ★

ఆకాష్‌ను పోలీసులు అదుపులోకి తీసుకుని పోలీస్‌స్టేషన్లో వుంచారని తెలిసి తల్లడిల్లిపోయింది కమలాంబ.

ఓదార్చే ప్రయత్నం చేసింది నయనిక.

"సిటీలో బాగా పేరున్న లాయర్ విశ్వనాథ్‌తో మాట్లాడేను అత్తయ్యగారూ! ఆయన ఆకాష్‌తో కూడ మాట్లాడేడట. పోలీసుల అనుమతి తీసుకుని బెయిల్ పిటీషన్ మీద ఆకాష్ సంతకాలు తీసుకుని కోర్టులో ఫైల్ చేయబోతున్నాడు... మీరేం కంగారు పడకండి... ఆకాష్‌ను విడిపించే ప్రయత్నం చేద్దాం అతనేం తప్పు చెయ్యక

పోతే!" అంది నయనిక.

"మావాడికి సంపదమీద వ్యామోహం వుందికాని హత్యలు చేసేటంత క్రూరుడు కాదమ్మా! ఇంట్లో పనివాళ్ళు బంగారు వస్తువులు, డబ్బు తస్కరించినా వాళ్ళను ఏమనేవాడు కాదు... పనివాళ్ళకు ఏ అవ సరం వొచ్చినా డబ్బు సహాయం చేసి ఆదుకునేవాడు... మంచి మనస్సు వుంది కాని వ్యామోహాలు చంద్రుడిని నల్లటి మబ్బుల్లా కమ్మేస్తున్నాయి" అంటూ బాధ పడిందామె.

"పోలీస్ ఇన్‌స్పెక్టర్‌తో కూడ మాట్లా డేను అత్తయ్యా! రవళి అనే అమ్మాయి అనుమానాస్పద స్థితిలో మరణించిం దట... ఆ సమయంలో హోటల్లో మీ అబ్బాయి ఆమెతో పాటు వున్నాడు. ఆకాషే హత్య చేశాడని వాళ్ళేం చెప్పడం లేదు... మన ప్రయత్నం మనం చేద్దాం! ఆకాష్ నిరపరాధి అయితే తప్పకుండా ఈ కేసు నుంచి బయటపడతాడు" అంది నయనిక.




రవళి హత్యావార్త నగరంలో పెద్ద సంచలనం సృష్టించింది.

ఆ హత్యతో ప్రముఖ వ్యాపారవేత్త ఆకాష్ పేరు ముడిపడి వుండటంతో ఆ వార్త ప్రాముఖ్యం సంతరించుకుంది. అన్ని టి.వి ఛానల్స్, పేపర్లలో ఆకాష్ మీద కథ నాలు వొచ్చేయి. 'ఆడపిల్లల వేటగాడ'ని ఓ పత్రిక పతాక శీర్షిక పెట్టింది.

పోస్టుమార్టం రిపోర్ట్, ఫోరెన్సిక్ లాబ్ రిపోర్టు పట్టుకుని డి.సి.పి. దగ్గరకు వొచ్చాడు పోలీస్ ఇన్‌స్పెక్టర్ రంగస్వామి.

"సార్... మనం అనుమానించింది నిజ మైంది సార్! రవళిది సహజ మరణం కాదు. సఫోకేషన్‌తో ఊపిరి ఆడక చనిపో యింది. ఆ ఆకాషే మెత్తటి దిండును ఆ అమ్మాయి మొహంమీద వుంచి ఊపిరి ఆడకుండా చేసి చంపేసి వుంటాడు... హత్య జరిగే ముందు ఆ అమ్మాయిని అనుభవించినట్లు రిపోర్టులో వుంది... వెంటనే ఆకాష్ మీద ఛార్జ్‌షీట్ దాఖలు చేద్దాం సార్" అన్నాడు రంగస్వామి.

"ఆకాషే రవళిని హత్యచేసి వుంటాడని ఎలా చెప్పగలుగుతున్నావ్?" ఇన్‌స్పెక్టర్ని ప్రశ్నించాడు డి.సి.పి.

అయోమయంలో పడిపోయాడు ఇన్‌స్పె క్టర్. ఆకాష్ రవళిని హత్యచేశాడని టి.వి. ఛానళ్ళ వాళ్ళకు, పేపర్లకు లీక్ ఇవ్వమని చెప్పింది డి.సి.పి. గారే! మళ్ళీ ఇప్పుడు తననే ప్రశ్నిస్తున్నాడు...

"రవళి శరీరంపై, చీరపై సెమెన్ మర కలు వున్నాయి... సెమన్ 'బి' గ్రూపుకు చెందినది... ఆకాష్ వీర్య కణాలను డియ న్ఏ పరీక్ష చేశారు. అవీ 'బి' గ్రూపుకే చెందినవి. అతనే ఆ అమ్మాయిని అనుభ వించి హత్యచేసి వుంటాడు" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"అతను ఆ అమ్మాయిని హత్య చేశాడన టానికి గట్టి కారణం వుండాలి కదా!"

"ఏదో విషయంమీద వాళ్ళిద్దరి మధ్య వాగ్వివాదం జరిగి వుంటుంది. ఆ కో పంతో ఆమె మొహం మీద దిండు వుంచి ఊపిరి ఆడకుండా చేసి చంపేసి వుంటాడు" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"ఇన్వెస్టిగేషన్‌లో ఎప్పుడూ తొందరపడి

వో కన్‌క్లూజన్‌కు రాకూడదు. అన్ని కోణాల్లో కేసును పరిశీలించాలి... అన్ని అనుమానాలు నివృత్తి చేసుకున్నాకే ఎవరి మీద ఛార్జెస్ ఫ్రేం చేయాలన్న విషయంపై నిర్ధారణకు రావాలి" హితబోధ చేశాడు డి.సి.పి.

"సార్, మరో విషయం. మనం పంపిన డ్రగ్స్ శాంపిల్స్ ఫోరెన్సిక్ లాబ్ వాళ్లు పరీక్ష చేసి రిపోర్టు పంపారు. ఆ డ్రగ్ 'కొకైన్' అని తేల్చేశారు. ఆకాష్ మీద హత్యానేరం కింద ఐ.పి.సి. 320, నార్కోటిక్ డ్రగ్స్ యాక్ట్ కింద ఛార్జెస్ ఫ్రేం చేద్దాం సార్. అతను నిరపరాధి అయితే కోర్టులో నిరూపించుకుంటాడు. మనమెందుకు తలలు బద్దలు కొట్టుకోవడం" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

డి.సి.పి. విశాల్ మనస్సులో ఎన్నో ప్రశ్నలు ఉదయించాయి.

...ఆకాష్‌కు నేర ప్రవృత్తి ఉందా? ఇంతకు మునుపు అతని మీద ఏమైనా క్రిమినల్ కేసులున్నాయా? ...

... అతను డ్రగ్స్‌కు అలవాటు పడితే కొద్దిగా ఐదు గ్రాములో, పది గ్రాములో కొకైన్ వుండాలి. భారీ స్థాయిలో కొకైన్ ఆ హోటల్ గదిలో ఎందుకు వుంది? మాదక ద్రవ్యాలు అమ్మే వ్యాపారులతో అతనికి సంబంధాలు వున్నాయా?

ఆకాష్‌ను తన గదిలోకి తీసుకు రమ్మన్నాడు.

"కొకైన్ భారీగా మీ దగ్గర ఎందుకుంది? " అడిగాడు డి.సి.పి.

"కొకైన్ ఘటికాచలం తీసుకువొచ్చి అమ్మి పెట్టమన్నాడు. నాకు పెద్ద సర్కిల్ వుంది. నా ద్వారా కొకైన్ అమ్మకాలు జరిగితే ఎవరూ అనుమానించరని అతని ప్లాన్" తలొంచుకునే చెప్పాడు ఆకాష్.

... జీవితంలో ఎప్పుడూ తలొంచుకుని మాట్లాడి ఎరుగడు ఆకాష్. ముళ్ళదారిలో నడిచాడు కాబట్టే ముళ్ళు గుచ్చుకున్నాయి. వాస్తవాలు పోలీసులకు చెప్పి ఆ ముళ్ళను తొలగించుకోవాలి!

"ఘటికాచలానికి డ్రగ్స్ ఎవరు సరఫరా చేస్తారు? అతని వెనుక డ్రగ్స్ వ్యాపారం చేసే పెద్ద ముఠా వున్నట్లు వుంది"

"ఆ విషయాలు నాకు తెలియవు. ఆ వివరాలు ఎప్పుడూ నాకు చెప్పేవాడు కాదు" అన్నాడు ఆకాష్.

అతను వాస్తవాలే చెబుతున్నాడని నమ్మకం కుదిరింది డి.సి.పి.కి. ఆకాష్ బాడీ లాంగ్వేజ్ చూస్తుంటే హత్యలు చేసే నేరగాడిలా అన్పించలేదు.

"బెడ్ మీద ఈ వాచ్ పడి వుంది. మీదా? " టైటాన్ వాచీ చూపిస్తూ అడిగాడు డి.సి.పి.

"నాది ఇంపోర్టెడ్ వాచీ... ఆ వాచీ ఘటికాచలానిది" అన్నాడు ఆకాష్.

మరికొన్ని ప్రశ్నలు అడిగి ఆకాష్‌ను సెల్‌కు పంపించాడు డి.సి.పి.

★ ★ ★

రిపోర్టులు మరోసారి చదివాడు డి.సి.పి. విశాల్.

మరో క్లూ దొరికింది పోస్ట్‌మార్టమ్ రిపోర్టులో.

... బాగా బలంగా వున్న వ్యక్తి ఆ అమ్మాయి మీద పడి మొహం మీద దిండు లాంటి వస్తువుతో ఊపిరి ఆడనివ్వకుండా హత్య చేశారు...

ఆకాష్ మరీ అంత బలంగా కన్పించడు. వో అరవై కేజీల బరువు వుంటాడేమో!

"ఘటికాచలం ఎంత వెయిట్ వుంటాడు? " ఇన్‌స్పెక్టర్ రంగస్వామిని అడిగాడు విశాల్.

"తొంబై కేజీలకు తక్కువ వుండడు సార్. భారీ కాయం కదా!" సమాధానమిచ్చాడు.

నీడిల్ ఆఫ్ సస్పీషన్ ఘటికాచలం

మీద ఒరిగిపోయింది.

★ ★ ★

ఇబ్రహీం అంతర్జాతీయ స్థాయిలో మత్తు పదార్థాల వ్యాపారం చేస్తూ వుంటాడు.

తక్కువ సమయంలో పెద్దమొత్తం సంపాదించాలనే ఊహల్లో కొంతమంది వుంటారు. ఘటికాచలం ఆ తరహా వ్యక్తే! అందుకే ఇబ్రహీంకు ఏజెంటుగా పనిచేస్తూ వున్నాడు.

"నా డబ్బు ఎప్పుడిస్తావ్?" ఘటికాచలాన్ని అడిగాడు ఇబ్రహీం.

"ఏ డబ్బు?" అమాయకంగా అన్నాడు ఘటికాచలం.

"వారం రోజుల కిందట కేజీ కొకైన్ తీసుకున్నావ్ గదా! అప్పుడే మర్చిపోయావా?" కోపంగా అన్నాడు ఇబ్రహీం.

"ఆ కొకైన్ పోలీసులకు దొరికిపోయింది. నేనిప్పుడు పీకల్లోతు కష్టాల్లో వున్నాను. నా భార్య చనిపోయింది. ఇప్పుడు ఆ కొకైన్ ఖరీదు అడుగుతావేమిటి?"

"నీ నక్కవేషాలు నా దగ్గర కాదు. వారం రోజుల్లో నాకు రావాల్సిన కోటి రూపాయలు ఇవ్వకపోతే నువ్వు కూడా నీ భార్య దగ్గరకు టపా కట్టేస్తావ్!"

ఇబ్రహీం గొంతులోని కర్కశత్వానికి వొణికిపోయాడు ఘటికాచలం.

"ముందు నన్ను ఈ కేసుల్లో నుంచి బయటపడనీ"

నీ భార్యను ఆకాషే హత్య చేశాడని అన్ని పేపర్లలో పెద్ద అక్షరాల్లో వొచ్చింది గదా! నీకెందుకు భయం? నువ్వే చంపేశావా?" ఘటికాచలం కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగాడు ఇబ్రహీం.

ఏం సమాధానం చెప్పాలో అర్థం కాలేదు. నీళ్ళు నమిలేడు.

"కేసులో నుంచి బయటపడదామనుకుంటే ప్రతిదానికీ ఆ నయనిక అడ్డం వొస్తుంది"

"నయనిక ఎవరు?" అడిగాడు ఇబ్రహీం.

"పెద్ద ఇండస్ట్రియలిస్టు! ఆకాష్‌కు బంధువు. మనం కొకైన్ సప్లయి చేసింది ఆకాష్‌కే! అతనికి డైరీ రాసుకునే అలవాటుంది. ఆ డైరీ పోలీసులకు ఇచ్చింది... ఆ డైరీలో డ్రగ్స్ నేను సప్లై చేస్తున్నట్లు రాసేడేమోనని నా అనుమానం. ఆ డి.సి.పి. మహాఘటికుడు. ఆవులిస్తే పేగులు లెక్క పెడతాడు. మొన్న నా సెల్‌ఫోన్ తీసుకున్నాడు. దాన్లో నీ నెంబరు కూడా వుంది. నేనెవరికి కాల్ చేస్తున్నానో ఆ వివరాలన్నీ రాబడతాడు. మన మీద రైడ్ చేస్తాడేమోనని భయంగా వుంది"

ఇబ్రహీం మెదడులో ఏదో ఆలోచన మెరిసింది.

"నయనికను కిడ్నాప్ చేద్దాం! పెద్దమొత్తంలో సొమ్ము ముట్టేక విడిచిపెట్టేద్దాం! మన ప్లాను బెడిసికొట్టి డబ్బులు రాకపోతే చంపేద్దాం!" అన్నాడు కరుకుగా.

"మరో హత్యా?" అనేసి నాలిక కరుచుకున్నాడు ఘటికాచలం.

"మరో హత్య ఏమిటి? నిజం చెప్పు! నీ భార్యని నువ్వే చంపావా?" అడిగాడు ఇబ్రహీం.

"చంపాలనుకోలేదు. మా ఆవిడంటే నాకెంతో ఇష్టం. అనుకోకుండా చనిపోయింది" ఉద్వేగంతో అన్నాడు.

మాటలు తడబడ్డాయి.

"నీ గొడవ నాకెందుకుగాని... రేపు ఉదయం కలుద్దాం. నయనికను ఫాలో అయ్యి ఎక్కడ వీలు దొరికితే అక్కడ కిడ్నాప్ చేద్దాం!" అనేసి వెళ్ళిపోయాడు ఇబ్రహీం.

ఆ రోజు జరిగిన సంఘటన కళ్ళలో

మెదిలింది ఘటికాచలానికి.

... రవళికి ఫోన్ చేశాడు సాయంత్రం ఐదింటికి.

"హాయ్ డార్లింగ్... డ్రగ్స్ డీలింగ్ పూర్తి చేశావా? మొత్తం కేజీ కొకైన్ తీసుకుంటానన్నాడా? "

"అతనేం చేసుకుంటాడు? భారీస్థాయిలో డ్రగ్స్ దగ్గరుంటే అతనికి రిస్క్‌గదా!"

"అతనికి పెద్ద బిజినెస్ సర్కిల్ వుంది. బాగా పరిచయం వున్నవాళ్ళకు అమ్ముకుంటాడు. ఆ విషయం చెప్పలేదా అతనికి" అన్నాడతను విసుగ్గా.

"నాకు చెప్పాలని అనిపించలేదు. ఈ రొచ్చులోకి అతన్ని లాగడం ఎందుకు? "

"అతనికి ఇవ్వు ఫోన్... నేను మాట్లాడుతాను" అన్నాడు కోపంగా.

"ఆకాష్ మాట్లాడే స్థితిలో లేడు. వో డోస్ కొకైన్ తీసుకున్నాడు. ఆ మత్తులో వున్నాడు" అందామె.

"ఆస్తి నీకు రాసే విషయం మాట్లాడేవా? "

"నాకెందుకు ఆస్తిపాస్తులు? " ఎదురు ప్రశ్నించింది.

బాగా కోపం వచ్చింది తనకు. తను హోటల్‌కు వెళ్ళి అన్ని విషయాలు మాట్లాడుకోవడమే మంచిది!"

హోటల్‌కు వెళ్ళాడు.

ఆకాష్‌ని కొకైన్ తీసుకుని డబ్బు ఇమ్మని అడిగాడు. అతను తన మాటలు విన్పించుకునే స్థితిలో లేడు.

"ఎందుకతన్ని డిస్టర్బ్ చేస్తావ్! రేపు మాట్లాడుకోవచ్చు గదా!"

"డ్రగ్స్ వెంటబెట్టుకుని అటు ఇటు తిరగడం ఎంత డేంజరో నీకు తెలుసా? సీక్రెట్‌గా డ్రగ్స్ ట్రాన్సాక్షన్ నిముషంలో తేలిపోవాలి. ఆ విషయం మాట్లాడమని నీకు చెబితే ఇద్దరూ ఆనందంలో మునిగి తేలుతూ వుండిపోయారా? అందుకేనా అతని దగ్గర నిన్ను ఒదిలేసి వెళ్ళింది"

"నాకు ఇష్టమై నేనే అతను బుక్‌చేసిన సూట్‌లో వున్నాను. మధ్యలో నీ గొడవేమిటి? నువ్వెళ్ళి పో ఇక్కడి నుంచి" అందామె తనను నెట్టివేస్తూ.

ఆమె మీద కోపం రాలేదు ఆ క్షణంలో. ఆకాష్‌ను రెండు పీకితే మత్తు వీడిపోతుందనుకున్నాడు.

అతని చెంపలు గట్టిగా వాయించాడు.

రవళి అడ్డొచ్చింది.

ఆమెను పక్కకు నెట్టేసి "నేనా వీడా నీకు మొగుడు? " అన్నాడతను.

"పరాయి మగాడి దగ్గరికి కట్టుకున్న

> ## కొత్తగాలి...
>
> **బాహ్య ప్రపంచంలో**
> **ఎన్ని పుస్తకాలు చదివితేనేం!**
> **నీ అంతరంగిక**
> **మస్తకాన్ని చదవనిదే!**
>
> **- పి.వి. రమణకుమార్,**
> చిలకలూరి పేట

భార్యను పంపేవాడు మొగుడు ఎలా అవుతాడు? " నిలదీసిందామె.

ఆమె మీద కోపం కట్టలు తెంచుకుంది. రవళిని మంచం మీదకు నెట్టేసి ఆమె మీద కూర్చుని చెంపలు వాయించాడు. తనను నెట్టివేయడానికి కాలితో తన్నడానికి ప్రయత్నించింది. ఆమె చేతుల మీద మోకాళ్ళు నొక్కిపెట్టి దిండు తీసుకుని ఆమె మొహం మీద వుంచి గట్టిగా అదిమాడు. 'తన మాటకు ఎదురు చెబుతుందా! బుద్ధిలేదు దీనికి!...'

పొట్టమీద కూర్చోవడంతో బాధతో

మూలుగుతోంది.

ఊపిరి ఆడక గిలగిలా కొట్టుకుంటోంది.

రెండు నిమిషాలు అలా అదిమి పెట్టి ఆ తరువాత ఆమెను వొదిలేద్దామనుకు న్నాడు.

ఐదు నిమిషాలు గడిచిపోయాయి. ఆమెలో కదలికలు ఆగిపోయాయి.

భయం వేసి ఆమె మీద నుంచి లేచి, మొహం మీద దిండు తీశాడు.

రవళి చనిపోయింది. భయం వేసి అక్కడి నుంచి వొచ్చేశాడు. తను సూట్‌లోకి వెళ్ళడం, తిరిగి వెళ్ళిపోవడం ఎవరూ గమనించలేదు.

★ ★ ★

ఉదయం పూట స్నానం చేసి వొచ్చి ఇంటి ముందు పచ్చటి లాన్ దగ్గర కుర్చీ వేసుకుని కూర్చుంది నయనిక.

రుత్విక్‌తో మాట్లాడి చాలా రోజులవుతోంది.

అతను ఫోన్ చెయ్యడు. తను ఫోన్ చేస్తే మాట్లాడుతాడు. రోజూ అతనితో మాట్లాడాలని వుంటుంది కాని తనంతట తాను అతనికి ఫోన్ చేయాలంటే సిగ్గు తనకు. అతనికి మొహమాటం ఎక్కువ.

అనన్య పెళ్ళికి తను విశాఖపట్నం వెళ్లి నప్పుడు తిరిగి వొచ్చేటప్పుడు రైల్వేస్టేష న్‌లో అతను ప్రెజెంట్ చేసిన పుస్తకం సంగతి గుర్తుకు వచ్చింది.

... ఆ పుస్తకం సంగతి ఇన్ని రోజులు తనెందుకు మర్చిపోయింది? ...

ఇంట్లోకి పరుగెత్తి షెల్ఫ్‌లో అతను ఇచ్చిన పుస్తకం కోసం వెతికింది.

అరగంటసేపు వెతికేక ఆ పుస్తకం కన్పించింది.

తిలక్ రాసిన 'అమృతం కురిసిన రాత్రి' కవితల సంపుటి.

పుస్తకంలోని పేజీలు తిరగేస్తుంటే వో గులాబీ రంగు కాగితం కింద పడింది. వొంగి ఆ కాగితం చేతిలోకి తీసుకుంది.

సెంటు ఆ కాగితానికి పూసాడేమో మల్లెల సౌరభం ముక్కుపుటాలకు తాకింది. ముత్యాల్లాంటి అక్షరాలు మెరిసి పోతూ కన్పించాయి.

"ప్రియమైన నయనికా!

ధైర్యం చేసి రాస్తున్నాను ఈ ప్రేమలేఖ.

మనసులోని భావాలను నీకు అందకుండా ఇన్ని రోజులూ గడిపేశాను. ఇక నా వల్ల కాదు. మనస్సు విప్పి నీ ముందు మల్లెల తివాచీలా పరచాలి!

ప్రేమలేఖలు రాయడంలో అనుభవం లేదు. నా మనస్సులోని భావాలు సరిగ్గా నీ ముందు ఉంచలేకపోతే క్షమించు!

పొద్దున్నే లేచి పొలం వెళ్ళాను. ఉద యం పూట ఎండలో మెరుస్తున్న పచ్చటి పొలాలు చూస్తుంటే నువ్వు గుర్తుకువచ్చా వ్. 'పక్కన నువ్వుంటే బాగుండేది' అను కుంటూ వో క్షణం కళ్ళు మూసుకున్నాను. కళ్ళు తెరిచి చూస్తే ఎదురుగా చిరున వ్వులు చిందిస్తూ నువ్వు కన్పించావు.

ఎల్లోరా గుహల్లో మనం కలసి తిరగ డం గుర్తుకు వొచ్చింది. నువ్వు తూలి పడి పోబోతుంటే నేను పొదివి పట్టుకున్న దృశ్యం కళ్ళల్లో మెదిలింది.

... పొలం గట్ల మధ్య నడుస్తూ నువ్వు ఎక్కడ పడిపోతావో పట్టుకుందామని నా చూపులు నీ చుట్టూ తిరుగుతూ వున్నాయి. ఆ ఛాన్సు నాకు దక్కనివ్వ లేదు... వారం రోజులు నువ్వు, అనన్య, అనురాగ్ గారు మా వూళ్ళో వున్నారు. ఆ వారం రోజులు మీతో అనుబంధం మధు రస్వప్నంగా మారి రోజూ రాత్రిపూట హాయినిస్తూ వుంది.

నీ ధైర్యం, ఆత్మీయత నాకు ఎంతగానో నచ్చాయి.

పంచదార చిలుక తియ్యదనం నీలో వుంది.

# పాముతో ప్రయాణం!



కైరో నుంచి కువైత్‌కు వెళ్లే ఈజిప్షియన్ ఎయిర్ లైన్స్ విమానంలో ఇటీవల ఓ విషసర్పం ప్రయాణించింది. అంతేకాదు, ఆ నల్లటి తాచుపాము ఒకర్ని కాటేసింది కూడా. అబ్దుల్ లతీఫ్ అనే నలభైఏనిమిదేళ్ల వ్యక్తి జోర్డాన్‌లో పెంపుడు జంతువుల దుకాణాన్ని నడుపుతున్నాడు. అతను ఈజిప్ట నుంచి ఓ నల్లతాచుని స్మగుల్ చేస్తూ, అది సెక్యూరిటీ కళ్ల పడకూడదని క్యారీ ఆన్ ఎయిర్‌బ్యాగ్‌లో పెట్టుకుని విమానంలోకి తీసుకెళ్లాడు. బుసలు కొట్టే ఆ పాముని అతడు శాంతపరిచే ప్రయత్నం చేయడం పక్క సీట్లోని ప్రయాణికుడు గమనించాడు. అది అతడ్ని కాటు వేయడం కూడా చూసాడు. ఆ తర్వాత తప్పించుకుని అది సీట్ల కిందకి పాకింది. ఆ విమానంలో తొంభైమంది ఉన్నారు. విషయం పైలట్‌కు తెలిసింది. ఆ తాచుపాము విషం పావుగంటలో మనిషిని చంపేంత శక్తిమంతమైనది. దాంతో విమానాన్ని ఎర్రసముద్రంలోని అల్‌ఘర్‌డకా హుర్‌గడ అనే రిసార్టుకి చెందిన విమానాశ్రయంలో దింపారు. ఇది కైరోకి మూడువందల మైళ్ల దూరంలో ఉంది. అధికారులు విమానంలోకి ఎక్కి ఆ పాముని స్వాధీనం చేసుకున్నారు. అయితే తనకు చికిత్స అవసరం లేదని, ఆ పాము విషాన్ని పూర్తిగా పిండేసేనని, అందువల్ల ఏమీ కాదని లతీఫ్ తిరస్కరించాడు.




ఈ సంఘటన జరగడానికి సరిగ్గా రెండు వారాల ముందు కొస్టారికా నుంచి మేడ్రిడ్‌కు వెళ్లే విమానంలో ఓ ప్రయాణికురాలిని విషపు తేలు కుట్టింది. అది ఆమె పెంపుడు తేలు కావడం విశేషం. మేడ్రిడ్‌లో ఆమెకు చికిత్స జరిగాక మళ్లీ ప్రయాణాన్ని కొనసాగించింది.

ఈజిప్టులోని లంచగొండి సెక్యూరిటీ అధికారులు డబ్బులు తీసుకుని ఆ తాచుపాముని వదిలేసి ఉండవచ్చని భావించారు. ఎందుకంటే మనదేశంలో మాదిరిగానే ఈజిప్టులోనూ అవినీతి అధికం.

... జీవితాన్ని ప్రేమిస్తావ్. నీ స్నేహితాన్ని పంచుకున్న వాళ్ళక్కూడా ఉత్తేజాన్ని, ధైర్యాన్ని కల్గిస్తావ్! రియల్లీ యూ ఆర్ లవర్ ఆఫ్ లైఫ్!...

నిన్ను తలచుకున్నప్పుడల్లా వెన్నెల కిరణాలు రక్తనాళాల్లోకి చొచ్చుకుపోయి చల్లదనాన్ని కల్గిస్తున్నట్లు అన్పిస్తూ వుంటుంది.

అప్పుడప్పుడు అన్పిస్తుంది... ఉట్టికి ఎగరలేనమ్మ స్వర్గానికి ఎగరాలని ప్రయత్నిస్తున్నట్లుగా వుంది నా ప్రేమ వ్యవహారం. నేనో చిన్న రైతును. నువ్వు పెద్ద ఇండస్ట్రియలిస్టువి. కోట్ల ఆస్తికి యజమానురాలివి. నీకు నాకూ లంగరు కుదరదేమో!

నువ్వు నా హృదయంలో పదిలంగా కూర్చుని కులుకులొలుకుతూ వున్నావు. ఆ విషయం నీకు స్పష్టం చేయాలి! నీకు నేను నచ్చితే నా ఉత్తరానికి సమాధానమిస్తావు. ఫోన్‌కాల్ చేస్తావ్! నచ్చలేదనుకో నా ఉత్తరం చించివేస్తావ్! గరికపత్రులో ఉన్న నీ పొలాలను మరొకరికి కౌలుకు ఇచ్చేస్తావ్! మళ్ళీ కలిసే అవకాశం ఇవ్వవు.

నీ సమాధానం కోసం ఎదురు చూస్తూ.. రోజులు లెక్క పెట్టుకుంటు న్నాను, మళ్ళీ నిన్ను ఎప్పుడు చూస్తానో నని.

ఇట్లు
ఎప్పటికీ..
నీ రుత్విక్"

రుత్విక్ ప్రేమలేఖను పదే పదే ముద్దు పెట్టుకుంది నయనిక. ఆ లేలేత ముద్దుల వేడి 'ఎక్కడో గరికపర్రులో పచ్చటి పొలాల మధ్య వున్న రుత్విక్‌కు తాకాలి!

ఎంత పొరపాటు చేసింది? అతను ఇచ్చిన పుస్తకాన్ని వెంటనే చూడాల్సింది. దాదాపు నెల రోజులైంది. విశాఖపట్నం నుంచి వొచ్చి కనీసం ఫోన్ కూడా అతనికి చేయలేదు.

అతను ఎంత బాధపడి వుంటాడో తన ఉత్తరానికి సమాధానం రాలేదని!

తన జవాబు కోసం ఎదురుచూస్తూ ఉండి వుంటాడు.

దిగులుగా చేలల్లో నడుస్తున్న అతని రూపం కళ్ళలో మెదిలింది.

అతనితో ఫోన్‌లో మాట్లాడాలనుకుంది మొదట.

ఫోన్‌లో అయితే తగిన మాటలు దొరకవు. ఏం మాట్లాడాలో తెలియక ఇబ్బంది పడుతుంది.

ఉత్తరం రాయడమే బెటర్.

లెటర్ ప్యాడ్ కోసం వెతికింది. పూలో, ప్రకృతి దృశ్యం వున్న లెటర్ ప్యాడో అయితే అతనికి బాగా నచ్చుతుంది.

వెంటనే కార్లో షాపింగ్ మాల్‌కు వెళ్లాలనుకుంది నయనిక.

★ ★ ★

'వసుధ నిలయం' దగ్గర ఆటో దిగి అటూ ఇటూ పరికించి చూశారు ఇబ్రహీం, ఘటికాచలం.

రోడ్డు మీద జనసంచారం లేదు. రోడ్డుకు రెండువైపులా విశాలమైన ఆవరణలు.. లోపల ఎక్కడో వున్న భవనాలు.

వసుధ నిలయం గేటు దగ్గరకొచ్చి "అమ్మగారి కారు డ్రైవరు వున్నాడా? అతని బంధువులం... రెండు నిమిషాలు మాట్లాడాలి" అన్నాడు ఘటికాచలం అక్కడ నిలబడ్డ వాచ్‌మన్‌తో. డ్రైవరు పేరు కూడా తెలియదు వాళ్లకు.

"యాదగిరి అమ్మగారిని సూపర్ మార్కెట్‌కు తీసుకువెళ్ళబోతున్నాడు. లోపలికి వెళ్ళండి" అనేసి సిగిరెట్ ప్యాకెట్ కొనుక్కోవడానికి దగ్గర్లో వున్న పాన్‌షాప్ వైపు వెళ్ళాడు వాచ్‌మన్.

గేటు దాటుకుని పోర్టికో వైపు చకచకా నడిచారు.

కారు ముందువైపు అద్దం తుడుస్తూ డ్రైవర్ కన్పించాడు. అతనికి కన్పించకుండా పూల చెట్టు వెనుక నక్కారు వాళ్ళిద్దరూ.

ఐదు నిమిషాల తరువాత నయనిక బయటకు వొచ్చింది.

కారు వెనుక తలుపు తీసి నిలబడ్డాడు యాదగిరి.

నయనిక వెనుక సీట్లో కూర్చుంది.

ఇబ్రహీం డ్రైవర్ మీదకు వొక్క దూకు దూకి అతని మీద పిడిగుద్దుల వర్షం కురిపించాడు. ఆ దెబ్బలకు దిమ్మతిరిగిపోయి కింద పడ్డాడు యాదగిరి. ఘటికాచలం వొక్క నిమిషం వృథా చెయ్యకుండా నయనికను లోనికి నెట్టి కారు వెనుక సీట్లో ఆమె ప్రక్కన కూర్చున్నాడు.

"మాట్లాడకుండా కూర్చో! మాట బయటకు వొచ్చిందా ప్రాణాలు తీసేస్తాను" అన్నాడు కత్తి ఆమె మెడ మీద నొక్కి.

ఇటువంటి సంఘటన ఎదుర్కోవడం అదే మొదటిసారి.

ఆమె భయపడిపోయింది... చెమటలు పట్టాయి.... గొంతు పెగల్లేదు.

ఇబ్రహీం వొచ్చి డ్రైవర్ సీటులో కూర్చుని కారు స్టార్టుచేసి ముందుకు దూకించాడు.

సిగరెట్ ప్యాకెట్ కొనుక్కుని గేటు దగ్గరకు వొచ్చిన వాచ్‌మన్ కారు సీట్లో యాదగిరికి బదులు అతని బంధువు కూర్చోవడం ఆశ్చర్యాన్ని కల్గించింది.

'అతను అసలు యాదగిరి బంధువేనా?' అనుమానమొచ్చింది.

యాదగిరిని వెతుక్కుంటూ పోర్టికో దగ్గరకు పరుగెత్తుకుని వొచ్చాడు వాచ్‌మన్. పూలమొక్కల పక్కన మూలుగుతూ పడి వున్న యాదగిరిని చూసి ఆశ్చర్యపోయాడు.

వాటర్ బాటిల్ తెచ్చి అతని మొహం నీళ్ళతో కడిగేసరికి ఆ షాక్ నుంచి తేరుకున్నాడు డ్రైవర్.

"వాళ్ళనెందుకు లోపలికి రానిచ్చావ్?" వాచ్‌మన్ మీద ఎగిరాడు యాదగిరి.

★ ★ ★

కమలాంబ జీవితంలో ఎప్పుడూ దేనికీ భయపడలేదు. దేనికీ కంగారు పడకుండా ప్రశాంతంగా వుండటం ఆమెకు అలవాటు. మొదటిసారిగా భయపడిపోయిందామె.

ఆకాష్ పోలీసు కస్టడీలో వుండటం, అతనే హత్యచేసి ఉంటాడని పేపర్లో, టీవీ ఛానెల్స్‌లో వొచ్చే కథనాలు ఆమెను కంగారుపెట్టేవి. గోరుచుట్టుపై రోకలి పోటన్నట్లు తనకు అండగా వుండే నయనికను కిడ్నాప్ చెయ్యడం ఆమెను భయాందోళనలకు గురిచేసింది.

మధ్యాహ్నం ఒంటిగంటకు ఫోన్ వొచ్చింది. లాండ్‌లైన్‌కు ఆ ఫోన్ వచ్చింది.

ఇంట్లో పనిచేసే మంగమ్మ ముందు ఫోన్ ఎత్తింది.

"కమలాంబవేనా? నయనిక అత్తయ్యేనా మాట్లాడేది?" అవతలి వైపు గొంతు దబాయిస్తున్నట్లుగా వుంది.

"ఏమిటో చెప్పండి. కమలాంబగారు గాబరాగా వున్నారు. మాట్లాడే పరిస్థితిలో కూడా లేరు. విషయం నాకు చెబితే పెద్దమ్మ గారికి చెబుతాను" అంది మంగమ్మ తాపీగా.

"నోరు మూసుకుని ఫోన్ కమలాంబకు ఇవ్వు. ఆవిడ మాట్లాడకపోతే నయనికను చంపేస్తాం. నయనిక మా దగ్గరే వుంది" కర్కశంగా మాట్లాడేసరికి భయపడి కమలాంబ గారిని ఫోను దగ్గరకు రమ్మని సైగ చేసింది.

కమలాంబ రిసీవర్ చెవి దగ్గర పెట్టుకుంది.

"కమలాంబవేనా?" గద్దించాడు ఇబ్రహీం.

"అవును నాయనా!"

మీ అమ్మాయి నయనిక మా దగ్గర వుంది. ఆమెను విడిచిపెట్టాలంటే రెండు కోట్లు ఇవ్వాలి! క్యాష్ సూట్‌కేసుల్లో సర్ది కార్లో నెక్లెస్ రోడ్డుకు రావాలి. అక్కడ రోడ్డు పక్కన మా కారు ఆగి వుంటుంది.

> ## కొత్తగాలి...
>
> **భూమిని నమ్ముకొని**
> **బతికేవాడు రైతు**
> **భూమిని అమ్ముకుంటూ**
> **బతికేవాడు రియల్‌వ్యాపారి**
>
> *- అయినాల కనకరత్నాచారి,*
> కొరిశపాడు, ప్రకాశం జిల్లా

కారు నెంబరు, కారు ఏ రంగులో వుండేది వివరాలు అన్నీ రేపు ఉదయం చెబుతాను. రేపు ఉదయానికి డబ్బు రెడీ చేసుకోండి!"

"ఇంట్లో మా అబ్బాయి కూడా లేడు నాయనా! మగవాళ్లు ఎవరూ లేరు... పెద్దదాన్ని, నా వల్ల ఏమవుతుంది?" అంది కమలాంబ.

"మీ కంపెనీ అధికార్లు వుంటారు గదా! వాళ్ళకు చెప్పి అర్జెంటుగా డబ్బు కలెక్ట్ చెయ్యమనండి. ఆ డబ్బు తీసుకుని మీరు కార్లో రండి. మీ వెంట ఎవరూ రాకూడదు

కారు డ్రైవరు తప్ప. పోలీసులకు ఈ ఫోన్ గురించి గానీ, మేం డబ్బు అడిగినట్లుగానీ చెప్పకూడదు. పోలీసుల కదలికలు మాకు తెలుసు. వాళ్ళకి మీరు చెప్పారంటే మీ అమ్మాయి నయనిక ప్రాణాలు గాల్లో కలిసిపోతాయి. వందల కోట్ల ఆస్తి వున్న మీకు రెండు కోట్లు ఇవ్వడం పెద్ద విషయమేమీ కాదు. డబ్బు రెడీగా వుంచుకోండి. మళ్ళీ రేపు ఉదయం ఎనిమిదింటికి ఫోన్ చేస్తాను. తొమ్మిది గంటలకల్లా మీరు కార్లో నెక్లెస్ రోడ్డు చేరుకోవాలి!" రంకెలు వేస్తున్నట్లు గట్టిగా మాట్లాడేడు ఇబ్రహిం.

"అమ్మాయి మీ పక్కన వుందా బాబూ!" అడిగింది కమలాంబ.

"ఎక్కువ సేపు మాట్లాడకూడదు. రెండే రెండు మాటలు మాట్లాడుతుంది మీ నయనిక. ఆమె గొంతు వినండి" అన్నాడు.

ఫోన్ నయనికకు ఇచ్చినట్లున్నాడు.

నయనిక మాట్లాడాలనే ప్రయత్నం చేస్తోంది. గొంతు పెగలడం లేదు.

"అత్తయ్యా! సీఈఓ కృష్ణమూర్తి గారితో మాట్లాడి డబ్బు ఏర్పాటు చేసి వాళ్ళు చెప్పినట్లు డబ్బు అప్పగించండి. వేరే మార్గం కన్పించడంలేదు. వాళ్ళు చెప్పినట్లు చెయ్యండి!"

ఆమె దగ్గర నుంచి ఫోన్ లాక్కోవడంతో ఎక్కువసేపు మాట్లాడలేకపోయింది.

★ ★ ★

పోలీస్‌స్టేషన్‌కు వొచ్చి కంప్లైంట్ ఇచ్చాడు నయనిక కారు డ్రైవర్ యాదగిరి. నయనికను ఎలా కిడ్నాప్ చేసింది, ఎలా కారుతో సహా ఉడాయించింది వివరంగా ఇన్‌స్పెక్టర్‌కు చెప్పాడు.

ఆడి కారు నెంబరు, కిడ్నాప్ చేసిన మనుషుల వివరాలు ఇన్‌స్పెక్టర్ నోట్ చేసుకున్నాడు. యఫ్.ఐ.ఆర్. బుక్ చేసుకున్నాడు. కిడ్నాప్ కేసును పెద్దగా సీరియస్‌గా తీసుకోలేదు జూబ్లీహిల్స్ పోలీస్ ఇన్‌స్పెక్టర్.

ఒంటిమీద నగలు లాక్కుని కారు రోడ్డు పక్కన వొదిలి దొంగలు పారిపోతారనుకున్నాడు ఇన్‌స్పెక్టరు.

★ ★ ★

రవళి హత్య కేసు ఇన్వెస్టిగేషన్ ఓ కొలిక్కి వొచ్చింది. అన్ని కోణాల్లో మర్డర్ కేసును పరిశీలించాడు డి.సి.పి. విశాల్. కేసులోని 'లూజ్ ఎండ్స్'ను బిగించాడు.

రవళిని ఎవరు మర్డర్ చేసిందీ వో నిర్ణయానికి వచ్చాడు.

ఆకాష్‌కు రవళిని చంపాల్సినంత బలమైన కారణం లేదు. ఆమెతో అతనికి ఎప్పటి నుంచో శారీరక సంబంధాలు వున్నాయి. వాళ్లిద్దరూ ఘర్షణ పడిన వాతావరణం లేదు. ఎవరిని విచారించినా ఘర్షణ పడే మనస్తత్వం కాదని, డబ్బుతో సుఖాన్ని కొనుక్కోవాలనే ఆరాటం తప్పితే, హత్య చేసేటంత భావోద్రేకం లేదని చెప్పారందరూ. ఆకాష్‌కు కొంత రెప్యుటేషన్ వుంది. కొకైన్ అమ్మే అవసరం లేదు.

ఇకపోతే, రవళి భర్త ఘటికాచలం... అతను అఖండుడు. తిమ్మిని బొమ్మి చేసే సత్తా వున్నవాడు. డ్రగ్స్ అమ్మకాలు చేస్తూ వుంటాడు. అతని మీద నాలుగైదు కేసులు పెండింగ్‌లో వున్నాయి.

అతని వాచీ రవళి శవం పక్కనే బెడ్ మీద దొరికింది. భార్య మొహం మీద దిండు పెట్టి నొక్కి పెట్టే ప్రయత్నంలో ఆమె పెనగులాడి వుంటుంది. అదే సమయంలో వాచీ ఊడిపోయి పరుపు సందులో పడిపోయింది.

బాగా బలంగా వున్న వ్యక్తి ఆమె ఉదరంపై కూర్చుని ఆమెకు ఊపిరి ఆడకుండా చేశాడని, ఆ సఫొకేషన్‌తో ఆమె చనిపోయిందని పోస్ట్‌మార్టమ్ రిపోర్టులో వుంది.

ఆకాష్ నుంచి బాగా డబ్బు గుంజమని

భార్య మీద ఒత్తిడి తెచ్చి వుంటాడు. ఆమె సహకరించకపోవడంతో క్షణికావేశంతో ఆమెను అంతమొందించాడు.

కన్‌క్లూజన్‌కు వొచ్చేశాడు డి.సి.పి.

పోలీస్ టీమ్‌ను తీసుకుని ఘటికాచలం వుండే అపార్టుమెంటుకు వెళ్ళాడు అరెస్టు చేయడానికి. అపార్టుమెంటుకు తాళం వేసి వుండటంతో వెనక్కు తిరిగాడు.

అదే సమయంలో డి.జి.పి. నుంచి విశాల్‌కు ఫోన్ వొచ్చింది.

★ ★ ★

"వసుధ గ్రూప్ ఆఫ్ కంపెనీస్ ప్రొప్రయిటర్ నయనిక గారిని ఉదయం పది గంటల సమయంలో వాళ్ళింటి దగ్గర కిడ్నాప్ చేశారు దుండగులు. ఒంటిగంటకు కిడ్నాప్ చేసినవాళ్ళు ఆమె అత్తయ్య గారికి ఫోన్ చేశారు. రెండు కోట్లు ఇమ్మని బ్లాక్ మెయిల్ చేస్తున్నారు. ఆ కాల్ మల్లేపల్లి ఏరియాలోని పబ్లిక్ బూత్ నుంచి వొచ్చినట్లు క్రైమ్ బ్రాంచి వాళ్లు ఆరా తీశారు. మీరు వెంటనే నయనిక కారు డ్రైవర్‌ను వెంటబెట్టుకుని ఆ ప్రాంతమంతా గాలించండి. ఆ అమ్మాయికి ఆపద ముంచుకు రాకముందే ఆపరేషన్ కంప్లీట్ చేసి ఆమెను రక్షించాలి! క్విక్..!" అన్నాడు డి.జి.పి.

"యస్ సర్" అనేసి ఫోన్ పెట్టేశాడు డి.సి.పి. విశాల్.

ఇన్‌స్పెక్టర్‌ని పిలిచి కిడ్నాప్ వివరాలు అడిగి తెలుసుకున్నాడు.

"కంప్లైంట్ ఇచ్చిన డ్రైవర్ ఇక్కడే వున్నాడా? వెళ్ళిపోయాడా?" అడిగాడు డి.సి.పి.

"ఇప్పటిదాకా ఇక్కడే తిరుగుతున్నాడు సార్... వెళ్ళిపోయాడేమో!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఎందుకు వెళ్ళనిచ్చారు? అతను ఎక్కడున్నాడో వెతికి పట్టుకుని తీసుకురండి. మనం వెంటనే జీప్‌లో బయల్దేరాలి!"

డి.సి.పి.గారి హడావుడి ఎందుకో అర్థం కాలేదు. 'కంప్లైంట్ ఇవ్వగానే కిడ్నాపర్స్ కోసం ఛేజ్ మొదలుపెట్టాలా? కొత్త బిచ్చగాడు పొద్దెరగడన్నట్లు కొత్త డి.సి.పి.కి అన్నీ అర్జంటులే!' అనుకున్నాడు.

డి.జి.పి. నుంచి ఒత్తిడి వొచ్చినట్లు అతనికి తెలియదు.

పోలీస్ స్టేషన్ ముందు చూస్తే అక్కడ యాదగిరి కన్పించలేదు. మోటార్ బైక్ మీద బస్‌స్టాప్ దాకా వెళ్ళి చూశారు.

బస్ షెల్టర్‌లో కూర్చుని తాపీగా సిగరెట్ తాగుతున్న యాదగిరి కన్పించడంతో ఊపిరి పీల్చుకున్నారు పోలీసులు.

"రావయ్యా బాబూ! నీకోసం డి.సి.పి. ఎదురు చూస్తున్నాడు. ఎక్కు... ఎక్కు!"

అప్పటికే బైక్ మీద ఇద్దరు పోలీసులు వున్నారు. వాళ్ళిద్దరూ కొంచెం ముందుకు జరిగి యాదగిరికి చోటిచ్చారు బైక్ మీద.

★ ★ ★

నయనిక చేతులు వెనక్కి విరిచి నైలాన్ తాడుతో కట్టేశారు. నోట్లో జేబు రుమాలు కుక్కారు. చీకటిగదిలోకి నెట్టేసి ఆ గది ముందున్న హాల్లో కూర్చుని మాట్లాడుకుంటున్నారు ఘటికాచలం, ఇబ్రహీం.

టీవీ ఛానెల్స్‌లో నయనికను గుర్తుతెలియని వ్యక్తులు కిడ్నాప్ చేసిన న్యూస్ ప్రసారం చేస్తున్నారు. నయనిక ఫొటో కూడా పదేపదే చూపిస్తూనే వున్నారు.

"మనం చేసిన కిడ్నాప్‌కు ఇంత ప్రాముఖ్యం ఇస్తారనుకోలేదు. పోలీసులు పట్టించుకోరేమోననుకున్నాను. లేనిపోని చిక్కుల్లో పడిపోయాం. మనం పట్టుబడితే టి.వి. ఛానెల్స్ వాళ్ళు మనల్ని కూడా చూపిస్తారేమో!" అన్నాడు ఘటికాచలం.

"పిచ్చివాగుడు వాగకు. మనం పోలీసులకు దొరికితేగా! డబ్బు మనం చెప్పిన టైంకు ఇవ్వకపోతే ఆ అమ్మాయిని చంపేసి మనం ఇక్కడ నుంచి మకాం మార్చడమే!" అన్నాడు ఇబ్రహీం అసహనంతో.

"చంపొద్దు గురూ! వాళ్ళకు మరికొంత సమయం ఇద్దాం డబ్బు ఇవ్వడానికి" భయపడిపోతూ అన్నాడు ఘటికాచలం.

"ఓ హత్యచేసి దర్జాగా తిరుగుతున్నావ్. రెండో హత్య గూర్చి భయపడతావెందుకు? "

ఇబ్రహీం మాటలకు మరింత భయం వేసింది. శరీరంలో వొణుకు మొదలయ్యింది.

"నా భార్యను కావాలని చంపలేదు. నన్ను తిడుతూ ఆకాష్‌ను పొగుడుతూ వుంటే ఆమె నోరు మూయాలని, భయపెట్టాలని మొహం మీద దిండు పెట్టి గట్టిగా అదిమి పెట్టి వుంచాను. నిముషాల్లో ఆమె ప్రాణాలు గాల్లో కలిసిపోయాయి. చనిపోతుందని గాని, చంపెయ్యాలని గానీ అనుకోలేదు" అన్నాడు గొంతు తగ్గించి గోడలకు కూడా చెవులు వున్నాయేమోనన్నట్లుగా.

"ఇప్పుడు నయనికను చంపాలని అనుకుని చంపుదువుగానిలే! ఆ ముచ్చటా తీరిపోతుంది" అన్నాడు ఇబ్రహీం సిగరెట్ పొగ ఘటికాచలం మొహం మీదకు ఊదుతూ.

"భయపెట్టకు మహానుభావా! అసలే సగం చచ్చి వున్నాను... ఆ అమ్మాయిని నేనెందుకు చంపుతాను? "

"నువ్వే చంపుతావ్. రేపు డబ్బు నా చేతిలో పడకపోతే ఆమెను నువ్వు చంపెయ్యాలి. లేకపోతే నిన్ను నేను చంపేస్తాను" అన్నాడు, జేబులో పిస్టల్ తీసి ఘటికాచలానికి గురిపెడుతూ.

"ఇదెక్కడి ఫిటింగయ్యా బాబూ!" అతని మాటలకు అదిరిపడి గట్టిగా అరిచాడు.

"నేను బయటకు వెళ్ళి పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లో నుంచి నయనిక అత్తయ్యతో మరోసారి మాట్లాడివొస్తాను. నయనికను

జాగ్రత్తగా కనిపెట్టుకుని వుండు. నోట్లో గుడ్డ తీసి కాసిని మంచినీళ్ళు పొయ్యి. ఆకలయితే ఏదన్నా పెట్టు... మనకు డబ్బు ముట్టేంత వరకూ అది ప్రాణాలతో వుండాలి. ఆ పిల్ల చనిపోతే మన ప్లాన్ తల్లకిందులవుతుంది" అనేసి బయటకు వెళ్ళిపోయాడు ఇబ్రహీం.

లైటేసి గదిలోకి వచ్చాడు ఘటికాచలం.

ఆమె నోట్లో కుక్కిన జేబురుమాలు తీసేసి "మంచినీళ్ళు తాగుతావా?" అన్నాడు మంచినీళ్ళ గ్లాసు నోటి దగ్గర

## కొత్తగాలి...



**కత్తుల్లేకుండానే**
**కుత్తుకలు కోసుకునే**
**జిత్తుల సమరం**
**రాజకీయం**

– యు. చిట్టిబాబు,
కొత్త పాల్వంచ, ఖమ్మం జిల్లా

వుంచి.

నీళ్ళు రెండు మూడు గుటకలు వేసింది. ప్రాణం కుదుటపడినట్లు అన్పించిందామెకు.

"ఆకాష్ విషయం నువ్వు పట్టించుకోకుండా వున్నట్లయితే నీ జోలికి వొచ్చేవాడిని కాదు. నీ గురించి ఇబ్రహింకు చెప్పేవాడిని కాదు" అన్నాడతను.

"నీకు కావాల్సినంత డబ్బు నేనిస్తాను. నా మాట నమ్మి నన్ను ఒదిలెయ్యి!" అందామె.

"ఇప్పుడు నిన్ను ఒదిలేస్తే ఆ ఇబ్రహింగాడితో, పోలీసులతో కూడా తంటానే! అదేదో ఆ ఇబ్రహింను బ్రతిమిలాడి బయటపడు"



ఆమెకు ఎదురుగా కుర్చీ లాక్కుని కూర్చున్నాడు ఘటికాచలం.

ఎన్నో కంపెనీలకు యజమానురాలు దిగులుగా, దీనంగా తనవైపు చూస్తూ కూర్చుందామె. జాలివేసింది ఆమె స్థితికి.

★ ★ ★

మాదాపూర్ పోలీసులకి డ్రగ్స్ ముఠా లోని ఒక సభ్యుడు పట్టుబడ్డాడు. అతన్ని విచారిస్తే వాళ్ళ స్థావరం మల్లేపల్లి అని తేలింది. ఆ ముఠాలో నలుగురు సభ్యులున్నారు. దొరికిన వ్యక్తి పేరు రవి. డేవిడ్, చారి, ఇబ్రహిం ఆ ముఠాలోని ఇతర సభ్యులు.

వాళ్లు ఖరీదైన కార్లు కూడా దొంగతనాలు చేస్తారు. ఆ దొంగిలించిన కార్లలో తిరుగుతూ అసాంఘిక కార్యకలాపాలు సాగిస్తూ వుంటారు.

నిముషాల్లో కారు నెంబరు మార్చేస్తారు.

డి.సి.పి విశాల్ తన బృందంతో కిడ్నాప్ అయిన నయనికను వెతుకుతూ బయల్దేరాడు. డ్రైవర్ యాదగిరి దృష్టి రోడ్లమీద తిరిగే ఆడి కార్లమీదే.

మల్లేపల్లి ఏరియాలో ప్రతి రోడ్డు గాలిస్తూవున్నారు.

ఓ పాత భవనం ముందు పార్కుచేసిన ఆడీకారు కన్పించింది యాదగిరికి. వెంటనే "జీప్ ఆపండి సార్!" అన్నాడు.

"కన్పించిన ప్రతి ఆడికారు మీదేననుకుంటున్నావా?" అడిగాడు విశాల్.

"ఆవుల మందలో తన దూడ ఎక్కడున్నా పసిగడుతుంది సార్ ఆవు... అలాగే రోజూ నేను నడిపే కారును గుర్తుపట్టేస్తాను సార్!" అన్నాడు యాదగిరి.

పోలీస్ జీప్ ఆగింది.

ఆడి కారు దగ్గరకు వెళ్ళి నెంబరు చూశాడు. నెంబరు వేరేదిగా కన్పించింది. వెనక్కు తిరగబోయాడు 'మనం వెతుకుతున్న కారు కాదుసార్!' అన్నాడు.

ఏదో సూదంటు రాయిలా చటుక్కున కళ్ళలో పడింది.

మళ్ళీ వెనక్కు వొచ్చి కారు వెనుక వైపు అతికించి వున్న రెడ్ స్టిక్కర్‌ని చూశాడు.

"సార్ ఈ స్టిక్కర్ రెండ్రోజుల క్రితం అతికిచ్చాను సార్... రేడియం స్టిక్కరది.. ఈ కారు నయనమ్మదే సార్!" అన్నాడు గట్టిగా అరుస్తూ.

ఆ పాత భవనాన్ని చుట్టుముట్టారు పోలీసులు.

ఎంతసేపు కాలింగ్ బెల్ నొక్కినా లోపలి నుంచి సమాధానం రాకపొయ్యేస రికి తలుపులు పగులగొట్టి లోపలికి వెళ్ళారు.

హాల్లో ఎవరూ కన్పించలేదు.

తలుపులు విరగ్గొట్టిన చప్పుడు విని లో పలి గదిలో నుంచి ఘటికాచలం బయట కువొచ్చి పోలీసుల్ని చూసి గతుక్కుమ న్నాడు.

తప్పించుకునే ప్రయత్నం చేయబో యాడు గాని, డి.సి.పి చేతిలోని రివాల్వర్ చూసి ఆగిపోయాడు.

నయనిక చేతులకు కట్టిన తాడును విప్పదీశారు.

★ ★ ★

ఘటికాచలం జరిగినదంతా చెప్పేడు డి.సి.పి.కి.

ఇబ్రహిం దొరకలేదు. పాతభవనం ముందు పోలీసుల హడావుడి గమనించి పారిపోయాడు.

రవళిని హత్య చేసింది తనేనని ఒప్పుకు న్నాడు ఘటికాచలం.

ఆమెను చంపాలనుకోలేదని, భయపెట్టే ప్రయత్నంలో రవళి ప్రాణాలు కోల్పోయిం దని తన స్టేట్‌మెంట్‌లో చెప్పుకున్నాడు. నయనిక కిడ్నాపింగ్ కేసులో తనదే ప్రధా నపాత్ర అని ఒప్పుకున్నాడు.

ఆకాష్‌ను విడుదల చేశారు.

సరికొత్త జీవితంలోకి అడుగు పెడుతు న్నట్లనిపించిందతనికి. అప్పటివరకు తను అనుసరించినది సరైన మార్గం కాదని తెలుసుకున్నాడు.

★ ★ ★

తీరిక సమయాల్లో పనిపిల్లకు చదువు నేర్పుతోంది వసంత.

పద్మినిని దగ్గర కూర్చోబెట్టుకుని తెలుగు పాఠం చెబుతూ వుంది వసంత.

జీవితం ఒక వైకుంఠపాళీ... ఆ ఆటలో పైకి తీసుకువెళ్ళే నిచ్చెనలే కాదు కిందకు పడదోసే పాములూ ఉంటాయి. ఎన్ని ఆటంకాలు ఎదురైనా ధైర్యంగా ముందుకు పోవాలి. చిరునవ్వులతో వెన్నెల బాటలో నడవాలి!"

కొత్తగాలి...

**అం'కుళ్లు'**
**వద్దు**
**మామే**
**ముద్దు!!**

– జి.వి.యస్. ప్రియంవద,
అరసవిల్లి

వాచ్‌మన్ వొచ్చి గది ముందు నిలబడ్డాడు.

"ఎవరో మీ కోసం వొచ్చినారమ్మా! పేరు అడిగితే చెప్పడం లేదు... ఒక్కసారి మిమ్మల్ని చూసి వెళ్ళిపోతానని అంటున్నాడు" అన్నాడతను.

విజిటర్స్ రూమువైపు వెళ్ళింది వసంత. ఆమె వెంటే నడిచింది పద్మిని.

తలొంచుకుని పేముకుర్చీలో కూర్చున్న ఆకాష్‌ను చూసి ఆశ్చర్యపోయింది.

...ఆకాష్‌తో బంధం తెగిపోయింది.. మళ్ళీ అతన్ని కలిసే ప్రసక్తి లేదనుకుంది ఎన్నోసార్లు!

ఎందుకొచ్చాడు? మళ్ళీ ఏదో మాయ మాటలు చెప్పడానికా?

వెనక్కు తిరగబోయింది.

ఆమె కాళ్ళమీద పడిపోయాడు "నన్ను క్షమించు వసంతా! ఎన్నో తప్పులు చేశాను... సరిదిద్దుకునే అవకాశం ఇవ్వవా? " అన్నాడతను చెమర్చిన కళ్ళతో.

పెరిగిన గడ్డంతో తనవైపు దీనంగా చూస్తున్న ఆకాష్‌ను చూసి మంచు ప్రతిమ కరిగిపోయినట్లు మెల్లమెల్లగా ఆమె హృదయం మెత్తబడింది.

"ఎవరమ్మా ఇతను... బయటకు పంపించి వేయమంటారా? " అడిగాడు వాచ్‌మన్.

"వొద్దు... ఈయన నా భర్త" అంది వసంత.

తనకు కేటాయించిన కాటేజ్‌కు తీసుకు వెళ్ళింది ఆకాష్‌ను.

ఆహ్లాదంగా కన్పిస్తున్న అక్కడి వాతావరణం చూసి ముగ్ధుడైపోయాడు. వసంత తనపై కరుణ చూపడంతో అతని మనస్సు మరింత పులకరింతలకు గురైంది.

కాఫీ కలిపి ఇచ్చింది.

"హైద్రాబాద్‌కు వెళ్ళిపోదాం... అక్కడ అందరికీ పార్టీ ఇస్తాను... ఆ పార్టీలో నువ్వు నా భార్యవని అందరి ముందు ప్రకటిస్తాను... మరో స్త్రీ వైపు కన్నెత్తి చూడను" అతని మాటల్లో నిజాయితీ కన్పించింది.

ఎవరూ అతనికి పాఠాలు చెప్పలేదు.

జీవితమే అతనికి అన్ని పాఠాలు నేర్పింది.

దర్పం, డాబుసరి- అన్నీ పోయాయి. మునిపుంగవుడిలా వున్నాడు ఆకాష్.

జీవితం ఓ యాత్ర.

యాత్ర చివర్లో కూడబెట్టుకున్న సంపదనుబట్టి కాకుండా జీవనశైలిని బట్టి మని

షిని అంచనా వేస్తాడు భగవంతుడు. తప్పులు తెలుసుకుని వెలుగుదారిలో నడిచినవారిని అక్కున చేర్చుకుంటాడు. ఇతరులకు పంచినదే ఆయన లెక్కలోకి వొస్తుందిగాని కూడబెట్టినది కాదు.

"నేను హైదరాబాద్ రాను" అంది వసంత.

"ఇక్కడే వుండిపోతావా? " అడిగేడు.

తలూపింది.

"నువ్వెక్కడుంటే నేనూ అక్కడే! నాక్కూడా చిన్న ఉద్యోగం ఇవ్వమని అనన్యను ప్రార్థిస్తాను... ఒకప్పుడు నా దగ్గర పనిచేసింది... ఇప్పుడు ఆమె సంస్థలో పని చెయ్యడానికి సిద్ధంగా వున్నాను" అన్నాడతను ఆమెకు దగ్గరగా జరిగి.

అప్పటిదాకా అక్కడేవున్న పద్మిని బయటకు జారుకుంది.

అతని గడ్డం గుచ్చుకుందామెకు.

"గడ్డం పెంచుకుంటే మీరు మరింత అందంగా కన్పిస్తున్నారు" అంది, అతని ఛాతిపై వేలితో రాస్తూ.

"మనస్సుకు నచ్చినవాళ్ళు ఏం చేసినా బాగానే వుంటుంది" అన్నాడతను నవ్వుతూ, ఆమె నడుం చుట్టూ చెయ్యి బిగించి.

తలుపులు వేసి వొచ్చింది.

కళ్ళలో ప్రేమ నింపుకుని 'నా ప్రాణం నువ్వే' అన్నట్లు అతని వైపు చూసింది. ఎడబాటు తరువాత సమాగమం ఎంతో మధురంగా వున్నట్లు అన్పించింది ఇద్దరికీ. ఆ మధురిమలు కలకాలం నిలుపుకోవాలనుకున్నారు.

★ ★ ★

మంచివాళ్ళు ప్రేమిస్తారు.

చెడ్డవాళ్ళు కూడా ప్రేమిస్తారు.

మంచివాళ్ళు ప్రేమించబడతారు. చెడ్డవాడిని ఎవరూ ప్రేమించరు. యోగ్యుడిని ప్రేమించడంలో ఆనందం వుంది. మంచివాడిచేత ప్రేమించబడకపోతే బాధకూడ వుంటుంది.

అనన్యకు అంతా ఆశ్చర్యంగా వుంది.

ఆకాష్ ప్రేమించానని మొదట్లో తన వెంటబడటం- ఎన్నో కారణాలతో అతనికి దూరంగా జరగడం..

ఆత్మహత్య చేసుకోవాలనుకున్న అనురాగ్ జీవితంమీద అనురక్తి పెంచుకోవడం.. అతన్ని తను ప్రేమించడం...

కాలేజీలో తన సీనియర్ అయిన పక్కింటబ్బాయిని ప్రేమించిన చెల్లెలు అతడినే పెళ్లాడి సుఖంగా ఉండటం..

సిరిపందలతో మిడిసిపడే ఆకాష్ సుడిగుండాలలో చిక్కుకుని హంతకుడనే ముద్ర వేయించుకోవడం..

మళ్ళీ నయనిక అతన్ని ఒడ్డున పడెయ్యడం..

వసంతను ఆటబొమ్మలా చేసి ఆడుకోవాలని ప్రయత్నించి చివరకు ఆమె పాదాల దగ్గర చోటుకోసం ప్రయత్నించడం...

ఎన్ని మలుపులు...

గుండె గుప్పెడంతే!

కడలిని మించిన ఆశలు దాచుకుంటాడు మనిషి. ఆశ పడటంలో తప్పులేదుగాని దురాశ పెంచుకోగూడదు.

★ ★ ★

రుత్విక్, నయనికల పెళ్ళి మాదాపూర్ హైటెక్ సిటి గార్డెన్స్‌లో వైభవంగా జరిగింది.

"అమెరికా తిరిగి వెళ్ళిపోతావా? ఇక్కడే సెటిల్ అయిపోతావా? " ఎవరో అడిగారు నయనికను.

పంచెకట్టులో ఎంతో దర్పంగా, అందంగా కన్పిస్తున్న రుత్విక్ వైపు చూసింది నయనిక.

"నా మూలాలు ఇక్కడివే! ఇక్కడి గాలి పీల్చి, నీళ్ళుతాగేక ఇన్ని సంవత్సరాలు అమెరికాలో ఎలా ఉండగలిగానబ్బా!" అనేసింది నయనిక.

Ⓒ



# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
అవధాన సరస్వతి
డా. మేడసాని మోహన్
సమాధానాలు

ప్ర. తెలుగువారు బహుమతి రూపేణా రూ. 116/- ఇస్తుంటారు. దీనిలోని అంతర్యం ఏమిటి?

– అంబటి వెంకట శివారెడ్డి,
యర్రగుంట్ల, కడప జిల్లా

జ. పదునారు - సంఖ్యను పూర్వులు సంపూర్ణత్వానికి ప్రతీకగా భావించినారు. చంద్రుడు పదునారు కళలతో ఉన్నప్పుడే పూర్ణచంద్రుడు అని అంటాం గదా! ఆ పూర్ణత్వాన్ని కూడా పరిపుష్టం చేస్తూ ప్రాచీనులు 116/-గా నిర్ణయించినారు. మరికొందరు ఆ సంప్రదాయాన్ని మరింత పరిపుష్టం చేస్తూ 1116/-గా నిర్ణయించినారు. రానురాను పదివేలకైనా, లక్షకైనా 116/-లుగా చేర్చటం పరిపాటిగా వ్యవహారంలోకి వచ్చింది.

ప్ర. మహాభారత యుద్ధంలో ధర్మరాజు రథం భూమికి నాలుగు అంగుళాల ఎత్తులో నడిచేదని చదివాను. దీనిలోని అంతరార్థం ఏమిటి?

– ఎన్. యశోద,
న్యూ బోయిన్‌పల్లి, సికింద్రాబాద్

జ. మహాభారత యుద్ధంలో ధర్మరాజు రథం భూమికి నాలుగు అంగుళాల ఎత్తులో నడిచిన వర్ణన కవిత్రయ భారతంలోగాని, వ్యాసభారతంలోగానీ లేదు. మనకు రామాయణ సన్నివేశాలు కొన్ని కొన్ని వాల్మీకి రామాయణానికి భిన్నంగా ఉన్నట్లే.. మహాభారతానికి సంబంధించి కూడా అటువంటి భిన్నతలు గోచరించే అంశాలు చాలా ఉన్నాయి. ప్రస్తుతాంశం కూడ అటువంటిదే. ఇందులోని అంతరార్థం ఏమిటంటే ధర్మరాజు సత్యసంధుడైన దైవీసంస్కార సంపన్నుడు. ఆయన ధర్మనిబద్ధత, సత్యసంధత, సదాచార వర్తనం, శ్రీకృష్ణుని పట్ల భక్తి ప్రపత్తులు - ఈ నాలుగు గుణాలు యుద్ధసమయంలో ఆయనను భూమికంటే నాలుగంగుళాల పైన రథవిహారం చేయించేవని, అశ్వత్థామ విషయికంగా అబద్ధం చెప్పినప్పుడు మొదటి రెండు గుణాలకు భంగం కలిగి రెండంగుళాలు రథం కుంగిందని ఒక ఐతిహ్యం జానపదుల ప్రచారం.

ప్ర. ఈ జన్మలో కష్టాలు, పూర్వజన్మలోని పాపాల ఫలితమంటారు. ఈ విషయం మనకు తెలిసేలా చేస్తే ఈ జన్మలో తప్పులు చేయం కదా? దేవుడలా ఎందుకు చెయ్యడు?

– సాధనాల పద్మారమేష్,
భవానీపురం, విజయవాడ

జ. ఈ జన్మలో కష్టాలు పూర్వజన్మలోని పాపాల ఫలితాలని మనకు తెలియజెప్పడానికే వ్యాసవాల్మీక్యాది రూపాలలో భాసించి వేదాలు, అష్టాదశ పురాణాలు, రామాయణాది ఇతిహాసాల విజ్ఞానాన్ని భగవంతుడు మనకనుగ్రహించినాడు. ఆ విజ్ఞాన సారాంశాన్ని అవగాహన చేసుకొని ఆచరించడం మనందరి కర్తవ్యం. మనం నిజంగా ఇటువంటి కర్తవ్యానికి అంకితమైతే తప్పులు చేయం.

ప్ర. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రానికి బద్ధుడైన ఆంజనేయుడు వెంటనే విముక్తుడయ్యాడు. అదెలా సాధ్యమైందీ తెలుపగలరు?

– పి. మధుసూదనరావు,
మౌలాలి, హైదరాబాద్

జ. ఆంజనేయుడు బ్రహ్మపై ఉన్న గౌరవాభిమానాలతోనే బ్రహ్మాస్త్రానికి బద్ధుడైనాడు. వాస్తవానికి ఏ అస్త్రశస్త్రాలూ ఆంజనేయుని బంధింపలేవు. అటువంటి అప్రమేయబలం ఆయనకు వరప్రసాదం. పైగా బ్రహ్మాస్త్రానికి బద్ధుడైన ఆంజనేయుని ఇంద్రజిత్తు బలిష్ఠమైన మోకులతో కూడా బంధించినాడు. ఆ చర్యకు నిరసనగా బ్రహ్మాస్త్రం దానంతట అదే సడలిపోయిందని ఐతిహ్యం.

ప్ర. స్వయంభువుగా చాలా దేవాలయాల్లోని మూర్తిని, పురాణకథల్లోనూ చెబుతుంటారు. ఒకే భగవంతుడు ఇన్నిచోట్ల స్వయంభువుగా ఎలా అవతరిస్తాడు?

**- పిశిపాటి శైలజ,**
నవులూరు, గుంటూరు జిల్లా

**జ.** సర్వవ్యాపకుడై, అణువులో అణువై, మహత్తులో మహత్తయి యున్న భగవంతుడు అనేక క్షేత్రాలలో స్వయంభువుగా వెలుగొందగలిగిన మహత్త్వానికి నిలయుడు- అని వేద, ఆగమ, ఉపనిషదాదులు పేర్కొంటున్నాయి.

ప్ర. గాయత్రీ మంత్రాన్ని మహిళలు చదవకూడదంటారు కొందరు.. వాస్తవమేనా?

**- కె. శ్రీదేవి,**
లక్కిడాం జంక్షన్, విజయనగరం జిల్లా

**జ.** ప్రాచీన కాలంలో వేదాలనే అధ్యయనం చేసిన స్త్రీలు ఉన్నారని ఎన్నో ఐతిహ్యాలు చెబుతున్నాయి. సకల విద్యలకు అధిదేవతగా సరస్వతీ దేవిని ఆరాధించే ఈ దేశంలో 'గాయత్రీ మంత్రాన్ని మహిళలు చదవవచ్చా?'- అన్న సందేహమే ఉండనవసరంలేదు.

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. ఆత్మ- పరమాత్మ అందరికీ ఒకటే అయినప్పుడు ఇన్ని మతాలు ఎందుకు ఏర్పడ్డాయి?

**- వద్దిపర్తి ద్యుమణి భవాని,**
న్యూ నల్లకుంట, హైదరాబాద్

**జ.** ఆత్మ- పరమాత్మ అందరికీ ఒకటే.. అన్నదే అన్ని మతాల సారాంశం. ఇన్నిమతాలు ఏర్పడడానికి కారణం ఆయా మతాచార్యుల ఆధ్యాత్మిక దృక్పథాలలో ఉన్న కొన్ని కొన్ని వ్యత్యాసాలే. ఎన్ని వ్యత్యాసాలు ఉన్నా 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' - అన్నదే సత్యసూక్తి.

ప్ర. గుణాన్నిబట్టి కులనిర్ణయమని గీతాచార్యుడు నిర్దేశించగా, పుట్టుక ననుసరించి కులాలను వర్గీకరించడం దైవధిక్కారం కాదా?

**- కందిమళ్ల శివప్రసాద్,**
దేవపురం, గుంటూరు

**జ.** పుట్టుకననుసరించి కులాలను వర్గీకరించడం దైవధిక్కారమే అవుతుంది. 'విజాతుల

న్నియు వృథావృథా అజామిళాదులదదియే జాతి' - అని అందుకే అన్నమయ్య ఆనాడే నొక్కి వక్కాణించినాడు.

ప్ర. మనది హిందూ సంప్రదాయం కదా! 'క్రీస్తుపూర్వం, క్రీస్తుతర్వాత' వంటి వాటికి బదులు 'శాలివాహన శకం' లాంటివి వాడుకోవచ్చు కదా?

– బచ్చు లక్ష్మి,
*కొత్తగూడెం, ఖమ్మం జిల్లా*

జ. 'క్రీస్తు పూర్వం, క్రీస్తు తర్వాత'- అనే భావన ఆంగ్లేయుల పాలనలో మనకు పరిపాటిగా వచ్చింది. అంతకుముందు ప్రాచీన శాసనాలు, వాఙ్మయ పరిశీలనాంశాలలో శాలివాహన శక ప్రస్తావనే ఉంటుంది. ఇప్పుడు మళ్లీ మనం ఈ సంప్రదాయాన్ని అలవరచుకోవాలి.

ప్ర. కాశీకి వెళ్లినవారు తమకు ఇష్టమైన వాటిని విడిచి పెట్టాలని అంటారు.. ఎందుకు? పెద్దలకు కాశీలో ఒకసారి పిండ ప్రదానం చేస్తే మళ్లీ మళ్లీ చేయనవసరం లేదని కొందరు చెబుతారు, నిజమా? బతికున్నవారు ఎవరి పిండం వారే ప్రదానం చేసుకోవచ్చా?

– పి. బాలకృష్ణారావు,
*గరివిడి, విజయనగరం జిల్లా*

జ. కాశీకి వెళ్లినవారు తమకిష్టమైన వానిని విడిచిపెట్టడంలోని అంతరార్థమేమిటంటే బాహ్యసుఖాలపై ఇష్టాన్ని వదలి అంతస్సుఖం - శాశ్వత సుఖం ప్రసాదించే పరమాత్మపై ఇష్టం పెంచుకోవడం. కాశీలో పిండప్రదానం చేస్తే మళ్లీ మళ్లీ చేయనవసరం లేదన్న సంప్రదాయం ఉంది. అలా అని మళ్లీ చేసినా అది సంప్రదాయ అతిక్రమణం కాదు. బతికున్న సమయంలో తురీయాశ్రమం స్వీకరించేవారు ఎవరి పిండం వారే ప్రదానం చేసుకుంటారు. మిగిలినవారు అలా చేయడం ఔచిత్యం కాదు.

ప్ర. చనిపోయిన మనిషి మరో జన్మ ఎత్తాక, వారి పేరున జరిపే శ్రాద్ధ కర్మలు ఎవరికి చెందుతాయి? ఎక్కడికి చేరుతాయి? పితృదేవతలు ఉండగా పునర్జన్మ సాధ్యమా?

– వి.ఎన్. మూర్తి,
*గుడిమల్కాపూర్, హైదరాబాద్*

జ. చనిపోయినవారు మళ్లీ ఎన్నిజన్మలు

## చతుర ప్ర.జ. 6

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

ప్రశ్న: ..........................................................................

..........................................................................

..........................................................................

..........................................................................

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (     ) చిరునామా: ------------------------------------

------------------------------------------------------------

------------------పిన్ : ------------ ఫోన్ : ----------------

**సూచనలు**

* ఉత్తమ ప్రశ్నను అవధాని డా. మేడసాని మోహన్ ఎంపిక చేస్తారు * మీ ప్రశ్న ద్వారా రాబట్టే సమాధానం పదుగురికీ ఉపయోగపడేలా ఉంటే మేలు * ఏ నెల ప్రశ్నలు ఆ నెల కూపన్‌లోనే నింపి పంపాలి * ప్రశ్న స్పష్టంగా, సంక్షిప్తంగా ఉండాలి * ఒకరు ఎన్ని ప్రశ్నలయినా పంపవచ్చు. ఒక కూపన్‌పై ఒక్క ప్రశ్న మాత్రమే రాయాలి * తుడుపులు, కొట్టివేతలొద్దు * ప్రశ్నల ఎంపికలో సంపాదక వర్గానిదే తుది నిర్ణయం * ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు * ఈ కూపన్లు కూడా తక్కిన వాటితో కలిపి ఒకే కవరులో పంపవచ్చు

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

ఎత్తినా ఈ అనంతకాల ప్రవాహంలో ఆయా జన్మలకు చెందిన శరీరాలు, ఆ శరీరాలకు అనుబంధంగా కలిగిన మనోవాసనలు అస్తిత్వం కలిగియున్నవి కదా! ఆ అస్తిత్వ సంస్కారంతో కూడిన తేజోమూర్తులే పితృలోకంలో ఉంటాయని, వాటినే మనం పితృదేవతలుగా ఆరాధించి, శ్రాద్ధకర్మలు నిర్వర్తిస్తామని ప్రాచీన వాఙ్మయం పేర్కొంటూంది. భారతదేశంలో మహర్షులేర్పరచిన పవిత్ర సంప్రదాయాలివి.

ప్ర. శ్రీకృష్ణ అవతారం చివరలో గీతను బోధించిన ఉద్ధవుడి వివరాలు తెలుపగలరు

**– జె. నాగరత్నమణి,**
*భీమడోలు, ప.గో. జిల్లా*

**జ.** శ్రీకృష్ణుని ఆకార విశేషంతో మంచి పోలికలు కలిగిన ఒకానొక యాదవ ప్రముఖుడే ఉద్ధవుడు. శ్రీకృష్ణునికి పరమ మిత్రుడు కూడా. ద్రౌపదీ స్వయంవరంలో కూడ ఇతడు పాల్గొన్నాడు. శ్రీకృష్ణుడు తన అవతారాన్ని పరిసమాప్తం చేసిన తరువాత బదరికాశ్రమానికి వెళ్లి తపోదీక్ష వహిస్తాడు.

ప్ర. మధ్యాహ్న భోజనానికి ముందు ఒక పిడచ కాకికి పెడుతున్నా. ఇది సరికాదని కొందరు, సరైందేనని ఇంకొందరు అంటున్నారు.. ఇందులో ఏది సత్యం?

**– కన్నేపల్లి నారాయణమూర్తి,**
*శ్రీకాకుళం*

**జ.** ఇది అనాదిగా వస్తున్న సంప్రదాయమే. మృత్యుదేవతయైన యమునికి ప్రతీకగా మన పూర్వులు కాకిని పేర్కొంటారు. 'కాకో భూత్వా యమస్సాక్షాత్'- అన్న పురాణోక్తి ఈ అంశాన్ని బలపరుస్తూంది. అలా కాకికి పిడచ పెడితే అపమృత్యుదోషాలు తొలగి అకాల మరణాదులు సంభవించకుండా మనుగడ హాయిగా సాగించవచ్చునని విశ్వాసం.

ప్ర. వాకిట్లో ముగ్గు, గుమ్మానికి తోరణం, గడపకి పసుపు .. ఇవన్నీ అందం కోసమేనా?

**– ఎస్. సాయికృష్ణ ప్రసాద్,**
*ఎల్.బి. నగర్, హైదరాబాద్*

**జ.** ఇవన్నీ కేవలం అందం కోసం మాత్రమే కాదు. ముగ్గుపిండి, పసుపులలోని రసాయన ఔషధ గుణాలు, తోరణాలలో పచ్చదనం గృహ ప్రాంగణ పరిసరాలాకు పరిశుభ్రత, పవిత్రత సంతరిస్తాయి.

ప్ర. విగ్రహారాధన కూడదని అన్నిమతాలు చెబుతుంటే, ఆచరించడంలో ఔచిత్యం ఉందా?

**– జి. లక్ష్మీకాంతమ్మ,**
*కోట, నెల్లూరు జిల్లా*

**జ.** భగవంతుని ఆరాధించడంలో సగుణ, నిర్గుణ సంప్రదాయాలు రెండూ ఉన్నాయి గదా! విగ్రహారాధన సగుణ సంప్రదాయానికి చెందిన అంశం. మన తాతల, తండ్రుల చిత్రపటాలకు, రాజకీయనాయకుల శిలావిగ్రహాలకు కూడ పూజలు చేస్తున్నాం గదా!

ప్ర. మాస శివరాత్రికి, మహా శివరాత్రికి భేదాన్ని వివరించండి?

**– కొక్కెరగడ్డ శ్రీదేవి,**
*మానేపల్లి, తూ.గో. జిల్లా*

**జ.** మాఘమాసంలో వచ్చేది మహాశివరాత్రి. ప్రతినెలా వచ్చే శివరాత్రి మాస శివరాత్రి.

ప్ర. మన సంస్కృతిలో దైవారాధన పరంగా ఎన్నో పర్వదినాలుండగా, పాశ్చాత్య పద్ధతిలో యాంటీ స్మోకింగ్ డే, యాంటీ లిక్కర్ డే.. అంటూ చెడును ఆధారంగా ఉత్సవాలు జరుపుకోవడమేమిటి?

**– ఎన్.వి. రమణి,**
*బంజారాహిల్స్, హైదరాబాద్*

**జ.** ఇలాంటివి పాశ్చాత్య సంస్కృతీ ప్రభావంతో మనకు అలవాటవుతున్నాయి. మన సంస్కృతిలో ఉన్న పర్వదినాలకు మనం ప్రాధాన్యం ఇవ్వడం సముచితం.

ప్ర. సుమంగళిగా మరణించినపుడు దశదిన కర్మ రోజు ముత్తయిదువలకు చేటలు దానం చేస్తారు. ఈ ఆచారంలోని ఆంతర్యం ఏమిటి?

**– ఎస్. విజయలక్ష్మి,**
*ఒంగోలు, ప్రకాశం జిల్లా*

**జ.** ప్రాచీనకాలంలో పరివ్రాజకులెవరైనా సంపన్నుల ఇండ్లకు భిక్షకు వస్తే వారికి పప్పులు, బియ్యం వగైరాలను పెద్దపెద్ద చేటలలో ఇచ్చేవారు. చేటతో ధాన్యాన్ని చెరిగినపుడు పొట్టు పోయి, గట్టిధాన్యం మిగులుతుంది. అంటే చేట దాన, పరిణతి గుణాలకు ప్రతీక. ప్రాచీనకాలంలో ధాన్యకుటీరాలు వెదురుతో నిర్మించేవారు. వెదురు బద్దలతోనే చేటను కూడా తయారుచేస్తారు. సుమంగళిగా మరణించిన వారి ఆత్మ పవిత్రతను, స్వచ్ఛతను సంతరించుకోవాలన్న ఆశయమే ఇందలి నేపథ్యం. అయితే ఈ యాచారం కొన్నిప్రాంతాలకే పరిమితం. Ⓒ

# సమాజ జాడ్యాలపై ఎత్తిన విల్లు



శ్రీలాల్ శుక్లా

**శ్రీలాల్ శుక్లా ఉన్నత ప్రభుత్వాధికారిగా ఎన్నెన్నో పదవులు సమర్థంగా నిర్వహిస్తూనే, శ్రీలాల్ శుక్లా సమాజంలో స్వైరవిహారం చేస్తున్న అక్రమాలపై, విలువల పతనంపై నిశిత విమర్శనాస్త్రాలు సంధించేందుకు వ్యంగ్య ప్రక్రియను ధనువుగా స్వీకరించి హిందీ సాహితీరంగంలో సాటిలేని వ్యంగ్య రచయితగా ప్రసిద్ధిగాంచారు. ఆయన సాగించిన అవిరళ కృషికిగాను అమర్ కాంత్‌తో సంయుక్తంగా 2009 సంవత్సరం జ్ఞానపీఠం అందుకున్నారు.**

శ్రీలాల్ శుక్లా 1925 డిసెంబరు 31న ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం అలీఘర్ జిల్లా అత్రౌలీ గ్రామంలో జన్మించారు. వారిది ఒక విధంగా సంపన్న కుటుంబమనే చెప్పాలి. శుక్లా పాఠశాల దశలోనే రచనాసక్తిని ప్రదర్శించి తన ప్రతిభను నిరూపించారు. చదువులో ఎప్పుడూ ప్రథముడే. సమాజ పరిశీలన, అక్రమాల పట్ల నిరసన అప్పుడే ఆరంభమయింది.

అలహాబాద్ విశ్వవిద్యాలయం నుంచి శుక్లా ఉన్నతపట్టం పొందారు. ఉత్తరప్రదేశ్ రాష్ట్ర సివిల్ సర్వీసు పరీక్షలో ఉత్తీర్ణులై రాష్ట్ర ప్రభుత్వంలో అధికార ఉద్యోగ జీవితం ప్రారంభించారు. పిమ్మట ఐ.ఎ.ఎస్. స్థాయి లభించింది. అనేక ఉన్నత పదవులు అలంకరించారు. భారతేందు నాట్య అకాడమీ సంచాలకులుగా విశేష సేవలందించారు. సాహిత్య అకాడమీ సలహా మండలిలో సభ్యులుగా వ్యవహరించారు. 1981లో బెల్గ్రేడ్‌లో జరిగిన అంతర్జాతీయ రచయితల సమ్మేళనంలో భారతదేశ ప్రతినిధిగా పాల్గొన్నారు. చైనాకు భారత ప్రభుత్వం పంపిన రచయితల బృందానికి నాయకత్వం వహించారు. జర్మనీ, ఇంగ్లండు, పోలండ్ తదితర దేశాలలో సాహిత్య సదస్సులలో పాల్గొని ప్రసంగించారు. 1983లో పదవీ విరమణ గావించారు.

శుక్లా విలక్షణ రచయిత. నవల, కథ, విమర్శ, వ్యంగ్యరచన- ఏ ప్రక్రియ తీసుకున్నా తనదైన ముద్రను ప్రతిష్ఠం చేశారు. వ్యంగ్య ప్రక్రియలో ఆయన అగ్రతమ స్థానం అలంకరించారు. ప్రక్రియ ఏదైనా సమాజ శ్రేయస్సే ప్రబల ఆకాంక్ష. ఏ రూపంలో వున్నా అన్యాయాన్ని, అక్రమాన్ని, దుర్మార్గాన్ని, అవినీతిని, దురాచారాన్ని, మూఢనమ్మకాన్ని, ఆ కోవకు చెందిన దేనినైనా సరే ఆయన తీవ్రంగా దుయ్యబట్టారు.

హిందీ సాహితీరంగంలో శుక్లా అభినవ అంతర్‌దృష్టి ప్రవేశపెట్టారని విమర్శకుల భావన. అంతేకాదు, హిందీ నవలాసాహిత్యంలో అనూచానంగా వస్తున్న కొన్ని విధానాల రూపురేఖల్ని ఆయన సమూలంగా మార్చి కొత్త ఒరవడి దిద్దారు. సమాజమే ఆయన రచనలకు ప్రధాన నేపథ్యం. ఉన్నత ప్రభుత్వాధికారిగా వ్యవహరిస్తూ ప్రజల స్థితిగతులకు, వారి మనోభావాలకు అద్దంపట్టే రచనలు నిర్భయంగా వెలువరించడం ఆయన చిత్తశుద్ధికి, సంకల్పశక్తికి నిదర్శనం.

దేశ స్వాతంత్ర్యానంతరం ప్రజల స్వప్నాలు భంగం అవుతున్నాయనే భావం శ్రీలాల్ శుక్లాను కలచివేసింది. దళితుల స్థితి దయనీయంగా వున్న సత్యాన్ని ఇతివృత్తంగా స్వీకరించి 1957లో వెలువరించిన ఆయన ప్రథమ నవల 'సూనీఘాటీకా సూరజ్' (శూన్యలోయ సూర్యుడు)లో రామదాస్ ముఖ్యపాత్ర. శుక్లా ఈ నవలలో- గ్రామసీమలకు తరలండి.. దళిత జనులకు అండగా నిలవండి.. వారిని అక్షరాస్యులుగా తీర్చిదిద్దండి.. వారిలో నవచైతన్యం వర్ధిల్లజేయండి- అని ఉద్బోధించిన తీరు పాఠక లోకా

నికి కొత్త మేలుకొలుపయింది.

'అజ్ఞాత్‌వాస్' శుక్లా రెండవ నవల. రజనీ కాంత్ దీనిలో ప్రధానపాత్ర. రైతు కూలీలపై జరిగిన దౌర్జన్యకాండ చుట్టూ అల్లిన కథ. దోపి డీని అరికట్టాలని నినదించే బలీయస్వరం ఇం దులో వినిపిస్తుంది.

ఒక నేరగాడి కథ ఆధారంగా రచించిన 'ఆద్మీకా జహర్' (మనిషిలోని విషం) నవల లో ఎన్నో సామాజిక సత్యాలను శుక్లా సమ ర్థంగా ఆవిష్కరించారు. పెక్కు రహస్య సంద ర్భాలను కథలో జోడించారు.

ఆధునిక క్రియాశీల జీవనయానంలో తారస పడే ఆటంకాలను, వాటిని అధిగమించే వైనాన్ని 'సీమాయే టూట్ తీహై' (సరిహద్దులు తెగిపో తున్నాయి) నవలలో శుక్లా చిత్రించారు.

'మకాన్' (ఇల్లు) నవల అద్దెయింటికోసం పడే యాతనను చూపుతుంది. ఇందులో ప్రధా నపాత్ర ఒక సితార విద్వాంసుడు. ఇంటి యజ మానురాలి పాత్ర చిత్రణలో శుక్లా విశేష పరిశీ లనా సామర్థ్యం వ్యక్తమవుతుంది. శుక్లా నవ లలు వస్తు వైవిధ్యభరితాలు. 'బిస్రాంపుర్‌కా సంత్' (బిస్రాంపురం సాధువు) నవల ప్రేమ-వి షాదాలకు వినూత్న నిర్వచనం చెబుతుంది. ఎన్నెన్నో కొత్త భావాలను వెల్లడిస్తుంది. వివేక్-జయశ్రీల మధ్య సాగిన ప్రణయోదంతాన్ని కథగా తీసుకుని అనేక రాజకీయ కోణాలను చిత్రిస్తారు. వ్యాపార రంగంలోని విశేషాలు చెబుతూ 'రాగ్ విరాగ్' నవలను జాతి, వర్గ, వర్ణ భేదాలకు అతీతంగా నాటకీయ ధోరణిలో రచించారు. 'బబ్బర్‌సింగ్ ఔర్ ఉస్కే సాథీ' పిల్లల నవల. స్వేచ్ఛా ప్రాధాన్యాన్ని వివరించే ఇతివృత్తంతో సాగుతుంది. 'అంగద్ కా పాంవ్' (అంగదుడి పాదం) నవల విభిన్న ఆలోచనల సమాహారం. రాగ్ దర్బార్, పహల్ పడావ్, ఉమ్రావ్‌నగర్ మె కుచ్ దిన్, ఇస్ ఉమ్ర్ మె, ఖబరోంకీ జుగావా, జహలత్‌కె పచాస్‌సాల్, కు చ్ జమ్‌నే పర్ కుచ్ హవామె, ఆరోబైర్‌లో కుచ్ దేవ్ మొదలైన రచనలు శుక్లా కలం నుంచి జాలువారాయి.

శుక్లాకు విశేష కీర్తిప్రతిష్ఠలు సమకూర్చిన నవల 'రాగ్ దర్బార్' వ్యంగ్య ప్రక్రియకిది పరా కాష్ఠగా ప్రశంసలందుకుంది. 1968లో వెలువ డిన ఈ నవలకు శివపాల్‌గంజ్ అనే గ్రామం కార్యక్షేత్రం. మూఢవిశ్వాసాలపై ఇది తిరుగు బాటు బావుటా ఎగరవేసింది. మాండలిక పదా లు అధికంగా ఇందులో వాడారు. సందర్భాన్ని బట్టి ఆయన పదాల విచిత్రరూపాలు కూడా చోటుచేసుకున్నాయి. హిందీ సాహిత్యంలో ఈ నవల ఒక విస్ఫోటనంలా ప్రభావం చూపింది-సమకాలీన రాజకీయ, సామాజిక వికృత ధోరణు లను తీవ్రంగా గర్హించే నవలయింది. కళాశాల రాజకీయాలను సహితం శుక్లా వదలలేదు. గ్రామ జీవితం ఎలా కలుషితమయిందో దీనిలో కళ్లకు కట్టినట్లు చూపారు. ఉమ్మడి కుటుంబ నేపథ్యంలో నవల నడిచింది.

రంగనాథ్ మామ ఆయుర్వేద వైద్యుడు. ఆయనే కుటుంబం పెద్ద. అన్ని వ్యవహారాలలో కలుగజేసుకునే తత్వం. అతని నమ్మినబంటు శనీచర్. అతను తొక్కని అడ్డదారి లేదు. గ్రామ సభకు నేత అతడే. గ్రామంలో జూదగృహం వుంటుంది. రామ్‌దీన్, రుప్పన్, బద్రీ, లంగడ్, జోగ్‌నాథ్ మొదలైన పురుషపాత్రలెన్నో వున్నాయి. బేలా అనే స్త్రీ పాత్ర ఒక్కటే కనిపి స్తుంది. ఆమె తండ్రి గయాదీన్ బట్టల వ్యాపారి. ఈ పాత్రలతో శుక్లా ఈ నవలను




అత్యద్భుతంగా రచించి దీనికి ఆధునిక హిందీ సాహిత్యంలో అగ్రేసరస్థానం సమకూర్చారు. ఈ నవలను గురించి ఆయన చెబుతూ దేశంలో అవినీతి, మోసం, బంధుప్రీతి ఇంకా ఘోరంగా వున్నాయనీ, అందుకే నలభై ఏళ్ల తర్వాత కూడా ఈ నవల నిస్సందేహంగా వర్తిస్తుందని స్పష్టప రిచారు. విశ్లేషకులు దానిని ప్రేమచంద్ 'గోదాన్' నవల స్థాయిలో చేర్చారు.

శ్రీలాల్ శుక్లా సాహిత్య అకాడమీ, మధ్యప్ర దేశ్ హిందీ సాహిత్య పరిషత్, ఉత్తరప్రదేశ్ హిందీ సంస్థాన్, కురుక్షేత్ర విశ్వవిద్యాలయం, లోహియా సమ్మాన్, మైథిలీ శరణ్‌గుప్తా స మ్మాన్, వ్యాససమ్మాన్ యశ్‌భారతీ సమ్మాన్ వంటి పురస్కారాలు అందుకున్నారు. భారత ప్రభుత్వం 'పద్మభూషణ్' గౌరవంతో సత్కరిం చింది. ఆయన 2011 అక్టోబరు 28న పరమప దించారు. శ్రీలాల్‌శుక్లా యశోనామం సాహితీ రంగంలో శాశ్వతంగా విరాజిల్లుతుంది.

*– గోవిందరాజు రామకృష్ణారావు*

# సందేశం

- ఎం. హనుమంతరావు

"ప్రేక్షకులకు నమస్కారం! ఈరోజు మన 'మంచి మనీషి' కార్యక్రమంలో తన అనుభవాలు వీక్షకులతో పంచుకునేందుకు నవలా రచనా సమ్రాట్ కాకర కాయల సుబ్బారావుగారు మన స్టూడియోలో మనతోపాటు ఉన్నారు. వారి అనుభవాలూ, సందేశం విందాం. నమస్కారం, సుబ్బారావుగారూ! కార్యక్రమంలో ముందుగా మీ బాల్యం గురించి నాలుగు విషయాలు చెప్పండి"

"నేను పశ్చిమ గోదావరి జిల్లా ముంగండలో పుట్టాను. ఆ ఊళ్లోనే కొన్ని శతాబ్దాల కిందట ప్రసిద్ధ ఆలంకారికుడు జగన్నాథ పండితరాయలు కూడా పుట్టాడట. అయితే ఇప్పుడు ప్రజలు ఆ సంగతే మర్చిపోయారు. ముంగండ పేరు చెప్తే, 'కాకర కాయల సుబ్బారావుగారు పుట్టిన ఊరా? !' అంటారు"

"మీరు పుట్టిన తేదీ? "

"జనవరి 14న నేను పుట్టాను. అదేం విచిత్రమో లేక దైవలీల అనాలోగానీ, నేను పుట్టక ముందు నుంచే, నా జన్మదినాన్ని ఈ రాష్ట్రమంతా సంబరంగా పండగ జరుపుకునే ఆనవాయితీ పుట్టింది"

"మీ విద్యాభ్యాసం విశేషాలు? "

"నేను చిన్నప్పట్నుంచీ ఏక సంథాగ్రాహిని. ఏ విద్య అయినా ఇలా వినగానే, అలా నాకు పట్టుబడేది! అయితే నా విద్యాభ్యాసం మా ఊళ్లోనే ప్రారంభమై ముగిసింది. దానికి కారణం, విద్య పట్ల నా దృక్పథమే. ఈ డిగ్రీలూ, ఎమ్మేలూ, పీహెచ్‌డీలూ ఎవరైనా సంపాదించవచ్చు. నేను కోరుకుంటే పదహారు పీహెచ్‌డీలు సంపాదించేవాణ్ని. కానీ వాటివల్ల ఏం ప్రయోజనం? నాకు చిన్నప్పటి నుంచే సృజనా శక్తి, అసాధారణ ప్రతిభ వచ్చేశాయి. కర్ణుడికి కవచకుండలాలు సహజంగా అబ్బినట్టు. ఎన్నోవేల మంది సగటు మనుషులు ఈ ఎమ్మేలూ, పీహెచ్‌డీలూ సంపాదించుకోగలరు. కానీ నేనూ అదే దోవపడితే, భగవంతుడు నాకిచ్చిన అపారమైన సృజన శక్తికి నేనెలా న్యాయం చేస్తాను? అసలే నేను ఎవ్వరి రుణం ఉంచుకోవటానికి ఇష్టపడని స్వతంత్ర జీవిని. అందుకని ఆ భగవంతుడి రుణం ఉంచుకోకుండా, ఆయన ఇచ్చిన సృజన శక్తిని ఇతర ప్రజల ప్రయోజనం కోసం ధారపోయాలనే పవిత్రాశయంతో చదువు త్వరగానే చాలించాను. అయితే చదువులలో మర్మమెల్లా గ్రహించేశాను"

"మీ మొదటి నవల ఎప్పుడు ప్రచురితమైంది? "

"నేను తల్లి గర్భంలో ఉండగానే కథలు చెప్పేవాడినని మా అమ్మమ్మ చెప్తుండేది. అవి వినటానికి మా ఊరిజనమే కాక పక్క ఊళ్ల నుంచీ కూడా తండోపతండాలుగా జనం వచ్చేవాళ్లట. నా తొమ్మిదో ఏట 'కాకమ్మ కబుర్లు' ప్రచురితమైంది. ఇది మా తాతగారి సొంతప్రెస్సులో ముద్రించారట. ఆయనకు ఉత్తమ సాహిత్యం అంటే ఆసక్తి! ప్రెస్సులో కంపోజిటర్లు ఈ నవల కంపోజ్ చేసేటప్పుడు ఉత్కంఠ భరించలేక మొదటి చాప్టర్

## చతుర కత

తర్వాత ఆఖరు చాప్టర్ కంపోజ్ చేసేశారట. అప్పటి నుంచీ ఇప్పటి వరకూ నాలుగొందల నవలలు రాశాను. అందులో సుమారు నూటా అరవై ప్రచురితమైనాయి. అందులో నూటాయాభై నవలలు మా తాతగారు స్థాపించిన 'ఉత్తమ సాహితీ ప్రెస్సు'లోనే ప్రచురితమవటం మరో విశేషం. ఆ ప్రెస్సులో అన్ని నవలలు మరే రచయితవీ నేటి వరకూ ప్రచురితం కాలేదు. ఏడాదికి నాలుగన్నా నా నవలల్ని ప్రచురణకు ఇవ్వకపోతే ప్రెస్సు సిబ్బంది నిరశన వ్రతం చేస్తారు"

"మీ నవలలు పత్రికల్లో కూడా వచ్చాయా? "

'రాకేం రెండు మూడు వచ్చాయి. కొన్ని ఉత్తమ పత్రికలూ, కొందరు అభిరుచి గల సంపాదకులూ, పువ్వు పుట్టగానే పరిమళించినట్టు పరిమళించిన నా ప్రతిభను త్వరగానే గుర్తించారు. నిడదవోలు నుంచీ 'ఆనందప్రభ' మాసపత్రిక

నడచిన అయిదు నెలలూ, దాన్లో నా నవల 'కాగితం పడవ' ధారావాహికంగా వచ్చింది. జంగారెడ్డి గూడెం నుంచి దాదాపు ఏణ్ణర్థం పాటు విజయవంతంగా నడిచిన 'సుజన మిత్ర' నా నవలలు ప్రచురించటానికి ఎంతో ఇష్టపడేది. నా నవలల వల్ల వాళ్ల పత్రిక సర్క్యులేషన్ గణనీయంగా పెరిగి రెండంకెల నుంచీ ఒక్క ఏడాదిలోనే మూడంకెలు చేరుకుంది. కానీ కొన్ని చేదు అనుభవాల వల్ల ఆ తర్వాత నేను నా నవలలు పత్రికలకు పంపటం మానేశాను"

"ఎలాంటి చేదు అనుభవాలు సార్, అవి? "

"ఇలాంటి కార్యక్రమంలో అవన్నీ బహిరంగంగా చెప్పమంటారా? ఏముందీ.. మామూలు బలహీనతలే. నా నవలలు చూసి, సంపాదకులు అసూయపడేవారు. ఈ రచయిత జ్ఞానపీఠ్, నోబెల్ స్థాయివాడని వాళ్లు కనిపెట్టేశారు. మీకు తెలుసుగా, ఆంధ్ర దేశంలో ఈ అసూయలు ఎక్కువ. పైకొచ్చేవాడిని ఎలాగైనా అణగ దొక్కాలని చూస్తారు. సంపాదకులంతా ఒక యూనియన్‌లాగా ఏర్పడి నా నవలలు పత్రికలలో అచ్చవకుండా అడ్డుపడేవాళ్లు. అయినా నాకు చిన్నప్పట్నుంచే పట్టుదల ఎక్కువ. ఎన్నో కష్టాలకు ఓర్చి నా నవలలు నేనే ముద్రించేవాణ్ని. ఎన్ని కష్టాలొచ్చినా కేవలం నవలారచన కోసం, నన్ను పుట్టించిన ఆ సరస్వతీదేవిని నిరుత్సాహపరచకూడదనే తపనతో ఈ సారస్వత సేవకే నా జీవితం అంకితం చేశాను. దాన్ని గురించి నాకు విచారం లేదు. ఒక నన్నయా, ఒక పోతనా, ఒక నేనూ.. ఇలా ఎందరమో పూనుకోకపోతే ఆంధ్ర సారస్వతం ఏమవుతుంది? నా 'చిన్నతనం' నవలలో ఒక మహారచయితగా ఈ స్థాయికి ఎదగటానికి నేనుపడ్డ కష్టాలన్నీ కళ్లకు కట్టినట్లు వర్ణించాను"

"మిమ్మల్ని ప్రభావితం చేసిన రచయితలు? "

"నేను చిన్నప్పుడు బుచ్చిబాబు, గోపీచంద్, చలం, కొ.కు., రావి శాస్త్రిలాంటివాళ్ల నవలలు ఆపోశనం పట్టేశాను. నాకు తొమ్మిది పదేళ్లొచ్చేప్పటికే వీరందరి రచనాశైలిలో, శిల్పంలో దోషాలు క్షుణ్ణంగా గ్రహించగలిగాను. పదో ఏట నుంచే నా సొంతబాణీలో రాయడం మొదలెట్టాను. అందుకే నా నవలల్లో పాత నవలాకారుల దోషాలు తొంగి చూడకుండా జాగ్రత్తపడటానికి వీలయింది. ఇక ఇప్పుడు వస్తున్న నవలలంటారా.. అవి నేను చదవను. చదవదగ్గ నవలలు రావటం లేదని నా అభిప్రాయం. రాశి తప్ప వాసిలేదు"

"మీ అభిమాన విదేశీ నవలాకారులు? "

"టాల్‌స్టాయ్, గోర్కీ ఫర్వాలేదు. కానీ వాళ్ల పరిధి పరిమితం. మామ్, డికెన్స్‌లాంటివాళ్లు కూడా బాగానే రాస్తారుగానీ సమాజానికి శక్తిమంతమైన సందేశం ఇవ్వరు. ఆస్టిన్ మరీ సుదీర్ఘంగా రాస్తుంది. మార్క్‌ట్వేన్ హాస్యం రాయగలడుగానీ ఇతర రసాలు పండించలేడు. మిగతా రచయితల నవలలు నేను చదవను. ఎందుకంటే వాళ్ల ప్రభావం నా సహజశైలిని చెడగొట్టేస్తుందని నా భయం"

"మీరు పొందిన బహుమతులూ, సత్కారాల గురించి చెప్తారా? "

"మొదటి నుంచీ నేను ఈ సత్కారాలకూ, సన్మానాలకూ పూర్తిగా విముఖుడిని. అసలు ఈ




సన్మాన సభలవాళ్లు నా దగ్గరకు రారు. వాళ్లకి నేనంటే భయం. అయినా అభిమానుల ఒత్తిడి వల్ల లెక్కలేనన్ని సన్మానాలు పొందాను. నేను కొత్తగా కట్టుకున్న ఇంట్లో నాకు సమర్పించిన సన్మానపత్రాలూ, బహుమతులూ, షీల్డులూ ఉంచటంకోసం రెండు గదులు కేటాయించాను. కానీ నాకు సన్మానాలు సుతరామూ ఇష్టం ఉండవు. నాకు జరిగిన సన్మానాల గురించి చెప్పుకోటం కూడా నాకు ఇష్టంలేదుగానీ మీరు మరీమరీ అడుగుతున్నారు కాబట్టి జ్ఞాపకం ఉన్న ఒక్కటి ప్రస్తావిస్తాను. అయిదేళ్ల కిందట మా ప్రెస్ వర్కర్లు యావన్మందీ కలిసి నాకు ఘనసన్మానం చేసి, 'నవలా రచనా సమ్రాట్' అని, 'దాన వీర' అనీ రెండు బిరుదులిచ్చారు. మా ప్రెస్‌లోని పనివాళ్లే కాకుండా వారి కుటుంబ సభ్యులూ, బంధుమిత్రులూ అందరూ వచ్చి నన్ను పూలమాలలతో, ప్రశంసలతో ముంచెత్తేశారు. సన్మానం తరవాత జరిగిన విందుకే నాకు దాదాపు పదిహేను వేలు ఖర్చయిందంటే, సభకు ఎందరు అభిమానులు వచ్చివుంటారో మీరు ఊహించుకోవచ్చు"

"మీ నవలలు సినిమాలుగా వచ్చాయా? "

"ఈ కాలపు సినిమాల దిగజారుడు ధోరణుల గురించి నేనేమీ చెప్పను. ఎందుకంటే నాకు పరనింద చేయటం అంటే ప్రాణాంతకంగా ఉంటుంది. అయితే, ఇప్పుడొచ్చేవన్నీ పుచ్చుకథల చచ్చు సినిమాలు. యోగ్యులైన డైరెక్టర్లు ఎక్కడున్నారు, మంచి నవలల్ని సినిమాగా మలిచేందుకు? మంచి సినిమాలు చూసేందుకు ప్రేక్షకులెక్కడ ఉన్నారు? ఎంత చెత్త నవలయితే, అంత విజయవంతమైన సినిమా అవుతుంది. ఏదో పేరుకోసమో, డబ్బుకోసమో తహతహలాడే చిల్లర నవలాకారుల శ్రేణికి నేను దిగలేను. ఏం చేయనూ, అది నా బలహీనత!"

"సరే, చివరగా యువతరానికి మీరిచ్చే సందేశం? "

"ఏముంది, ఈకాలం యువతలో అహంకారం పెచ్చుపెరిగి, వినయ గుణం కొరవడుతున్నది. నా అంత గొప్పవాళ్లు లేరంటూ సొంతడబ్బాలు కొట్టుకోవడం ఎక్కువవుతున్నది. ఇది మంచి పద్ధతి కాదు. ఎవడి డబ్బా వాడు కొట్టుకుంటే, దాన్లో హుందాతనమూ లేదూ, విశ్వసనీయతా లేదు. 'ఆకులో ఆకు', 'పూవులో పూవు' అనే నా రెండు అద్భుతమైన నవలల్లో ఈ విషయాన్ని న భూతో నభవిష్యతి అన్నట్టు విశ్లేషించి చూపాను. అలాగే, 'ఎగిరి పడకు', 'డంబాల రాయుడు' నవలల్లో వినయవిధేయతల ప్రాధాన్యాన్ని ఏ బెంగాలీ, మరాఠీ, తమిళ, మలయాళ నవలలకూ తీసిపోకుండా విపులీకరించాను. ఇలాంటి ఉత్తమ సాహిత్యం నుంచీ యువత స్ఫూర్తి పొందాలి. వాళ్లకు ఇంతకంటే మంచి కరదీపికలా మార్గదర్శ

# FORM IV (See Rule 8)

**Statement about ownership and other particulars of CHATURA.**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **RAMOJI RAO, VASUNDHARA PUBLICATIONS** 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 2013


కాలూ ప్రపంచ సాహిత్యంలో మరెక్కడా దొర కవు. జీవితంలో నేను ఇంత సాధించగలిగానంటే దానికి కారణం ఒక్కటే. అది నా వినయశీలం వల్లనే సాధ్యమైంది. చిన్నప్పటినుంచీ నేను నిగ ర్విని. అహంకారం అంటేమిటో నాకు ఇప్పటికీ తెలీదు. 'నా అంతవాడు లేడు- అన్న అహంకారం పతనానికి తొలిమెట్టు'ని నేను నా 'గురివెంద గింజలు' నవలలో రాసిన వాక్యమే నా సందేశం!"

"సుబ్బారావుగారూ! మీరు ఇంత శ్రమ తీసుకుని మా స్టూడియోకి వచ్చి మీ రచనల గురించీ, మీ గురించీ ఇన్ని విశేషాలు మా ప్రేక్షకులతో పంచుకున్నందుకు ధన్యవాదాలు. వచ్చేవారం మరొకమంచి మనీషితో ముఖాముఖి కలుసుకుందాం.. నమస్కారం!"

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**వెలసిరి మధుసూదన్**

ఇం. నెం. 7-9-125, శ్రీరాంనగర్‌కాలనీ,
పానగల్ రోడ్, నల్గొండ
పిన్: 508001

## చతురంగం - 23 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ది | 2 గు | | 3 వా | ర | 4 ణా | 5 శి | | 6 క | 7 న్ను |
| 8 అ | న్న | 9 దా | త | | 10 దా | వా | న | ల | ము |
| | 11 మా | నం | | 12 గం | | జీ | | త | |
| 13 తా | వి | | 14 న | గ | లు | | 15 సు | | 16 ర |
| ట | | 17 కా | మి | | | 18 రా | మా | 19 య | ణం |
| 20 కి | 21 కా | | 22 త | 23 ప | 24 ము | | 25 రు | యా | |
| | 26 కా | 27 య | | 28 తి | న | 29 ము | | 30 తి | 31 ట్టు |
| 32 లా | | 33 ము | ప్పు | | 34 స | ర | 35 ము | | మె |
| 36 ఘ | 37 ట | న | | 38 జా | బు | | 39 ది | 40 నం | |
| 41 వం | పు | | 42 వా | జి | | 43 శ | త | క | ము |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. తల్లాప్రగడ భాస్కరరావు, న్యూ నల్లకుంట, 2. నండూరి నాగేశ్వరరావు, బేగంపేట, 3. యల్లాప్రగడ కృష్ణమూర్తి, అలకాపురి, హైదరాబాద్, 4. కృష్ణకిషోర్ యజ్ఞమూర్తి, పుణె, 5. కొండుపర్తి జగదంబ, సికింద్రాబాద్, 6. దైతా కృష్ణకుమారి, ఎ.ఎస్. రావు నగర్, 7. ఎస్. ఎస్. షిర్శి, తిరుపతి, 8. సి.జి.ఎస్. రావు, ఎ.ఎస్. రావు నగర్, 9. బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం, 10. డా. శివభూషణం, కర్నూలు, 11. గండ్లూరి బలరామశాస్త్రి, నాచారం, 12. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 13. పి.ఆర్.ఎం. దినేష్, భాకరాపేట, 14. పి. రాజేశ్వర్, సంగారెడ్డి, 15. నోముల సురేందర్‌రావు, హబ్సిగూడ, 16. అవ్వారి సామ్రాజ్య లక్ష్మి, మోతినగర్, 17. బందా శివనారాయణ శ్రీనివాసరావు, చందానగర్, 18. డా. సి. జనార్ధనసింగ్, నల్లకుంట, 19. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 20. వెల్చేరు సూర్యకుమారి, విజయనగరం, 21. ఆర్. గోపాలరావు, మన్సూరాబాద్, హైదరాబాద్, 22. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 23. ఎం. రామచంద్రరావు, హిల్ కాలనీ, నల్గొండ, 24. చల్లపల్లి మాధురి, రేవేంద్రపాదు, గుంటూరు జిల్లా, 25. నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖ, 26. గేదెల రామారావు, ఏలూరు, 27. పి.వి. సుబ్బలక్ష్మి, విశాఖ, 28. పి. దేవసేనమ్మ, సిద్ధార్థనగర్, హైదరాబాద్, 29. డి. సుధాదేవి, సీతారాంబాగ్, హైదరాబాద్, 30. ఎ.దుర్గాప్రసాదరావు, కర్నూలు, 31. ఆండ్ర అచ్యుతరామయ్య, తణుకు, 32. ఎ. సత్యనారాయణ, కళ్యాణదుర్గం, 33. బి. శాంతి, విజయవాడ, 34. వి.యస్. మూర్తి, గుడిమల్కాపూర్, 35. లకిరెడ్డి వెంకటరెడ్డి, నూజివీడు, 36. సి. విజయ భాస్కర్‌రెడ్డి, ప్రొద్దుటూరు, 37. గుర్రాల శ్రీనివాసరావు, గుంటూరు, 38. ఎ. అరుంధతి, పుణె, 39. మహమ్మద్ తహసీన్ అలి, వడ్డెపల్లి, వరంగల్ జిల్లా, 40. సరిపల్లి నాగభూషణరావు, విజయనగరం, 41. సి. సత్యసీతామహలక్ష్మి, శ్రీకాకుళం, 42. అనంతుల సుబ్బారావు, గుంటూరు, 43. గురజాల వరలక్ష్మి, రావులపాలెం, 44. పి. సంధ్య శ్రీలక్ష్మి, గుంటూరు, 45. ఆర్. నాగలక్ష్మి, శ్రీకాకుళం, 46. సంధ్య శ్రీనివాసులు, మైసూరు, 47. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 48. ఎం.వి.జె. శర్మ, అర్సవిల్లి, 49. మద్దూరి లక్ష్మీశేఖర్, తిరుపతి, 50. జె. ఇందిర, ట్రూప్‌బజార్, 51. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్, 52. బి. సరస్వతీదేవి, విజయవాడ, 53. పక్కి శ్రీదేవి, మెట్టపల్లి, విజయనగరం జిల్లా, 54. ఆదుర్తి విజయామూర్తి, విశాఖ, 55. వానపల్లి వెంకటసత్యగంగరాజు, విశాఖ, 56. భారతం సూర్యనారాయణమూర్తి, కాకినాడ, 57. సి. ఉమాబాల, దోమల్‌గూడ, 58. కోనే నాగవెంకట ఆంజనేయులు, విశాఖ, 59. ఎం. శంకర్, ముంబయి, 60. వి. రెడ్డివం శీకృష్ణ, రాయచోటి, 61. ధరణి పద్మాసన, అశోకనగర్, హైదరాబాద్, 62. కర్రా వైదేహి, శాలివాహననగర్, హైదరాబాద్, 63. భవ్య కుమారి, రేపల్లె, 64. డా. తూములూరి పార్థసారథి, చైతన్యపురి, 65. పి. సుజాత, గుంటూరు, 66. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 67. నల్లమోతు సుబ్బారావు, గుంటూరు, 68. ఆండ్ర రామలక్ష్మి, తణుకు, 69. కె.ఎస్. లక్ష్మి, సికింద్రాబాద్, 70. తల్లాప్రగడ ప్రభాకర్, బెంగళూరు, 71. కె. రమేశ్, గండిపాలెం, నెల్లూరు జిల్లా, 72. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 73. మతుకుమల్లి లలిత, మెహిదీపట్నం, 74. అరుణకుమారి, నందిగంపాడు, ప.గో. జిల్లా, 75. చుండూరు అప్పలనరసింహం, బాచుపల్లి, 76. డి. అరుణశ్రీ, కరీంనగర్, 77. కొత్తపల్లి ప్రసాదరావు, టెక్కలి, 78. గరికిపాటి శ్రీచైతన్యకృష్ణ, కాకినాడ, 79. ఎస్.వి.హెచ్. కల్యాణి, కర్మన్‌ఘాట్, 80. ఎ. విఘ్నేశ్వరరావు, పర్లాకిమిడి, 81. కె.వి. రమణ, హైదరాబాద్, 82. ఆలూరి పార్థసారథి, చెన్నై, 83. బి.వి. రవికుమార్, తెనాలి, 84. ఇందన మల్లిఖార్జున్‌రావు, ఏలూరు, 85. పారుపల్లి వెంకటేశ్వరరావు, నల్లకుంట, 86. నియాజ్ అలి, హైదర్‌గూడ, 87. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 88. తల్లాప్రగడ మధుసూదనరావు, బెంగళూరు, 89. అద్దంకి సీతాదేవి, మలక్‌పేట, 90. అ. నరసింహావతారం, అనంతపురం, 91. సుతారి బాబు, పెద్దలింగారెడ్డిపల్లి, మెదక్ జిల్లా, 92. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 93. ఎం. వసంత, బోరబండ, 94. ఎం. ఫణికుమార్, బోరబండ, 95. టి.లతాదీపిక, విశాఖపట్నం 96. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, తూ.గో.జిల్లా, 97. మద్దూరి లక్ష్మీరాజ్యం, ఎర్రగడ్డ, 98. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 99. నందుల మహలక్ష్మి, రామంతాపూర్, 100. చి.పు. శాస్త్రి, నిజామాబాద్, 101. నీలగారు సందీప్, రాయదుర్గం, 102. వి. జయశ్రీ, మౌలాలి, 103. బి. రామమోహనరావు, సరూర్‌నగర్, 104. కె.ఎల్.ఎన్. రావు, నల్లకుంట, 105. చిట్టిపెద్ది కోటయ్యశాస్త్రి, కాకినాడ, 106. రాయబారపు సంజీవ్‌కుమార్, హన్మకొండ, 107. తూములూరు సత్యనారాయణమూర్తి, ఖమ్మం, 108. బి. నేహారెడ్డి, అక్కాయపల్లి, కడప జిల్లా, 109. కె. వెంకట బ్రహ్మమ్మ, బాపట్ల, 110. మంచాళ లక్ష్మణరావు, విశాఖ, 111. కరణం సుధీంద్రరావు, కర్నూలు, 112. బద్దెపూడి లక్ష్మీసుశీల, చీరాల, 113. పిశుపాటి లక్ష్మీప్రసన్న, కూకట్‌పల్లి, 114. నార్నె చంద్రబాబునాయుడు, ఇంకొల్లు, 115. డా. వి. వెంకటరమణయ్య, కడప, 116. కె.ఇ. నిలమంగై, ఈస్ట్ ఆనందబాగ్, 117. పూడిపెద్ది నీలవేణి, శృంగవరపుకోట

# చతురంగం - 24 ఆధారాలు

## అడ్డం

1. స్త్రీ, అల్లెతాడు (2)
2. ఒట్టు, కొలత (4)
5. నాగలి, ఒకప్పటి శృంగార నర్తకి (2)
7. స్త్రీ (3)
8. దిక్కు (2)
10. సంతానం (3)
11. ఎల్లప్పుడు (4)
13. తెలుగులో కష్టాలు (3)
14. ప్రసిద్ధ టీవీ యాంకరు (2)
15. తిరగబడిన మెడల్ (3)
17. నీళ్ళు, చారు (2)
18. మీరిప్పుడు పూర్తిచేస్తున్నది (4)
20. నిలువు పన్నెండే (2)
21. నమస్కారాలు (3)
22. తల్లి .. అటునుంచి (2)
24. కొండజాతులవారు దేవుణ్ణి ఇలా అంటారు (3)
25. అర్జునుడు ఇందులో ఘనుడు (4)
26. నిలువు 21 తరువాతిది (3)
27. ఏనుగు, కోతి, నలుపు (2)
29. శభాష్‌లాగే మెచ్చుకోలు మాట.. అటునుంచి (2)
30. నాయకుడు (2)
31. బదరీఫలం (4)
32. ఉత్తచేయి (4)
33. ఊడ్చే ఉపకరణం (3)

## నిలువు

1. శబ్దం (2)
2. విగ్రహం.. తడబడింది (3)
3. తోట కాపలా కాసేవాడు (2)
4. స్త్రీ (3)
6. రావణుని నివాసం (2)
7. ప్రగల్భాలు (3)
9. వంద (3)
10. సంతోషం (3)
11. యుద్ధం (3)
12. తలకిందులైన పాట (3)
13. భయం (3)
14. కొడుకులు (3)
16. గాలిపటం (3)
18. మీ చేతిలో ఉన్న పత్రిక (3)
19. కళ్లకు కట్టేవి, ముఖ్యంగా గుర్రాలకు కట్టేవి (3)
21. శ్రీరాముని కల్యాణం జరిపే రోజు (3)
23. జగపతిబాబు, ఆమని నటించిన చిత్రం (5)
24. స్వాతంత్ర్య సమరయోధుడు కొండా వెంకటప్పయ్యగారి బిరుదు (4)
25. పువ్వు (20)
26. తెలుగు బ్రోకరు (3)
27. కథకు వికృతి (2)
28. కిరాయి (3)
30. స్నేహితుడు (2)
31. నగదు నేడు, అరువు -- (2)

**నిబంధనలు**

✦ చతురంగాన్ని అదేపేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు. ★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 24

రూ.150/- బహుమతి

గడువు తేది : మార్చి 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | 3 | | 4 ము | | 5 | 6 |
| | | 7 | | | | 8 | 9 | | |
| | 10 | | తి | | 11 | | | 12 | |
| 13 | | | | 14 | | | 15 | | 16 |
| 17 | | | 18 | | | 19 | | 20 | |
| | | 21 | | | | 22 | 23 | | |
| | 24 | | | | 25 | | | | |
| 26 | | | | 27 | | | | | 28 |
| 29 | భ | | 30 | | | 31 | | | |
| 32 | | | | | 33 | | రు | | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా : ----------------------------------

----------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : ---------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

వారెవ్వా!

## వింత వింత రూపాల్లో కనువిందు చేసే టీ పాత్రలు









